*There is no area of the world that should not be investigated by scientists. There will always remain some questions that have not been answered. In general, these are the questions that have not yet been posed.*

*.... Linus Pauling*



రాష్ట్ర విద్యా పరిశోధన శిక్షణా సంస్థ,
తెలంగాణ, హైదరాబాదు





తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం వారిచే ఉచిత పంపిణీ

జీవశాస్త్రం

10 వ తరగతి

FREE

# జీవశాస్త్రం

## 10వ తరగతి







తెలంగాణ ప్రభుత్వ ప్రచురణ,
హైదరాబాదు

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం వారిచే ఉచిత పంపిణీ

# పచ్చని జీవనశైలికి ఆహ్వానం

మన చుట్టూ ఉన్న సమాజం కోసం, మనం నివసిస్తున్న ఈ భూమి కోసం
ఒక్క నిమిషం కేటాయించమని నేటితరం వినయంగా కోరుతోంది!

ఉత్తర ధృవం కరిగి ద్వీపంగా మారిపోతోంది! మంచు పర్వతాలు కరిగి పోతున్నాయి.
నశించిపోతున్న అడవుల సాక్షిగా, పకృతి వైపరిత్యాలు, కరువు కాటకాలు ప్రబలిపోతున్నాయి.
అవసరానికి మించిన వినియోగం, వృధా అవుతున్న విద్యుత్తు , నీరు...
రాబోయే తరాల కనీస అవసరాలను ప్రశ్నార్థకం చేస్తున్నాయి.
చెట్లు నరకడం, ప్లాస్టిక్ వాడకం, వన్య ప్రాణుల ఉనికికి విఘాతం కల్గిస్తున్నాయి.

భూమిలోనూ, నీటిలోనూ వందేళ్ళైనా కరిగిపోని ప్లాస్టిక్ కవర్లు,
పొంగి పార్లే మురికి నీళ్ళు రోగాలకు కారణమవుతున్నాయి.

తగ్గిపోతుంది నేలలో సారం.. పెరిగిపోతుంది భూమిలో తాపం..
రోజు రోజుకి తుఫాను, భూకంపాల తీవ్రత పెరిగిపోతోంది.
ఈ ఆపదల నుంచి మనల్ని, మన భావితరాలను కాపాడుకునే అవకాశం ఇప్పటికీ మనకుంది
రండి! పచ్చని జీవనశైలిని అలవరుచు కుందాం!
మొక్కలు పెంచుదాం! ప్లాస్టిక్ వదిలేద్దాం!
వృధా తగ్గిద్దాం! ప్రకృతి వనరులు మిగిలిద్దాం!
స్వచ్ఛమైన గాలి, నీటిని మన భావితరాలకందిద్దాం

సుజలాం సుఫలాం మలయజ శీతలాం  సస్యశ్యామలాం మాతరం అంటూ
గర్వంగా పాడుకునే భాగ్యం మన భావితరాలకు మిగిలిద్దాం.
రండి! పచ్చని జీవనశైలిని అలవర్చుకుందాం!



# జీవశాస్త్రం

## 10వ తరగతి

### సంపాదకులు


**డా॥ కమల్ మహేంద్రూ,** ప్రొఫెసర్,
విద్యా భవన్ ఎడ్యుకేషనల్ రిసోర్స్ సెంటర్,
ఉదయపూర్, రాజస్థాన్.

**డా॥ యశోధర కనేరియా,** ప్రొఫెసర్,
విద్యా భవన్ ఎడ్యుకేషనల్ రిసోర్స్ సెంటర్,
ఉదయపూర్, రాజస్థాన్.

**డా॥ స్నిగ్ధ దాస్,** ప్రొఫెసర్,
విద్యా భవన్ ఎడ్యుకేషనల్ రిసోర్స్ సెంటర్,
ఉదయపూర్, రాజస్థాన్.

**డా॥ ఎ. నాగమణి,** ప్రొఫెసర్,
యూనివర్సిటీ కాలేజ్ ఆఫ్ సైన్స్,
సైఫాబాదు, హైదరాబాదు.

**డా॥ నన్నూరు ఉపేందర్ రెడ్డి,** ప్రొఫెసర్ & హెడ్,
విద్యా ప్రణాళిక - పాఠ్యపుస్తక విభాగం,
యస్.సి.ఇ.ఆర్.టి., హైదరాబాదు.


### సమన్వయం


**డా॥ టి.వి.యస్. రమేష్,** కో-ఆర్డినేటర్,
విద్యా ప్రణాళిక-పాఠ్యపుస్తక విభాగం,
యస్.సి.ఇ.ఆర్.టి., హైదరాబాదు.





తెలంగాణ ప్రభుత్వ ప్రచురణ - హైదరాబాదు.


విద్యవల్ల ఎదగాలి
వినయంతో మెలగాలి

చట్టాలను గౌరవించండి
హక్కులను పొందండి

## పాఠ్యపుస్తక అభివృద్ధి మండలి

**శ్రీ జి. గోపాల్ రెడ్డి,** సంచాలకులు,
రాష్ట్ర విద్యా పరిశోధన శిక్షణ సంస్థ,
హైదరాబాదు.

**శ్రీ బి. సుధాకర్,** సంచాలకులు,
ప్రభుత్వ పాఠ్యపుస్తక ముద్రణాలయం,
హైదరాబాదు.

**డా॥ నన్నూరు ఉపేందర్ రెడ్డి,** ప్రొఫెసర్ & హెడ్,
విద్యా ప్రణాళిక - పాఠ్యపుస్తక విభాగం,
యస్.సి.ఇ.ఆర్.టి., హైదరాబాదు.

## రచయితలు

**డా॥ టి.వి.యస్. రమేష్,** కో-ఆర్డినేటర్,
విద్యా ప్రణాళిక - పాఠ్యపుస్తక విభాగం,
యస్.సి.ఇ.ఆర్.టి., హైదరాబాదు.

**శ్రీ సంజీవ్ కుమార్,** స్కూల్ అసిస్టెంట్,
జడ్.పి.హెచ్.యస్. ఆమ్దాపూర్,
నిజామాబాద్.

**శ్రీ వింజనంపాటి రాఘవరావు,** లెక్చరర్,
ఎ.పి.ఆర్.జె.సి. సర్వేల్, నల్గొండ.

**శ్రీ ప్రమోద్ కుమార్ పాఢి,** స్కూల్ అసిస్టెంట్,
జడ్.పి.హెచ్.యస్. బి.ఆర్.సి.పురం, శ్రీకాకుళం.

**శ్రీ సి.హెచ్. కేశవరావు,** లెక్చరర్,
డైట్, హనుమకొండ, వరంగల్.

**శ్రీ యస్.కె. తాజ్ బాబు,** ప్రధానోపాధ్యాయులు,
జడ్.పి.హెచ్.యస్. కరన్‌కోట్, రంగారెడ్డి.

**డా॥ యస్. విష్ణువర్ధన్ రెడ్డి,** స్కూల్ అసిస్టెంట్,
జడ్.పి.హెచ్.యస్. కద్తాల్, మహబూబ్‌నగర్.

**శ్రీ మేడా హరిప్రసాద్,** స్కూల్ అసిస్టెంట్,
జడ్.పి.హెచ్.యస్. ఆకుమల్ల, కర్నూల్.

**శ్రీ నోయల్ జోసెఫ్,** ప్రధానోపాధ్యాయుడు,
సెయింట్. జోసెఫ్స్ ఉన్నత పాఠశాల,
రామగుండం, కరీంనగర్.

**శ్రీమతి కె. ఉమారాణి,** స్కూల్ అసిస్టెంట్,
జి.హెచ్.యస్. అమీర్‌పేట్-నెం. 1,
జవహర్‌నగర్, హైదరాబాదు.

**శ్రీ ఇ.డి. మధుసూధన్ రెడ్డి,** స్కూల్ అసిస్టెంట్,
జడ్.పి.హెచ్.యస్.(బాలుర) కోస్గి,
మహబూబ్‌నగర్.

**శ్రీ బాణాల జయరాజ్,** స్కూల్ అసిస్టెంట్,
జెడ్.పి.హెచ్.ఎస్. చౌటుప్పల్,
నల్గొండ

## కవర్ పేజి, గ్రాఫిక్స్ & డిజైనింగ్

**శ్రీ కె. సుధాకరాచారి,** యస్.జి.టి.,
యు.పి.యస్. నీలికుర్తి, వరంగల్.

**శ్రీ కిషన్ తాటోజు,** గ్రాఫిక్ డిజైనర్,
యస్.సి.ఇ.ఆర్.టి., హైదరాబాదు.

**శ్రీ దార కన్నయ్య,** డి.పి.ఓ.
యస్.సి.ఇ.ఆర్.టి., హైదరాబాదు.

# ప్రవేశిక...

పాఠశాల విద్యలో 10వ తరగతి కీలకమైనదిగా, విద్యార్థి జీవితాన్ని మలుపుతిప్పేదిగా మనం భావిస్తుంటాం. జాతీయ, రాష్ట్ర విద్యాప్రణాళికలు విద్యాహక్కుచట్టాన్ని దృష్టిలో ఉంచుకుని చేస్తున్న పాఠ్యప్రణాళికా సంస్కరణలో భాగంగా నూతనంగా రూపొందిన పదోతరగతి పాఠ్యపుస్తకం మీ చేతుల్లో ఉంది. ఇంతవరకు పాఠశాలలో వివిధ అభ్యసన సన్నివేశాలలో పాల్గొంటూ విద్యార్థి నేర్చుకున్న భావనలను పునఃసమీక్షించుకుంటూ ఆయా అంశాలలో పాఠశాలస్థాయి పరిజ్ఞానం పూర్తిగా పొందేందుకు ఈ పుస్తకాలు ఎంతగానో దోహదపడతాయి. అదేవిధంగా పదోతరగతి తరువాత వివిధ పోటీ పరీక్షలలో పాల్గొనడానికి, ఇంటర్మీడియట్‌తో అనుసంధాన పరచడానికి కూడా ఉపయోగపడేలా పాఠ్యాంశాల రూపకల్పన జరిగింది.

నిరంతర సమగ్ర మూల్యాంకనం పాఠశాల విద్యలో అమలు జరుగుతున్నందున దానికి అనువుగా పాఠ్యాంశ బోధన సమయంలో విద్యార్థి అభ్యసనను అంచనా వేయడానికి వీలుగా బోధనాశాస్త్రంతో కలిపి రూపొందడం ఈ పాఠ్యపుస్తకం ప్రత్యేకత. కేవలం సమాచారాన్ని తెలుసుకోవడమే కాకుండా శాస్త్రీయ పద్ధతిలో విజ్ఞానశాస్త్రాన్ని అధ్యయనం చేయడానికి నూతన పాఠ్యపుస్తకాలు ఎంతగానో ఉపయోగపడతాయి. పదో తరగతికి బోర్డు పరీక్షలున్నందున సకాలంలో పాఠ్యప్రణాళికను పూర్తిచేయడం అవసరం. అయితే సిలబస్ పూర్తిచేయడం అంటే భావన పట్ల అవగాహన కలిగించడానికి సామర్థ్యాల సాధనకు కృషిచేయడం అని మరువరాదు. పాఠ్యవిషయాన్ని చదవడం, చర్చించడం, విశ్లేషించడం, ప్రయోగశాల కృత్యాలు, క్షేత్రపర్యటనలు, నివేదికల రూపకల్పన మొదలైన బోధనాభ్యసన ప్రక్రియలన్నీ తప్పనిసరిగా అమలు జరగాలి. గైడ్‌లు, క్వశ్చన్ బ్యాంక్‌లకు పరిమితమై సమాచారాన్ని బట్టీపట్టించడం వంటి పనులు నిషేధించాలి.

తరగతిలో నేర్పుతున్న విజ్ఞాన శాస్త్రం పిల్లల్లో శాస్త్రీయ పద్ధతిలో ఆలోచించడాన్ని, పనిచేయడాన్ని ప్రోత్సహించేదిగా ఉండాలి. ప్రకృతి పట్ల ప్రేమను పెంపొందించేదిగా ఉండాలి. ఇంతటి వైవిధ్యాన్ని నిర్మించడంలో ప్రకృతి పాటిస్తున్న నియమ నిబంధనలను అర్థం చేసుకొనేదిగా, అభినందించేదిగా ఉండాలి. శాస్త్రాధ్యయనం అంటే ఏదో ఒక కొత్తదాన్ని ఆవిష్కరిస్తూ పోవడం మాత్రమే కాదు. ప్రకృతిలో ఇమిడి ఉన్న అంతఃసూత్రాలను అర్థం చేసుకోవడంతో పాటు ప్రకృతి పరమైన సహసంబంధానికి, పరస్పర ఆధారితత్వానికి అంతరాయం కలగకుండా అడుగు వేయడం కూడా అవసరం.

ఉన్నత పాఠశాల స్థాయి పిల్లలు తమ చుట్టూ ఉన్న మారుతున్న ప్రపంచ స్వరూప స్వభావాలను అర్థం చేసుకోగలిగిన మానసిక స్థాయిని కలిగి ఉంటారు. అమూర్త భావనలను విశ్లేషించుకోగలిగిన విజ్ఞత కలిగి ఉంటారు. కేవలం సమీకరణాలు, సూత్ర సిద్ధాంతాల బోధనలతో వారి చురుకైన ఆలోచనా శక్తిని తృప్తి పరచలేము. అన్వయించుకోవడానికి, బహుళ ప్రత్యామ్నాయాలు అన్వేషించడానికి, సరికొత్త సంబంధాలు నెలకొల్పడానికి అనువైనదిగా తరగతి గది నిర్వహణ రూపుదిద్దుకోవాలి. విజ్ఞాన శాస్త్రం అధ్యయనం గది నాలుగు గోడలకు పరిమితమైనది కాదు. అటు క్షేత్రంతోనూ ఇటు ప్రయోగశాలతోనూ స్పష్టమైన సంబంధాలను కలిగి ఉంటుంది. కాబట్టి బోధనలో క్షేత్ర ప్రయోగాల ప్రాధాన్యత ఎంతో

ఉంటుంది. స్థానిక పరిసరాలతో ముడిపడినదిగా శాస్త్ర బోధన ఉండాలన్న జాతీయ విద్యా ప్రణాళిక-2005 సూచనలను తప్పని సరిగా పాఠశాలల్లో అమలు పరచడం అవసరం. విద్యాహక్కుచట్టం-2009 కూడా పిల్లలలో సామర్థ్యాల సాధనకు అత్యధిక ప్రాధాన్యతను ఇవ్వాలని సూచించింది. అలాగే విజ్ఞానశాస్త్ర బోధన వైజ్ఞానిక ఆలోచనలు కలిగిన నూతన తరాన్ని రూపుదిద్దేదిగా కూడా ఉండాలని తెలిపింది. ప్రతి పరిశోధన వెనక దాగి ఉన్న కృషిని, శాస్త్రవేత్తల ఆలోచనా సరళిని పిల్లలతో గుర్తింపజేయడమే విజ్ఞాన శాస్త్ర బోధనలో కీలకాంశం. పిల్లలు వివిధ అంశాల పట్ల తమ ఆలోచనలను, అభిప్రాయాలను స్వేచ్ఛగా వ్యక్తీకరించగలగాలి. తమదైన కోణంలో పరిష్కారాలు సూచించగలగాలి అన్న రాష్ట్ర విద్యా ప్రణాళిక పరిధి పత్రం-2011 ఆశయాల మేరకు రూపొందించిన ఈ నూతన విజ్ఞాన శాస్త్ర పాఠ్యపుస్తకాలు పిల్లలు వైజ్ఞానికంగా ఆలోచించగలిగిన స్వీయ పరిశోధకులుగా మారేందుకు తోడ్పడతాయి.

నూతన పాఠ్యపుస్తకాలు నిర్దేశించిన విద్యాప్రమాణాలు సాధించడానికి వీలుగా రూపొందాయి. తరగతి పూర్తయ్యేసరికి పిల్లల్లో విద్యాప్రమాణాలు పెంపొందించేందుకు అనువైన బోధనా వ్యూహాలను ఉపాధ్యాయులు రూపొందించుకోవాలి. నిరంతర సమగ్ర మూల్యాంకనాన్ని సమర్థవంతంగా అమలుచేయాలంటే బట్టీ విధానాలకు దూరంగా బోధనసాగాలి. పిల్లల ప్రగతిని నిర్మాణాత్మక, సంగ్రహణాత్మక పద్ధతులద్వారా మూల్యాంకనం చేసేందుకు అవసరమైన విధానాలలో ఉపాధ్యాయులు అవగాహన కలిగిఉండాల్సిన అవసరం ఉంది. నూతన పాఠ్యపుస్తకాలు కావలసిన విషయాన్ని అందించేవిగా మాత్రమే కాకుండా బోధనా విధానాలను, మూల్యాంకన పద్ధతులను కూడా ప్రతిబింబించేవిగా ఉండడం ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఎంతో ఉపయోగకరం.

ఈ నూతన పాఠ్యపుస్తకాల రూపకల్పనలో సహకరించిన విద్యాభవన్ సొసైటీ, రాజస్థాన్ వారికి పాఠ్యాంశాలను రూపొందించిన రచయితలకు, అనువాదంలో సహకరించిన ఉపాధ్యాయిని శ్రీమతి పులిపాటి పరమేశ్వరిగారికి పాఠ్యపుస్తకాన్ని అందంగా రూపొందించిన డి.టి.పి. బృందానికి, భాషాదోషాలు సరిచేసిన వారికి ధన్యవాదాలు. ఈ పాఠ్యపుస్తకాన్ని మరింత అర్థవంతంగా తీర్చిదిద్దేందుకు విద్యావేత్తలు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, విజ్ఞానాభిలాషుల సూచనలు, సలహాలను స్వాగతిస్తున్నాం. ఈ పాఠ్యపుస్తకాన్ని పిల్లలు అర్థవంతంగా ఉపయోగించుకోవాలంటే ఉపాధ్యాయుని పాత్ర కీలకం. పిల్లలలో విజ్ఞానశాస్త్ర ఆలోచనా సరళి మొగ్గతొడిగేలా శాస్త్రీయ దృక్పథం వెల్లివిరిసేలా నూతన పాఠ్యపుస్తకాలను వినియోగించడంలో ఉపాధ్యాయులు కృషి చేస్తారని ఆశిస్తూ...

విజ్ఞానాభి వందనాలతో...

**సంచాలకులు**

రాష్ట్ర విద్యా పరిశోధన శిక్షణా సంస్థ

హైదరాబాద్.

**ఉపాధ్యాయులారా...**

నూతన విజ్ఞానశాస్త్ర పాఠ్యపుస్తకాలను పిల్లలలో పరిశీలనా శక్తిని, పరిశోధనాభిలాషను పెంపొందించేవిధంగా రూపొందించారు. కాబట్టి ఉపాధ్యాయలోకం ఏమేమి చేయాలో ఏమేమి చేయరాదో పరిశీలిద్దాం.

- పదోతరగతి అనగానే పిల్లల్ని పరీక్షలకు సిద్ధం చేయడం ప్రథమ కర్తవ్యంగా సాగే బోధనా విధానాలకు స్వస్తి పలకాలి. మార్కుల పోటీగా కాకుండా సామర్థ్యాల సాధనా దిశగా బోధనాభ్యసన ప్రక్రియలు నిర్వహించాలి.
- గైడ్‌లు, క్వశ్చన్ బ్యాంక్‌లు ఉపయోగించడం, ముఖ్యమైన ప్రశ్నలను మాత్రమే చదివించడం, పరీక్షలలో ఎక్కువ మార్కులు పొందడానికి వీలైన పాఠాలపై మాత్రమే శ్రద్ధచూపడం వంటి అంశాలకు తావులేకుండా చూడాలి.
- తాను చదవడమే కాకుండా విద్యార్థులతో కూడా పాఠ్యపుస్తకాన్ని అసాంతం చదివించేలా కృషి చేయాలి. తద్వారా భావనలపై అవగాహన కలిగించాలి.
- స్వంతంగా రాయడానికి పిల్లలకు స్వేచ్ఛనివ్వాలి. పరీక్షలలో సైతం ఇలా సొంతంగా రాసిన సమాధానాలకే ప్రాధాన్యతనివ్వాలి. ఉపాధ్యాయుడు సేకరించి పిల్లలకు అందించాల్సిన సమాచార వివరాలు పాఠ్యపుస్తకంలో ఉంటాయి. వాటిని తప్పనిసరిగా తెలియజేయాలి.
- బోర్డు పరీక్షలలో సిలబస్ మొత్తానికి సమాన ప్రాధాన్యత ఉంటుంది. కాబట్టి అనుబంధం శీర్షిక తప్ప పాఠ్యపుస్తకంలో ఉన్న అంశాలన్నీ సిలబస్‌గానే పరిగణించాలి.
- ప్రతి పాఠం తరగతి గది బోధన, ప్రయోగశాల కృత్యాలు అని రెండుగా విభజించి ఉంటుంది. ప్రయోగశాల కృత్యాలు తప్పనిసరిగా పిల్లలతో చేయించాలి. ఇవి పాఠంలో అంతర్భాగంగా ఉంటాయి. కాబట్టి పాఠం పూర్తయిన తర్వాత చేయించవచ్చునని భావించకూడదు. ప్రయోగశాల కృత్యాలు నిర్వహించేటపుడు శాస్త్రీయ పద్ధతిలోని సోపానాలు అనుసరించేలా పిల్లలకు తర్ఫీదునివ్వాలి. ప్రతి ప్రయోగ కృత్యానికి పిల్లలతో నివేదికలు రూపొందించి ప్రదర్శింపజేయాలి.
- పాఠ్యపుస్తకంలో ఆలోచించండి, చర్చించండి, ఇవిచేయండి, నివేదికలు తయారుచేయండి, ఇంటర్వ్యూ నిర్వహించండి, గోడ పత్రికలో ప్రదర్శించండి. థియేటర్ డేలో పాల్గొనండి. క్షేత్ర పరిశీలన చేయండి, ప్రత్యేక దినాలను నిర్వహించండి. అను శీర్షికలలో ఇచ్చిన కృత్యాలు తప్పనిసరిగా నిర్వహించాలి.
- పాఠ్యబోధనలో మైండ్‌మ్యాపింగ్ చేయించడం. పిల్లలతో పాఠాన్ని చదివించి అర్థంకాని పదాలు గుర్తింపజేయడం, కృత్యాల నిర్వహణ, ప్రదర్శన-చర్చ, ముగింపు, మూల్యాంకనం అనే సోపానాలను పాటించాలి.
- ఉపాధ్యాయులను అడిగి తెలుసుకోండి, పాఠశాల గ్రంథాలయం, ఇంటర్నెట్‌లో పరిశీలించండి అనే అంశాలను బోధనలో తప్పని సరి భాగంగా పరిగణించాలి తప్ప వదిలివేయరాదు.
- అభ్యసనాన్ని మెరుగుపరుచుకుందాంలో ప్రశ్నల చివర ఇచ్చిన A.S. విద్యా ప్రమాణాన్ని సూచిస్తుంది.
- ఇంటర్నెట్ వంటి సాంకేతిక పరిజ్ఞానాన్ని విస్తృతంగా పిల్లలు ఉపయోగించుకోవడానికి పాఠ్యాంశానికి అవసరమైన వెబ్‌సైట్ల వివరాలు సేకరించి అందించాలి. పాఠశాల గ్రంథాలయంలో విజ్ఞానశాస్త్ర మ్యాగజైన్‌లు ఉండేలా శ్రద్ధ తీసుకోవాలి.
- పర్యావరణం, జీవ వైవిధ్యం మొదలైన అంశాల పట్ల అభిరుచులను కలిగించేందుకు సారస్వత సంఘకార్యక్రమాలను, వక్తృత్వం, చిత్ర లేఖనం, కవిత్వం, నమూనాల తయారీ వంటి కృత్యాలు రూపొందించి నిర్వహించాలి.
- నిరంతర సమగ్ర మూల్యాంకనంలో భాగంగా పిల్లల అభ్యసన స్థాయిని ప్రయోగశాలలోనూ, తరగతిలోనూ, క్షేత్ర పర్యటనలలోనూ నిశితంగా పరిశీలించి నమోదు చేసుకోవాలి.
- ఉపాధ్యాయుల మార్గదర్శనం కోసం బోధనాభ్యసన వ్యూహాలను, ఆశించిన అభ్యసన ఫలితాలను, తరగతి వారీగా, విషయం వారీగా, సిలబస్ వారీగా కరదీపిక రూపంలో తయారుచేసి పాఠశాలలకు అందివ్వడం జరిగింది. ఈ కరదీపిక సహాయంతో ఉపాధ్యాయులు ఉత్తమ బోధనాభ్యసన ప్రక్రియలను నిర్వహించి తద్వారా విద్యార్థులందరూ ఆశించిన అభ్యసన ఫలితాలు సాధించేలా కృషి చేయాలి.
- సైన్స్ అంటే పుస్తకంలో ఉన్న పాఠం చెప్పడం కాదు. పిల్లలను ఒక క్రమ పద్ధతిలో పరిష్కారాలు కనుగొనేవారిగా తీర్చిదిద్దడమేనని గుర్తిస్తారు కదూ...



**విద్యార్థులూ...**

విజ్ఞానశాస్త్రాన్ని అధ్యయనం చేయడం అంటే విజ్ఞానశాస్త్ర పరీక్షలో మంచి మార్కులు సాధించడం మాత్రమే కాదు దీని ద్వారా నేర్చుకొన్న అంశాలను, క్రమబద్ధంగా ఆలోచించడాన్ని, పనిచేయడాన్ని రోజువారీ జీవితంలో కూడా పాటించగలగాలి. ఇది జరగాలంటే విజ్ఞానశాస్త్రంలోని సిద్ధాంతాలను బట్టీ పట్టడం కాకుండా విశ్లేషణాత్మకంగా చదవాలి. అంటే భావనలను అర్థం చేసుకోవడానికిగాను వాటిపై చర్చిస్తూ, పరికల్పనలు చేస్తూ, వాటిని నిర్ధారించుకునేందుకు ప్రయోగాలు, పరిశీలనలు చేస్తూ మీ అభిప్రాయాలను జత చేస్తూ ముందుకు సాగాలి. ఈ కొత్త పుస్తకాలు మీరు ఇలా నేర్చుకునేందుకు తోడ్పడతాయి. ఇందుకోసం మీరు ఏమేమి చేయాలంటే...

- పదోతరగతిలో భావనల పరిధి కొంత విస్తృతంగా ఉంటుంది. కాబట్టి వాటిని అర్థం చేసుకోవడానికి ఉపాధ్యాయులు బోధించడానికన్నా ముందే పాఠాన్ని క్షుణ్ణంగా చదవాలి.
- పాఠ్యాంశంలోని విషయాలను ఆధారంచేసుకొని సొంతంగా నోట్సు తయారుచేసుకోవాలి. పాఠాన్ని చదివి కీలక పదాలను, భావాలను మీరు గుర్తించిన ముఖ్యాంశాలను నోటుపుస్తకంలో రాసుకోవాలి.
- పాఠంలో ఉపయోగించిన భావనల గురించి మీకేమి తెలుసో ఆలోచించాలి. వాటిని లోతుగా అర్థం చేసుకోవడానికి ఇంకా ఏ ఏ భావనలు తెలుసుకోవాలో గుర్తించండి.
- పాఠంలో ఇచ్చిన ఆలోచించండి, చర్చించండి, మీకు తెలుసా?, అనుబంధం అనే శీర్షికలలోని ప్రశ్నలు, అంశాలపై విశ్లేషణాత్మకంగా చర్చించడానికి, ప్రశ్నించడానికి సందేహించవద్దు.
- ప్రయోగం చేసే సందర్భంలోనో, పాఠాన్ని గురించి చర్చిస్తున్నప్పుడో మీకు కొన్ని సందేహాలు కలగవచ్చు. వాటిని స్వేచ్ఛగా, స్పష్టంగా వ్యక్తీకరించండి.
- భావనలు అర్థం చేసుకునేందుకు ప్రయోగాల పీరియడ్ తప్పనిసరిగా జరిగేలా ఉపాధ్యాయులతో కలిసి ప్రణాళిక వేసుకోవాలి. ప్రయోగాలు చేస్తూ నేర్చుకోవడంలో మీరు మరెన్నో విషయాలు కూడా నేర్చుకోగలుగుతారు.
- మీ సొంత ఆలోచనలతో ప్రయోగాలకు ప్రత్యామ్నాయాలు రూపొందించాలి.
- ప్రతి పాఠ్యాంశం ఏ విధంగా నిత్యజీవితంతో సంబంధం కలిగి ఉందో వెతకాలి. తరగతి గదుల్లో మీరు నేర్చుకున్న విషయాలు వ్యవసాయదారులు, వృత్తి నిపుణులు మొదలైన వారితో చర్చించాలి.
- ప్రకృతిని పరిరక్షించడానికి ప్రతి పాఠ్యాంశంలోని జ్ఞానం ఎలా ఉపయోగపడుతుందో పరిశీలించాలి. అమలుచేయడానికి ప్రయత్నించాలి.
- ఇంటర్వ్యూలు, క్షేత్ర పర్యటనలు చేసేటపుడు జట్టుగా పనిచేయండి. తప్పనిసరిగా నివేదికలు రూపొందించి ప్రదర్శించాలి. వాటిపై చర్చించాలి.
- ప్రతి పాఠానికి సంబంధించి మీ పాఠశాల గ్రంథాలయం, ప్రయోగశాల, ఇంటర్నెట్ ద్వారా ఏఏ అంశాలు పరిశీలించాలో జాబితా రాసుకోవాలి. అమలు చేయాలి.
- నోటుపుస్తకంలోనైనా, పరీక్షలోనైనా ఎపుడైనా సరే విశ్లేషిస్తూ మీ అభిప్రాయాలను జోడిస్తూ సొంతంగా మాత్రమే రాయాలి. గైడ్‌లు, క్వశ్చన్‌బ్యాంక్‌లు మొదలైనవి ఉపయోగించకూడదు.
- పాఠ్యపుస్తకంతో పాటు వీలైనన్ని ఎక్కువ అనుబంధ పుస్తకాలు చదవాలి.
- మీ పాఠశాలలో సైన్స్ క్లబ్ కార్యక్రమాలను మీరే రూపొందించుకోవాలి. నిర్వహించాలి.
- మీ ప్రాంతంలో ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు పరిశీలించి సైన్స్ తరగతి ద్వారా ఏమేమి పరిష్కారాలు సూచించవచ్చో పరిశీలించాలి.

## విద్యాప్రమాణాలు

| క్ర.సం. | విద్యాప్రమాణాలు | వివరణ |
|---|---|---|
| 1. | విషయావగాహన | పాఠ్యాంశాలలోని భావనలను అర్థంచేసుకొని సొంతంగా వివరించడం, ఉదాహరణలివ్వడం, పోలికలు భేదాలు చెప్పడం, కారణాలు వివరించడం, విధానాలను విశదీకరించగలుగుతారు. మానసిక చిత్రాలను ఏర్పరచుకోగలుగుతారు. |
| 2. | ప్రశ్నించడం, పరికల్పన చేయడం | విషయాన్ని అర్థం చేసుకోవడానికి, భావనలకు సంబంధించిన సందేహాలను నివృత్తి చేసుకోవడానికి, చర్చను ప్రారంభించడానికి పిల్లలు ప్రశ్నించగలుగుతారు. ఒక అంశానికి చెందిన ఫలితాన్ని సహేతుక కారణాలతో ఊహించగలుగుతారు. ప్రయోగ ఫలితాలు ఊహించగలుగుతారు. |
| 3. | ప్రయోగాలు, క్షేత్రపరిశీలనలు | భావనలను అర్థంచేసుకోవడానికి పాఠ్యపుస్తకంలో సూచించిన ప్రయోగాలు, సొంత ప్రయోగాలు చేయగలుగుతారు. పరికరాలను అమర్చగలుగుతారు, పరిశీలనలు నమోదు చేయగలుగుతారు, ప్రత్యామ్నాయ పరికరాలను సూచించగలుగుతారు, జాగ్రత్తలు తీసుకోగలుగుతారు, చరరాశులను మార్చి ప్రత్యామ్నాయ ప్రయోగాలు చేయగలుగుతారు. క్షేత్రపరిశీలనలలో పాల్గొని నివేదికలు తయారు చేయగలుగుతారు. |
| 4. | సమాచార నైపుణ్యాలు, ప్రాజెక్టు పనులు | పాఠ్యపుస్తకంలోని విభిన్న భావనలను అర్థం చేసుకోవడానికి అవసరమైన సమాచారాన్ని వివిధ పద్ధతులలో (ఇంటర్వ్యూ, చెక్‌లిస్ట్, ప్రశ్నావళి .....) సేకరించగలుగుతారు. సమాచారాన్ని విశ్లేషించి వ్యాఖ్యానించగలుగుతారు. ప్రాజెక్టు పనులు నిర్వహించగలుగుతారు. |
| 5. | బొమ్మలు గీయడం, నమూనాలు తయారు చేయడం ద్వారా భావ ప్రసారం | విజ్ఞానశాస్త్ర భావనలకు సంబంధించిన చిత్రాలను గీయడం, భాగాలను గుర్తించి వివరించడం, గ్రాఫ్‌లు, ఫ్లోచార్ట్‌లు గీయడం, నమూనాలు తయారు చేయడం ద్వారా అవగాహనను వ్యక్తం చేయగలుగుతారు. |
| 6. | అభినందించడం, సౌందర్యాత్మక స్పృహ కలిగి ఉండటం, విలువలు పాటించడం | విజ్ఞానశాస్త్రాన్ని నేర్చుకోవడం ద్వారా ప్రకృతిని, మానవశ్రమను గౌరవించడం, అభినందించడంతో పాటు సౌందర్యాత్మక స్పృహ కలిగి ఉంటారు. రాజ్యాంగ విలువలను పాటించగలుగుతారు. |
| 7. | నిజజీవిత వినియోగం, జీవవైవిధ్యం పట్ల సానుభూతి కలిగి ఉండటం | దైనందిన జీవితంలో ఎదురయ్యే సమస్యల పరిష్కారానికి నేర్చుకున్న విజ్ఞానశాస్త్ర భావనలను సమర్థవంతంగా వినియోగించుకోగలుగుతారు. జీవవైవిధ్య ప్రాధాన్యతను గుర్తించి, దానిని కాపాడటానికి కృషిచేయగలుగుతారు. |

# ఏ పాఠం ఏ పేజీలో...

# జాతీయ గీతం

- రవీంద్రనాథ్ ఠాగూర్



జనగణమన అధినాయక జయహే!

భారత భాగ్యవిధాతా!

పంజాబ, సింథ్, గుజరాత, మరాఠా,

ద్రావిడ, ఉత్కళ, వంగ!

వింధ్య, హిమాచల, యమునా, గంగ!

ఉచ్ఛల జలధి తరంగా!

తవ శుభనామే జాగే!

తవ శుభ ఆశిష మాఁగే

గాహే తవ జయగాథా!

జనగణ మంగళదాయక జయహే!

భారత భాగ్య విధాతా!

జయహే! జయహే! జయహే!

జయ జయ జయ జయహే!!

# ప్రతిజ్ఞ

- పైడిమర్రి వెంకట సుబ్బారావు

భారతదేశం నా మాతృభూమి. భారతీయులందరూ నా సహోదరులు. నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణం. దీనికి అర్హత పొందడానికి సర్వదా నేను కృషి చేస్తాను.

నా తల్లిదండ్రుల్ని, ఉపాధ్యాయుల్ని, పెద్దలందర్ని గౌరవిస్తాను. ప్రతివారితోను మర్యాదగా నడుచుకొంటాను. జంతువులపట్ల దయతో ఉంటాను.

నా దేశంపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందానికి మూలం.

పాఠం

# 1

# పోషణ



జీవులన్నిటికీ పెరుగుదల, మరమ్మత్తు వంటి జీవక్రియలను నిర్వర్తించడం కోసం ఆహారం అవసరం. జీవులు తమ శారీరక ఉష్ణోగ్రతను క్రమబద్ధీకరించుకోవడానికి కూడా ఆహారం అవసరం. అమీబా వంటి ఏకకణ జీవులు మొదలుకొని మానవుని వంటి బహుకణ జీవుల వరకు అనేక రకాల పదార్థాలను ఆహారంగా తీసుకుంటాయి. మానవ శరీరంలో వివిధ కణాలకు తమ విధులను నిర్వర్తించడానికి వివిధ రకాల పోషకాలు గల ఆహారం అవసరం అవుతుంది. ఆహార సేకరణ, పోషణ అనేది కణం నుండి కణానికి, జీవినుండి జీవికి విభిన్నంగా ఉంటుంది.

మీరు కింది తరగతులలో వివిధ రకాల జంతువులు ఆహారాన్ని ఎలా పొందుతాయో తెలుసుకున్నారు కదా! వాటిని ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకుందాం.

- *స్వయంపోషకాలు అనగానేమి? అవి తమ ఆహారాన్ని ఎలా పొందుతాయి?*
- *పరపోషకాలు అనగానేమి? అవి తమ ఆహారాన్ని ఎలా పొందుతాయి?*

ఇపుడు మనం స్వయంపోషణ, పరపోషణ విధానాలలో పోషణ ఎలా జరుగుతుందో తెలుసుకుందాం. చాలా మొక్కలను స్వయం పోషకాలని ఎందుకు అంటారో కూడా తెలుసుకుందాం.

## 1. స్వయంపోషణ (Autotrophic nutrition)

స్వయంపోషకాలు కాంతిశక్తిని ఉపయోగించుకుని రసాయనిక సమ్మేళనాలు తయారు చేసుకుంటాయని మనకు తెలుసు. అవి నేలలోని ఖనిజ లవణయుత నీటిని మరియు గాలిలోని కొన్ని వాయువులను కూడా వినియోగించుకుంటాయి. ఈ సరళ పదార్థాలను ఉపయోగించి పిండిపదార్థాలు, మాంసకృత్తులు, కొవ్వుల వంటి సంక్లిష్ట పదార్థాలను ఉత్పత్తి చేయగలవు. స్వయంపోషకాలైన మొక్కలలో ఉత్పత్తి అయిన ఈ పదార్థాలే అధిక మొత్తంలో జీవరాశులకు, శక్తినివ్వడానికి ఉపయోగపడుతున్నాయి.

దాదాపుగా మనం తినే ప్రతి పదార్థం ఎక్కువగా మొక్కలనుండే లభిస్తోంది. జంతు

సంబంధ ఆహార పదార్థాలపై మనం ఆధారపడినప్పటికీ, జంతువులన్నీ సాధారణంగా తమ ఆహారంకోసం మొక్కలపైనే ఆధారపడడం మనం చూస్తాం. జంతువులన్నింటికి అవసరమైన ఆహారాన్ని మొక్కలు ఏ విధంగా తయారుచేస్తాయి?

మొక్కలు తమ జీవక్రియలను ఎలా నిర్వహిస్తాయి అనే అంశాన్ని తెలుసుకోడానికి శతాబ్దాలుగా శాస్త్రవేత్తలు ఎన్నో పరిశోధనలు జరుపుతున్నారు. మొక్కలలో వివిధ రకాల జీవక్రియలు జరుగుతున్నప్పటికీ ఒక్క కిరణజన్య సంయోగక్రియ ద్వారానే సమస్త జీవకోటికి ఆహారం అందించే వనరులుగా మొక్కలు గుర్తింపబడ్డాయి.

మీరు కింది తరగతులలో కిరణజన్యసంయోగక్రియ గురించి కొన్ని అంశాలు అధ్యయనం చేశారుకదా? మొక్కల జీవక్రియలకు సంబంధించిన పరిశోధనలు చాలాకాలం క్రిందనే ప్రారంభించబడినప్పటికీ మొక్కల అవసరాలకు సంబంధించిన విషయం గురించి తెల్సుకొనుటకు నిర్వహించిన ప్రయోగ విధానాలను 17వ శతాబ్దం నుండి మాత్రమే నమోదు చేయటం ప్రారంభించారు. వాన్‌హెల్మెంట్ అనే శాస్త్రవేత్త మొక్కలకు గల నీటి సంబంధంపై నిర్వహించిన ప్రయోగాన్ని పూర్తిచేయుటకు అతనికి 5 సంవత్సరాల కాలం పట్టింది. అదే విధంగా ప్రస్తుతపు కిరణజన్యసంయోగక్రియ నిర్వచనాన్ని రాబట్టడానికి మానవాళికి మరో 300 సంవత్సరాల కాలం పట్టింది.

కిరణజన్య సంయోగ క్రియ జరగడానికి కావాల్సిన ముడిపదార్థాలు ఏమిటి?

కిరణజన్య సంయోగక్రియలో చిట్టచివరిగా ఏర్పడే ఉత్పన్నాలు ఏమై ఉంటాయి?

కిరణజన్య సంయోగక్రియకు సంబంధించిన మరిన్ని విషయాలను వివరంగా తెలుసుకుందాం.

## కిరణజన్యసంయోగక్రియ (Photosynthesis)

కిరణజన్య సంయోగక్రియను జరిపే మొక్కల పత్రాలు ఆకుపచ్చరంగులో ఉండే వర్ణకాన్ని కలిగి ఉంటాయి. దీనిని 'పత్రహరితం' (Chlorophyll) అంటారు. ఇవి కాంతిశక్తిని ఉపయోగించి సరళ అకర్బన పదార్థాలను సంక్లిష్ట కర్బన అణువులుగా మారుస్తాయి. ఈ విధానాన్ని కిరణజన్య సంయోగక్రియ అంటారు. ఇది చాలా సంక్లిష్టమైన ప్రక్రియ. ఇందులో అనేక రకాల చర్యలు క్రమపద్ధతిలో జరగటంతో పాటుగా అనేక మధ్యస్థ సమ్మేళనాలు (intermediate compounds) కూడా ఏర్పడుతుంటాయి. శాస్త్రవేత్తలు ఈ విధానాన్ని సరళమైన సమీకరణ రూపంలో సూచించడానికి ప్రయత్నించారు. 1931వ సంవత్సరంలో సి.బి. వాన్ నీల్ అనే శాస్త్రవేత్త ప్రతిపాదించిన సమీకరణాన్ని ప్రామాణికంగా ఆమోదించి ఇప్పటికీ కూడా ఉపపయోగిస్తున్నాం.



పటం-1: కిరణజన్య సంయోగక్రియ

అతని అభిప్రాయం ప్రకారం "ప్రతి కార్బోహైడ్రేట్ అణువు తయారీకి, ఒక కార్బన్‌డై ఆక్సైడ్ అణువు మరియు రెండు అణువుల నీరు అవసరమవుతాయి. ఈ ప్రక్రియలో ఒక ఆక్సీజన్ మరియు ఒక నీటి అణువు ఉత్పత్తి అవుతుంది.



$$CO_2 + 2H_2O \xrightarrow[\text{పత్రహరితం}]{\text{కాంతి}} CH_2O + H_2O + O_2$$

గ్లూకోజ్ ($C_6H_{12}O_6$) ఏర్పడే విధంగా చూపించాలంటే సమీకరణం ఏ విధంగా ఉండాలి. ఇందుకోసం సమీకరణాన్ని సమతుల్యం చేసి తిరిగి రాయండి. (రసాయన సమీకరణాలు, కర్బన సమ్మేళనాలు అనే పాఠాలను మీ 10వ తరగతి భౌతిక రసాయన శాస్త్ర పుస్తకంలో పరిశీలించండి.)

C.B.వాన్ నీల్ అనే శాస్త్రవేత్త పర్పుల్ సల్ఫర్‌బాక్టీరియాలపై పరిశోధనచేస్తూ కిరణజన్య సంయోగక్రియలో కాంతికి ప్రత్యేక పాత్ర ఉందని కనుగొన్నాడు. అయితే బాక్టీరియాలు $H_2O$ కు బదులుగా $H_2S$ ను ప్రారంభ పదార్థంగా ఉపయోగిస్తాయి. ఈ బాక్టీరియాలు జరిపే కిరణజన్య సంయోగక్రియలో ఆక్సిజన్ బదులుగా సల్ఫర్ వెలువడడాన్ని ఆయన గుర్తించాడు. తరువాత మొక్కలలో కూడా ఇదేవిధంగా జరిగే కిరణజన్య సంయోగక్రియను పరిశీలించాడు. కిరణజన్య సంయోగ క్రియలో గ్లూకోజ్ ఒక ఉత్పన్నంగా పరిశీలించిన తరువాత క్రింది సమీకరణాన్ని ప్రతిపాదించాడు.



$$6CO_2 + 12H_2O \xrightarrow[\text{పత్రహరితం}]{\text{కాంతి}} C_6H_{12}O_6 + 6H_2O + 6O_2$$

మొక్కలు మొదటగా సరళమైన కార్బోహైడ్రేట్స్‌ను తయారుచేసుకుంటాయి. తరువాత స్టార్చ్ మరియు సెల్యులోజ్ వంటి సంక్లిష్టమైన పిండిపదార్థాలను సంశ్లేషిస్తాయి. ఇవే కాకుండా మొక్కలు ప్రోటీన్లు, లిపిడ్లు మొదలైన పదార్థాలను కూడా తయారుచేసుకో- గలుగుతాయి. అయితే జంతువులు కార్బోహైడ్రేట్లను సొంతంగా తయారుచేసుకోలేవు, కాబట్టి అవి వాటి కొరకు మొక్కలపైన ఆధారపడాల్సి ఉంటుంది.

దాదాపుగా సజీవ ప్రపంచానికంతటికీ కిరణజన్యసంయోగక్రియను మౌలిక శక్తి వనరు అని చెప్పగలమా? ఎందుకు? ఎందుకు కాదు?

కిరణజన్యసంయోగక్రియ ద్వారా మొక్కలు కార్బోహైడ్రేట్స్‌ను ఎలా తయారుచేసుకుంటాయో తెలుసుకుందాం.

## కృత్యం-1

### ఆకులలోని పిండిపదార్థం (ఒక రకమైన కార్బోహైడ్రేట్)

- ఎండలో పెరుగుతున్న మెత్తని మరియు పలుచని ఆకులు గల మొక్కనుండి ఒక ఆకును తీసుకోండి.
- పటం-2(ఎ)లో చూపిన విధంగా ప్రయోగానికి కావలసిన పరికరాలను సిద్ధం చేసుకోండి.
- పరీక్షనాళికలో మిథైలేటెడ్ స్పిరిట్‌ను తీసుకొని అందులో ఆకును ఉంచండి.
- మొదట ఆకును నీటిలో మరిగించి మిథైలేటెడ్ స్పిరిట్ కలిగిన పరీక్షనాళికలో ఉంచి, పరీక్షనాళికను నీరు కలిగిన బీకరులో ఉంచి, మరిగేలా వేడి చేయండి. వేడిచేసినప్పుడు ఆకులోని పత్రహరితం (Chlorophyll) తొలగించ బడుతుంది. అందువల్ల ఆకు పాలిపోయినట్లుగా మారుతుంది.




పటం-2(ఎ): మిథైలేట్ స్పిరిట్‌లో పత్రాన్ని మరిగించుట




పటం-2(బి): అయోడిన్ పరీక్ష

- పరీక్ష నాళికనుండి ఆకును, బ్రష్ సహాయంతో జాగ్రత్తగా బయటకు తీయాలి.
- ఆకును వాచ్‌గ్లాస్ లేదా పెట్రీడిష్‌లో మడతలు పడకుండా వెడల్పుగా పరచండి. దానిపైన కొన్ని చుక్కలు అయొడిన్ లేదా బెటాడిన్ ద్రావణాన్ని వేయండి. పత్రాన్ని మరొకసారి పరిశీలించండి. మీరేమి మార్పులను గమనించారు?

  ఏర్పడిన నీలి నలుపు రంగు ఆకులోని పిండిపదార్థపు ఉనికిని తెలియజేస్తుంది.
- *పిండిపదార్థాల తయారీలో సూర్యరశ్మి పాత్ర ఉందని మీరు భావిస్తున్నారా?*

### కిరణజన్యసంయోగక్రియకు అవసరమయ్యే కారకాలు:

కిరణజన్యసంయోగక్రియ ద్వారా కార్బోహైడ్రేట్లు ఏర్పడడానికి కావలసిన ముఖ్యమైన పదార్థాలు ఏమై ఉంటాయో ఆలోచించండి. (వాన్‌నీల్ ప్రతిపాదించిన సమీకరణాన్ని చూడండి).

కిరణజన్యసంయోగక్రియకు కావల్సిన పదార్థాలన్నీ సమీకరణంలో ఇమిడి ఉన్నాయని చెప్పగలమా?

కిరణజన్యసంయోగక్రియ నిర్వహణకు కావలసిన పదార్థాల గురించి శాస్త్రవేత్తలు ఎలా తెలుసుకోగలిగారో పరిశీలిద్దాం.

## నీరు మరియు కిరణజన్యసంయోగక్రియ

మొక్క బరువు పెరగటంలో నీరు ప్రధాన పాత్రవహిస్తుందని వాన్ హెల్మాంట్ చేసిన పరిశోధనల గురించి మీరు 7వ తరగతిలో చదివారు కదా!

ఆ కాలంనాటికి వాన్‌హెల్మెంట్‌కు కిరణజన్యసంయోగక్రియ గురించి తెలియదు. తరువాత జరిగిన అనేక పరిశోధనలు కిరణజన్యసంయోగక్రియ ద్వారా మొక్క బరువు పెరుగుతుందనే విషయాన్ని తెలియజేశాయి.

## గాలి మరియు కిరణజన్య సంయోగక్రియ

కిరణజన్యసంయోగక్రియకు సంబంధించి చిన్న ప్రయోగాన్ని చేద్దాం. దీని ద్వారా కిరణజన్య సంయోగక్రియలో గాలి ఎలాంటి పాత్రను పోషిస్తుందో తెలుసుకోవచ్చు.

కిరణజన్యసంయోగక్రియను అవగాహన చేసుకునే క్రమంలో నిర్వహించబడిన అనేక ప్రయోగాలలో ప్రస్తుతం మనం చేయబోయే ప్రయోగం ఆసక్తిని రేకెత్తించేదే కాకుండా ఒక మైలురాయి వంటిదని కూడా చెప్పవచ్చు.

ఆకుపచ్చని మొక్కల పెరుగుదలలో గాలి ప్రధాన పాత్ర వహిస్తుందని జోసఫ్ ప్రీస్లే (1733-1804) 1770వ సంవత్సరంలో నిర్వహించిన ప్రయోగాల పరంపర ద్వారా తెలిసింది. ఆనాటికి శాస్త్రవేత్తలకు కిరణజన్య సంయోగక్రియ గురించి అంతగా తెలియదు. 1774వ సంవత్సరంలో జోసఫ్ ప్రీస్లే ఆక్సిజన్ కనుగొన్న విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి. 1775 సంవత్సరంలో లెవోయిజర్ ఆ వాయువుకు ఆక్సిజన్ అని నామకరణం చేశాడు. గాలి చొరబడని గంటజాడిలో వెలుగుతున్న కొవ్వొత్తి త్వరగా ఆరిపోవడాన్ని ప్రీస్లే గమనించాడు. అదేవిధంగా గాలిచొరబడని గంటజాడీలో ఉంచిన ఎలుకకు ఊపిరాడకపోవడం కూడా గమనించాడు. ఈ పరిశీలన ద్వారా వెలిగే కొవ్వొత్తి, ఎలుక రెండూ కూడా ఏదోవిధంగా గంటజాడీలోని గాలికి నష్టం కలిగించినట్లు నిర్ధారణకు వచ్చాడు. కాని గంటజాడీలో ఒక పుదీనా మొక్కను ఉంచి పరిశీలించినప్పుడు ఎలుక ప్రాణంతో ఉండడాన్నీ కొవ్వొత్తి వెలుగుతూ ఉండడాన్నీ గమనించాడు. జంతువుల శ్వాసక్రియకు కొవ్వొత్తి వెలుగడానికీ ఖర్చు అవుతున్న గాలిని మొక్కలు గాలిలోకి పంపుతుంటాయని ఈ ప్రయోగం ద్వారా జోసఫ్ ప్రీస్లే ఊహించాడు.



పటం-3: ప్రీస్లే ప్రయోగం

కొవ్వొత్తికి, ఎలుకకు, పుదీనా మొక్కకు మధ్య మీరు ఏమైనా సంబంధాన్ని గుర్తించారా?

జోసఫ్ ప్రీస్లే తాను నిర్వహించిన ప్రయోగాల ద్వారా వాయు వినిమయం జరగడం వలన మొక్కలు వదిలే వాయువు కొవ్వొత్తి వెలగడానికి, జంతువుల మనుగడకు దోహదం చేస్తుందని నిర్ధారణకు వచ్చాడు. అయితే మొక్కలు గాలిలోని కార్బన్‌డైఆక్సైడ్‌ను కిరణజన్య సంయోగక్రియకు, ఆక్సిజన్‌ను శ్వాసక్రియకు ఎలా ఉపయోగించుకుంటాయి? మొక్కలలో అధిక మొత్తంలో వాయువుల వినియమం ఆకులలోని పత్రరంధ్రాల ద్వారా, అవి తెరుచుకుని ఉన్నంతసేపూ జరుగుతూనే ఉంటుంది. అంతేకాకుండా కాండం, శ్వాసవేర్లలో ఉండే వాయురంధ్రాల (lenticels) ద్వారా కూడా వాయు వినిమయం జరుగుతుంటుంది.

## కృత్యం-2

### కిరణజన్యసంయోగక్రియలో కార్బన్‌డైఆక్సైడ్ ఆవశ్యకత (మోల్స్ అర్ధపత్ర ప్రయోగం)

ఈ ప్రయోగ నిర్వహణకు పిండిపదార్థం తొలగించబడిన మొక్క అవసరమవుతుంది. పిండిపదార్థాన్ని తొలగించడానికి మొక్కను కనీసం ఒక మూడు రోజులపాటు చీకటిలో ఉంచాలి. చీకటిలో ఉంచడం వల్ల ఆకులలోని పిండిపదార్థం తొలగించబడతుంది.




పటం-4: మోల్స్ అర్ధపత్ర ప్రయోగం

పటం-4లో చూపిన విధంగా పరికరాలను సిద్ధం చేసుకోండి.

- ఒక వెడల్పుమూతిగల గాజు సీసాను తీసుకోండి.
- అందులో పొటాషియం హైడ్రాక్సైడ్ (KOH) బిళ్ళలు కాని పొటాషియం హైడ్రాక్సైడ్ ద్రావణాన్ని తీసుకోండి. పొటాషియం హైడ్రాక్సైడ్‌కు కార్బన్‌డైఆక్సైడ్‌ను పీల్చే గుణముంటుంది.
- ఒక నిలువుగా చీల్చబడిన రబ్బరు బిరడాను తీసుకుని గాజుసీసా మూతికి బిగించండి.
- మొక్కలో ఎంపిక చేసుకున్న ఆకును బిరడా చీలికగుండా సగభాగం పొటాషియం హైడ్రాక్సైడ్ కల్గిఉన్న సీసాలోపలికీ సగభాగం సీసా వెలుపలికీ ఉండే విధంగా అమర్చండి.
- సీసాతోసహా ప్రయోగ అమరికను సూర్యరశ్మిలో ఉంచండి.
- కొన్ని గంటల తరువాత సీసాలో అమర్చిన ఆకును మరియు మొక్క యొక్క వేరే ఇతర ఆకును తీసుకొని కృత్యం-1లో చేసినట్లుగా అయోడిన్ ద్రావణంతో పిండిపదార్థాన్ని పరీక్షించండి.

గాలి వెలుతురు (కాంతి) సోకుతున్న ఆకుభాగముతో అయోడిన్ పరీక్ష నిర్వహించినప్పుడు నీలి-నలుపు రంగులోకి మారడాన్ని గమనించారు కదా!. సీసాలోపల ఉన్న పొటాషియం హైడ్రాక్సైడ్ సీసాలో ఉన్న గాలిలోని కార్బన్‌డైఆక్సైడ్‌ను పీల్చివేసింది. కిరణజన్య సంయోగక్రియ జరగలేదు కాబట్టి సీసాలోపల ఉన్న ఆకుభాగం మాత్రం నీలి-నలుపు రంగులోకి మారలేదు. దీనినిబట్టి కిరణజన్య సంయోగక్రియకు కార్బన్‌డైఆక్సైడ్ అవసరమని తెలుస్తుంది.

- *మొక్కను ప్రయోగానికి ముందు చీకటిలో 3 రోజులపాటు ఉంచడానికి కారణం ఏమిటి?*
- *ఈ ప్రయోగంలో రెండు ఆకులను ఎందుకు పరీక్షించాలి?*

ఇంతవరకు మనం కిరణజన్యసంయోగ క్రియకు కార్బన్‌డైఆక్సైడ్, నీరు అవసరమని తెలుసుకున్నాం. ఇవే కాకుండా ఇంకా అనేక ఇతర కారకాలు కూడా ప్రభావం చూపవచ్చని శాస్త్రవేత్తలు భావించారు.

## కాంతి మరియు కిరణజన్యసంయోగక్రియ

జోసఫ్ ప్రీస్ట్లే కాలం నాటికి శాస్త్రవేత్తలకు 'శక్తి' గురించి అంతగా అవగాహన ఉండేది కాదు. కాని తరవాత కాలంలో శక్తిపై అనేక రకాల పరిశోధనలు జరిగాయి. ఆక్సిజన్ పరమాణువు కార్బన్ లేదా హైడ్రోజన్ పరమాణువులతో సంయోగం చెందడం వలన కార్బన్‌డైఆక్సైడ్ లేదా నీరు ఏర్పడినప్పుడు శక్తి విడుదలవుతుంది. కాని ఈ చర్య వ్యతిరేక దిశలో జరిగినపుడు ఏమి జరుగుతుంది? ఏర్పడిన ఆక్సిజన్ తిరిగి గాలిలో కలిసినప్పుడు ఏమవుతుంది? దీని ఆధారంగా శక్తి విషయంలో కూడా వ్యతిరేక దిశలో చర్యలు జరిగితే ఏమౌతుందో కూడా శాస్త్రవేత్తలు విశ్లేషించారు. ఆక్సిజన్ ఏర్పడినప్పుడు విడుదలైన శక్తి తిరిగి వినియోగించబడుతుందని శాస్త్రవేత్తలు తెలుసుకోగలిగారు. దీని అర్థం ఏమిటంటే మొక్కలు ఆక్సిజన్‌ను ఉత్పత్తి చేస్తున్నప్పుడు అవి శక్తిని గ్రహించగలగాలి. అసలు ఈ శక్తి ఎక్కడి నుండి వస్తుంది?

డచ్ శాస్త్రవేత్త 'జాన్ ఇంజన్ హౌజ్' (1730-1799) ఈ ప్రశ్నకు సమాధానం కనుగొనగలిగాడు. మొక్కలు ఆక్సిజన్‌ను ఎలా ఏర్పరుస్తాయో తెలుసుకోవడానికి నిరంతరం అధ్యయనం చేశాడు. 1779వ సంవత్సరంలో కాంతి సమక్షంలోనే మొక్కలు ఆక్సిజన్‌ను ఏర్పరుస్తాయని తెలుసుకున్నాడు.

హైడ్రిల్లా అనే నీటి మొక్కతో ప్రయోగాలు నిర్వహించేటప్పుడు ప్రకాశవంతమైన కాంతిలో ఉంచినపుడు హైడ్రిల్లా మొక్కలోని ఆకుపచ్చని భాగాల చుట్టూ గాలి బుడగలు ఏర్పడటం, చీకటిలో ఉంచినపుడు ఏర్పడక పోవడం గమనించాడు. ఈ గాలి బుడగలలో ఆక్సిజన్ వాయువు ఉందని తెలుసుకున్నాడు.

ఈ విషయాన్ని 20వ శతాబ్దంలో 'ఎంగల్‌మెన్' అనే శాస్త్రవేత్త గరిష్ఠ కిరణజన్య సంయోగక్రియ జరిగే స్థానాన్ని కనుగొనడంతో మరింత స్పష్టంగా నిర్ధారణ జరిగింది. ఇతను శైవలాల సమూహాలపై ఇంద్రధనస్సులో కనబడే రంగుల వంటి వివిధ రంగుల కాంతులు సోకే విధంగా చేసాడు. తరువాత ఆక్సిజన్ ఉత్తేజిత బ్యాక్టీరియాలపై ప్రకాశవంతమైన ఎరుపు మరియు నీలి రంగు కాంతికిరణాలను ప్రసరింపజేసినపుడు అవి గుంపులుగా ఏర్పడడం గమనించాడు. ఈ పరిశోధనలు కాంతి మరియు కిరణజన్యసంయోగక్రియను గురించి మరింత లోతుగా అధ్యయనం చేయడానికి దోహదపడ్డాయి మరియు మొక్కలలో వివిధ రకాల రంగులతో కూడిన వర్ణద్రవ్యాల గురించి కాంతి శక్తి వినియోగంలో వాటి పాత్ర గురించి అవగాహన చేసుకోవడానికి కూడా తోడ్పడ్డాయి.



## ప్రయోగశాల కృత్యం

### కిరణజన్య సంయోగక్రియలో కాంతి సమక్షంలో ఆక్సీజన్ విడుదలను పరిశీలించే ప్రయోగం

**కావల్సిన పరికరాలు :** బీకర్లు (2), గరాటు (2), పరీక్ష నాళికలు (2), హైడ్రిల్లా (ఏదేని నీటిలో మునిగి పెరిగె నీటి మొక్క), నల్లటి కాగితం, నీటితో నిండిన బకెటు, అగరుబత్తి, అగ్గిపెట్టే.

**విధానం**

1. పటం-5లో చూపిన విధంగా నీటి మొక్క (హైడ్రిల్లా) కల్గి ఉన్న ఒక జత పరికరాలను అమర్చండి.
2. మొత్తం అమరికను నీటితో నిండిన బకెటుతో ఉంచండి, పరీక్షనాళికను నీటితో నింపి గరాటు కాడభాగం పై బోర్లించండి. (ఈ విధంగా చేయటం వలన పరీక్షనాళికలో నీరు నిల్వ ఉండటానికి దోహదం చేస్తుంది.)
3. బకెటు నుండి మొత్తం అమరికను వెలుపలికి తీసి సూర్యరశ్మిలో ఉంచండి.
4. ఇదే విధంగా రెండవ అమరికను నల్లటి కాగితంతో కప్పి నీడలో ఉంచండి. పరీక్ష నాళికలోని నీటి మట్టాన్ని పరిశీలించండి.




పటం-5: హైడ్రిల్లా ప్రయోగం

సూర్యరశ్మిలో ఉంచిన పరికరంలోని పరీక్షనాళికలోని నీటిమట్టం తగ్గుతు ఆ ప్రదేశంలో గాలి నిండుతున్నట్లుగా మీరు గమనిస్తారు. అదేవిధంగా నీడలో ఉంచిన అమరికను పరిశీలించండి. ఎక్కడ ఉంచిన అమరికలోని పరీక్షనాళికలలో ఎక్కువ వాయువు ఉన్నట్లు గుర్తించారు?

ఈ వాయువులో మండుతున్న అగ్గిపుల్లనుగానీ అగర్‌బత్తినిగానీ ఉంచినపుడు కాంతివంతంగా మండడం గమనించండి. ఈ పరీక్షను బట్టి హైడ్రిల్లా మొక్కల నుండి వెలువడిన వాయువు ఆక్సిజన్ అని తెలుసుకోవచ్చు.

గాలితో నిండిన పరీక్ష నాళికను బీకరులోనుండి బయటకు తీసేటపుడు ఏమేమి జాగ్రత్తలు తీసుకోవాలో మీ ఉపాధ్యాయునితో చర్చించండి.

## కృత్యం-3

### పిండి పదార్థం ఏర్పడడానికి కాంతి ఆవశ్యకత

కుండీలో పెరుగుతున్న మొక్కను తీసుకోండి. పిండిపదార్థం తొలగించండి. పిండి పదార్థం తొలగించదానికి కృత్యం-1లో పాటించిన పద్ధతినే అనుసరించండి. ఒక నల్ల కాగితం తీసుకొని మీకు నచ్చిన డిజైన్‌ను కత్తిరించండి. దానిని బొమ్మలో చూపిన విధంగా ఆకుపైన ఉంచి



పటం-6: నల్ల కాగితం ప్రయోగం

కదలకుండా క్లిప్పులు పెట్టండి. నల్లటి భాగంగుండా కాంతి ఆకుపైన పడకుండా కాగితం అమరేలా చూడండి. మీ అమరికను సూర్యరశ్మిలో ఉంచండి.

కొన్ని గంటల తరువాత మొక్క నుండి ఆకును వేరుచేయండి. పిండిపదార్థం కొరకు అయోడిన్ పరీక్షను నిర్వహించండి. ఏ ఏ భాగాలు నీలి నలుపు రంగులోకి మారాయి? మిగిలిన భాగం ఎలా ఉంది?

కత్తిరించిన డిజైన్ ఆకారం గుండా కాంతి ప్రసరించిన ఆకుభాగం అంటే నల్లకాగితం కప్పని భాగం మాత్రమే అయోడిన్‌తో నీలినలుపు రంగులో మారటం గమనిస్తాం. కారణం ఏమిటి?

## పత్రహరితం మరియు కిరణజన్యసంయోగక్రియ

'ఇంజన్ హౌజ్' కిరణజన్యసంయోగక్రియ గురించి మరిన్ని వివరాలు తెలుసుకోవడానికి అనేక రకాల ప్రయోగాలను నిర్వహించాడు. మొక్కలలోని ఆకుపచ్చ భాగంలో మాత్రమే కిరణజన్యసంయోగక్రియ జరుగుతుందని అతడు ప్రతిపాదించాడు.

వివిధ రంగులు కలిగిన ఆకులు కూడా కిరణజన్యసంయోగక్రియను నిర్వహిస్తాయా? చాలా మొక్కల్లో నూతనంగా ఏర్పడ్డ చిగురాకులు ఎరుపు రంగులో ఉండి తరువాత ఆకుపచ్చరంగులోకి ఎలా మారతాయి? ఎరుపు లేదా పసుపురంగులో ఉండే పత్రాలు కూడా కిరణజన్యసంయోగక్రియను నిర్వహిస్తాయా? కొన్ని పక్షులు కూడా ఆకుపచ్చరంగు కలిగి ఉంటాయి కదా! అవి కూడా కిరణజన్యసంయోగక్రియను నిర్వహిస్తాయా? ఇటువంటి ప్రశ్నలన్నీ మొక్కల భాగాలనుండి ఆకుపచ్చటి పదార్థాన్ని వేరుచేసేందుకు, దాని స్వభావాన్ని అర్థం చేసుకునేందుకు శాస్త్రవేత్తలకు సవాళ్ళుగా మారాయి.

1817వ సంవత్సరంలో 'పెల్లిటియర్' మరియు 'కావన్టో' అనే ఇద్దరు శాస్త్రవేత్తల కృషి ఫలితంగా ఇంజన్ హౌజ్ ప్రతిపాదనల స్థాపన సాధ్యమైనది. వీరు ఆకుపచ్చటి పదార్థం యొక్క కషాయాన్ని వేరుచేశారు. ఆ కషాయానికి పత్రహరితం (Chlorophyll) అని నామకరణం చేశారు. క్లోరోఫిల్ అంటే ఆకుపచ్చని ఆకు అని అర్థం. క్లోరోఫిల్‌తోపాటుగా కెరోటినాయిడ్‌లు మరియు ఫైకోబిలిన్ వర్ణద్రవ్యాలు కాంతి శక్తిని గ్రహించి నిక్షిప్తం చేసుకుని కిరణజన్య సంయోగక్రియకు తోడ్పడతాయని శాస్త్రవేత్తలు గుర్తించారు.

## కిరణజన్యసంయోగక్రియ ఎక్కడ జరుగుతుంది?

- మొక్కల్లో కిరణజన్యసంయోగక్రియ జరిగే భాగాల పేర్లు చెప్పండి.
- మొక్కల్లో పత్రహరితం మరియు ఇతర వర్ణదాలు ఎక్కడ ఉంటాయి?
- మొక్కల్లో నూతనంగా ఏర్పడే ఎరుపురంగు చిగురాకులు కూడా కిరణజన్యసంయోగక్రియను నిర్వహిస్తాయని మీరు భావిస్తున్నారా?

పెల్లిటియర్, కావెన్నో శాస్త్రవేత్తలు క్లోరోఫిల్‌ను కనుగొన్న తరువాత 6 దశాబ్దాల వరకు కిరణజన్యసంయోగక్రియ జరిగే ఖచ్చితమైన స్థానం గురించిగానీ క్లోరోఫిల్ కలిగియుండే భాగం గురించిగానీ తెలియలేదు. అప్పటివరకు మొక్కల కణాలలోని ఆకుపచ్చటి భాగాలలో క్లోరోఫిల్ వ్యాపించి ఉంటుందని నమ్మేవారు. 1883వ సంవత్సరంలో జూలియస్ వాన్ సాక్స్ అనే శాస్త్రవేత్త క్లోరోఫిల్ మొక్కలలోని కణం అంతా వ్యాపించి ఉండదని గమనించాడు. క్లోరోఫిల్ కణంలోపలి ప్రత్యేక కణాంగాలలో ఉంటుందని తెలుసుకున్నాడు. ఆ కణాంగాలనే హరితరేణువులు (Chloroplasts) అంటారు. మొక్కలలో పత్రరంధ్రాలలోని రక్షక కణాలలో మరియు ఆకుపచ్చని భాగాలలోని సంధాయక కణజాలంలో క్లోరోప్లాస్ట్‌లు (40–100 వరకు) అధిక సంఖ్యలో ఉంటాయి. 9వ తరగతిలో క్లోరోప్లాస్ట్ గురించి కొన్ని విషయాలు తెలుసుకున్నారు కదా! ఆకు అడ్డుకోత పటంలో స్తంభాకార కణజాలంలో మరియు స్పంజిక కణజాలం (సంధాయక కణజాలం) లోని క్లోరోప్లాస్టులు పరిశీలించండి.



### మీకు తెలుసా?

కణం పగిలినప్పుడు అందులోని క్లోరోప్లాస్ట్‌లు కూడా ముక్కలైపోతాయి. అటువంటప్పుడు కిరణజన్య సంయోగక్రియలోని వివిధ సోపానాలను అధ్యయనం చేయడానికి అవసరమైన క్లోరోప్లాస్ట్‌ను వేరుచేయలేము. కాని 1954 తరువాత డెనియల్ ఐ ఆర్నాన్ మొక్క కణాన్ని మెల్లిగా పగలకొట్టి పూర్తి హరితరేణువు (క్లోరోప్లాస్ట్) లను ప్రయోగశాల అధ్యయనం కొరకు వేరుచేయగలిగాడు.




పటం-7: ఆకు అడ్డుకోత

క్లోరోప్లాస్ట్‌లు త్వచంతో కూడిన నిర్మాణాలు. ఇందులో 3 త్వచాలు ఉంటాయి. మూడవ త్వచం దొంతరలవంటి నిర్మాణాన్ని పొంది ఉంటుంది. ఈ థైలకాయిడ్ దొంతరలను గ్రానా (Grana) అంటారు. ఈ ప్రదేశంలో కాంతిశక్తి గ్రహించబడతుంది. దొంతరల మధ్య ద్రవంతో నిండిన భాగం ఉంటుంది. దీనిని స్ట్రోమా (Stroma) అంటారు. ఇందులో జరిగే అనేక రకాల ఎంజైమ్‌ల చర్యల వలన గ్లూకోజ్ సంశ్లేషించబడుతుంది. గ్లూకోజ్ తరువాత పిండిపదార్థంగా మారిపోతుంది.



పటం-8: హరితరేణువు అడ్డుకోత

హరితరేణువులో కాంతిని శోషించే పదార్థాలను కిరణజన్యసంయోగక్రియా వర్ణదాలు (Photosynthetic pigments) అంటారు. మొక్కలలో గ్లూకోజ్ వంటి సంక్లిష్ట పదార్థాలను తయారుచేసే కిరణజన్యసంయోగక్రియలో అనేక రకాలైన వర్ణదాలు పనిచేస్తాయి.

పత్రహరితం రక్తంలోని హీమోగ్లోబిన్ అనే వర్ణదంలోని 'హీమ్'ను పోలి ఉంటుంది. అయితే హీమోగ్లోబిన్‌లో ఐరన్ ఉంటే (రక్తంలోని హీమోగ్లోబిన్ ఆక్సిజన్‌ను సరఫరా చేయడానికి తోడ్పడుతుంది.) పత్రహరితంలో మెగ్నీషియం ఉంటుంది.

పత్రంలోని హరితరేణువుల్లోని థైలాకాయిడ్ దొంతరలలో రెండు ప్రధాన రకాలైన పత్రహరిత వర్ణదాలుంటాయి. క్లోరోఫిల్ 'ఎ' నీలి-ఆకుపచ్చ వర్ణదం కాగా క్లోరోఫిల్ 'బి' పసుపు-ఆకుపచ్చగా ఉంటుంది. ప్రతి గ్రానంలోనూ దాదాపు 250 నుండి 400 వర్ణద అణువులు కలిసి కాంతి శోషణ సముదాయం (Light harvesting complex) గా ఏర్పడతాయి. వీటిని కిరణజన్యసంయోగక్రియ ప్రమాణాలు అంటారు. ఆకుపచ్చని మొక్కల క్లోరోప్లాస్ట్‌లో అధిక సంఖ్యలో ఉండే ఈ క్రియా ప్రమాణాలు అన్నీ కలిసి కిరణజన్య సంయోగ క్రియను సంయుక్తంగా నిర్వహిస్తాయి. కిరణజన్యసంయోగక్రియ సందర్భంగా క్లోరోప్లాస్ట్‌లో అనేక సంఘటనలు జరుగుతాయి. వాటిలో ముఖ్యమైనవి.

1. కాంతి శక్తి రసాయనిక శక్తిగా మారటం
2. నీటిఅణువు విచ్ఛిత్తి చెందడం (నీటి కాంతి విశ్లేషణ)
3. కార్బన్‌డైఆక్సైడ్ అణువు కార్బోహైడ్రేట్స్‌గా క్షయకరణం చెందడం.

వివిధ రకాల చర్యలు జరగడానికి కాంతి అవసరం అవుతుంది. వాటితోపాటు మరికొన్ని చర్యలు కాంతి అవసరం లేకుండా కూడా జరుగుతుంటాయి. అంటే ఒక్కసారి గ్రహింపబడిన కాంతిశక్తి నిక్షిప్తమై తరువాత కాంతిలేనపుడు కూడా వివిధ చర్యలు నిరంతరంగా జరగటానికి ఉపయోగపడుతుంది. కాంతి పై ఆధారపడే చర్యలు గ్రానాలో జరుగుతుంటాయి. మిగిలిన నిష్కాంతి చర్యలు స్ట్రోమాలో జరుగుతుంటాయి.

## కిరణజన్యసంయోగక్రియ యాంత్రికం

### 1. కాంతి చర్య (Light dependent reaction)

ఈ చర్యలో కాంతి ప్రధాన పాత్ర వహిస్తుంది. ఇందులో కాంతి ద్వారా ప్రేరేపించబడిన అనేక రసాయనిక చర్యలు ఒకదాని వెంట ఒకటి అతి త్వరగా జరుగుతుంటాయి. అందువలన ఈ దశను కాంతి రసాయన దశ (Photochemical phase) అంటారు. కాంతిచర్య క్లోరోప్లాస్ట్‌లోని గ్రానా థైలకాయిడ్‌లలో జరుగుతుంది. కాంతి చర్య వివిధ సోపానాలలో జరుగుతుంది.

**మొదటి సోపానం:** పత్రహరితంపై సూర్యకాంతిని ప్రసరింపజేసినపుడు ఫోటాన్‌లను శోషించుకొని అది క్రియావంతమవుతుంది (కాంతిశక్తి యొక్క ప్రమాణం)

**రెండవ సోపానం:** ఈ శక్తి నీటి అణువును విచ్ఛిన్నం చేసి ఆక్సీజన్ విడుదలకు తోడ్పడుతుంది. ఈ చర్యను నీటికాంతి విశ్లేషణ (Photolysis of water) అంటారు. (ఫోటో అనగా కాంతి లైసిస్ అనగా విచ్ఛిన్నం చేయడం అని అర్థం.) దీనిని 'హిల్' అనే శాస్త్రవేత్త నిరూపించాడు. అందువల్ల దీనిని 'హిల్ చర్య' అనికూడా అంటారు.

కాంతి విశ్లేషణ ద్వారా విడుదలైన హైడ్రోజన్ వెంటనే NADP (నికోటినమైడ్ అడినిన్ డై న్యూక్లియోటైడ్) అనే ప్రత్యేక సమ్మేళనం తీసుకుని NADPH (క్షయకరణం చెందిన NADP) గా మారుతుంది. ATP (అడినోసిన్ ట్రైఫాస్ఫేట్) అనే మరొక అధిక శక్తిగా సమ్మేళనం కాంతి చర్యలో అంత్య పదార్థాలుగా ఏర్పడుతాయి.

### 2. నిష్కాంతి చర్య (Light independent reaction)

ఈ దశలోని చర్యలకు కాంతి శక్తి అవసరంలేదు. అంతే కాకుండా కొన్ని మొక్కలలో కాంతిచర్యతోబాటూ జరుగుతుంది. ఈ చర్యను నిష్కాంతి చర్య అంటారు.

నిష్కాంతి అంటే చీకటిలో లేదా రాత్రిలో జరుగుతుందని అర్థంకాదు. ఈ చర్య కాంతిపై ఆధారపడదని అర్థం చేసుకోవాలి.

నిష్కాంతి చర్యలో హైడ్రోజన్ $CO_2$తో కలిసి ATP నుండి శక్తిని వినియోగించుకొని గ్లూకోజ్‌ను ($C_6H_{12}O_6$) ఉత్పత్తి చేస్తుంది. ఈ సంశ్లేషణ అనేక మధ్యస్థ పదార్థాలను, ఎంజైమ్‌లను ఉపయోగించుకుంటూ అనేక సోపానాలలో జరుగుతుంది. చివరిగా గ్లూకోజ్ పిండిపదార్థంగా మారుతుంది.

మొక్కలు వివిధ రకాల పరిస్థితులలో సైతం తమ జీవక్రియలను నిర్వర్తించగలుగుతాయి. అతి ఎక్కువ కాంతి, వేడిగా, పొడిగా ఉండే వాతావరణంలోనూ తడి, తేమతో నిండి తక్కువ కాంతి కలిగిన వాతావరణంలోనూ మొక్కలు తమ విధులను జరుపుకుంటాయి. కాంతి మరియు ఇతర కారకాల ఆవశ్యకత మొక్క మొక్కకు వేరువేరుగా ఉంటాయి.

## పరపోషకాలలో పోషణ (Heterotrophic nutrition)

సజీవ ప్రపంచంలో జీవులన్నీ విభిన్న పరిస్థితుల్లో సైతం సర్దుబాటు చేసుకుంటూ జీవించడానికి వీలుగా తమ పరిసరాలతో అనుకూలతను కలిగి ఉంటాయి. అదేవిధంగా విభిన్న పద్ధతుల్లో ఆహారాన్ని సేకరిస్తాయి. సూర్యకాంతి సమక్షంలో ఆహారాన్ని తయారుచేసుకునే వాటిని స్వయంపోషకాలు అంటారు. అలా సొంతంగా ఆహారాన్ని తయారుచేసుకోలేని వాటిని పరపోషకాలు అంటారని మనకు తెలుసు

### జీవులు తమ ఆహారాన్ని ఎలా పొందగలుగుతాయి?

జీవులకు లభ్యమయ్యే ఆహారపు రకం, దాని అందుబాటును బట్టి అవి ఆహారం పొందే విధానంలో, వినియోగించుకోవడంలో అనేక రకాల పద్ధతులను అనుసరిస్తాయి.

కొన్ని ఈస్ట్‌లు, పుట్టగొడుగులు (mushrooms), రొట్టె బూజులు (Bread molds) వంటి జీవులు ఆహారాన్ని శరీరం వెలుపల చిన్నచిన్న అణువులుగా విడగొట్టి శోషిస్తాయి. వీటిని పూతికాహారులు అంటారు. ఇంకొన్ని రకాల జీవులు అతిథేయ జీవిపై ఆధారపడి దానిని చంపకుండా పరాన్న జీవన విధానంలో ఆహారాన్ని సేకరిస్తాయి. ఉదాహరణకు కస్కూట, పేను, జలగ, బద్దెపురుగు మొదలైన జీవులు పరాన్న పోషణను పాటిస్తాయి. మరికొన్ని జీవులు ఆహారం మొత్తాన్ని లోనికి తీసుకుని (అంతరగ్రహణం) శరీరంలోపల సూక్ష్మ పదార్థాలుగా విడగొడతాయి. ఆహారం తీసుకోవడం, జీర్ణంచేసుకోవడం మొదలైన అంశాలన్నీ జీవి నిర్మాణం, పనిచేసే విధానంపై ఆధారపడి ఉంటాయి.



పటం-9(ఎ): అమీబాలో పోషణ

ఆహారం రకం, అది లభించే విధానంలో తేడాలు ఉండటం వలన వివిధ రకాల జీవులలో జీర్ణవ్యవస్థలు కూడా వేరు వేరుగా ఉంటాయి. ఏక కణజీవి అయిన అమీబాలో ఆహారం శరీరం ఉపరితలం నుండి సేకరించబడుతుంది. కాని క్రమేపి జీవులలో సంక్లిష్టత పెరిగేకొలది వివిధ రకాల భాగాలు ప్రత్యేక విధులను నిర్వహించడానికి అనువుగా మార్పు చెందుతాయి. ఉదాహరణకి అమీబా ఆహార సేకరణ కొరకు శరీర ఉపరితలం నుండి వేళ్ళవంటి మిథ్యాపాదాలను ఏర్పాటు చేసుకుంటుంది. ఈ మిథ్యాపాదాలను ఆహారంచుట్టూ ఆవరింపజేసి ఆహారపు రిక్తికగా మారుస్తుంది. ఆహార రిక్తికలో సంక్లిష్ట ఆహార పదార్థాలు సరళపదార్థాలుగా విడగొట్టబడిన తరువాత కణద్రవ్యంలోకి వ్యాపనం చెందుతాయి. జీర్ణం కాని పదార్థం కణం ఉపరితలానికి చేరి అక్కడ నుండి వెలుపలికి పంపబడుతుంది.

ఏకకణ జీవి అయిన పారమీషియం (పటం-9(బి))కాలిచెప్పు ఆకారంలో ఉంటుంది. దీనిలో ఒక ప్రత్యేకస్థానం నుండి ఆహారం గ్రహించబడుతుంది. శరీరం అంతా వ్యాపించి ఉన్న శైలికల కదలిక వలన ఆహారం ఆ ప్రత్యేక స్థానాన్ని చేరుకుంటుంది. అక్కడ నుండి శరీరం లోపలికి వెళ్తుంది. ఆ భాగాన్ని కణముఖం (Cytostome) అంటారు.



పటం-9(బి): పారామీషియంలో పోషణ

## కస్కుటాలో పరాన్నజీవ పోషణ



పటం-10: కస్కుటాలో హాస్టోరియాలు

బంగారు తీగ, కస్క్యూట (Cuscuta) ప్రజాతికి చెందిన ఆకులు లేకుండా తీగలుగా చుట్టుకుంటూ పెరిగే పత్రరహిత పరాన్నజీవ మొక్క. ఇది కన్వాల్వులేసి కుటుంబానికి చెందినది. ఈ ప్రజాతిలో దాదాపు 170 రకాల తీగ మొక్కల జాతులు ప్రపంచ వ్యాప్తంగా సమశీతోష్ణ, ఉష్ణమండల ప్రాంతాల్లో వ్యాపించి ఉన్నాయి. చాలా జాతులు వాటి అతిథేయ మొక్కలతో సహా కొత్త ప్రాంతాల్లోకి ప్రవేశించాయి.

బంగారు తీగ లేదా డాడర్ అని పిలువబడే ఈ మొక్కలో పత్రహరితం ఉండదు. కస్కుటా రిఫ్లెక్సాలో చాలా తక్కువ మొత్తంలో పత్రహరితం ఉంటుంది. ఇది చూషకాలు (Haustoria) ద్వారా ఆహారాన్ని సేకరిస్తుంది. హాస్టోరియాలు వేళ్ళమాదిరిగా ఉండి అతిథేయి కణజాలంలో చొచ్చుకొనిపోతాయి. ఒక్కొక్కసారి అతిథేయిని కూడా చంపేస్తాయి. డాడర్ కాండం సన్నగా పొడవుగా నారింజ, లేత గులాబి, పసుపు లేదా గోధుమ రంగులోగాని ఉంటుంది. డాడర్ పుష్పాలు బొడిపెల రూపంలో గుంపులు గుంపులుగా ఉంటాయి. పసుపు లేదా తెలుపు రంగులో ఆకర్షక పత్రాలు ఉండే తమ్మెలు గంట ఆకారంలో (సంయుక్త ఆకర్షక పత్రాలు) ఉంటాయి. పత్రాలు సన్నటి పొలుసుల మాదిరిగా క్షీణించి ఉంటాయి.

డాడర్ విత్తనం మొలకెత్తినప్పుడు అంటువేరు (Anchoring root) ఏర్పడుతుంది. తరువాత సన్నటి పొడవైన కాండం సర్పిలాకారంలో ఎదుగుతూ అతిథేయి మొక్కను చేరేవరకు పెరుగుతుంది. తరువాత అతిథేయి కాండాన్ని పెనవేసుకొని హాస్టోరియాలను కాండంలోకి చొప్పిస్తుంది. హాస్టోరియాలు అతిథేయి దారువు నుండి నీటిని మరియు పోషక కణజాలం నుండి పోషకపదార్థాలను సేకరిస్తాయి.

## మానవునిలో జీర్ణవ్యవస్థ




పటం-11: మానవుని జీర్ణవ్యవస్థ

మానవ జీర్ణవ్యవస్థ చాలా సంక్లిష్టమైనది. ఇందులో వివిధ రకాల అవయవాలు, జీర్ణరసాలు మరియు ఎంజైముల సహాయంతో వివిధ విధులను నిర్వహిస్తుంటాయి. మానవ జీర్ణవ్యవస్థ బొమ్మను పరిశీలించండి.

మానవునిలో ఆహారనాళం (Alimentary canal) పొడవైన గొట్టంవంటి నిర్మాణం. ఇది నోటినుండి పాయువు వరకు వ్యాపించి ఉంటుంది. ఆహారనాళంలో వివిధ రకాల భాగాలను గమనించవచ్చు. ఆహార నాళంలో ఒక్కొక్క ప్రాంతం ఒక్కొక్క ప్రత్యేకమైన పనిని నిర్వర్తించడానికి వీలుగా రూపొందింపబడి ఉంటుంది.

- మనం తిన్న ఆహారం శరీరంలోపలికి వెళ్ళిన తరువాత ఏమవుతుంది?

మనం అనేక రకాల ఆహారపదార్థాలు తిన్నప్పటికి అవన్నీ ఒకే జీర్ణనాళం ద్వారా పంపబడతాయి. మనం తీసుకునే ఆహారం మన శరీరం గ్రహించడానికి, ఉపయోగించు-కోవడానికి వీలుగా ఈ సమయంలో అనేక రకాల చర్యలు జరుగుతాయి. అవి ఎలా జరుగుతాయో పరిశీలిద్దాం.

## ఆహారనాళం గుండా ఆహారం వెళ్ళే విధానం

మనం తీసుకున్న ఆహారం నోటిలో దంతాల ద్వారా ముక్కలుగా చేయబడి నోటిలోని లాలాజలంతో కలుస్తుంది. ఫలితంగా ఆహారం తడిగా, మెత్తగా జారుడు స్వభావాన్ని పొందుతుంది. దీనినే ముద్దగా చేయడం బోలస్ (Bolus) అంటాం. ఇటువంటి మెత్తగా జారుడు స్వభావం కల్గిన ఆహారం ఆహారవాహిక (Oesophagus) గుండా జీర్ణాశయంలోకి వెళ్ళడానికి అనువుగా ఉంటుంది. ఆస్యకుహరంలో ఉండే 3 జతల లాలాజల గ్రంథుల ద్వారా లాలాజలం స్రవించబడుతుంది. లాలాజలంలో అమైలేజ్ (టయలిన్) అనే ఎంజైమ్ ఉంటుంది. అమైలేజ్ ఎంజైమ్ సంక్లిష్ట కార్బోహైడ్రేట్‌లను సరళమైన పదార్థాలుగా మారుస్తుంది. ఎంజైమ్‌ల సహాయంతో చిన్నచిన్న అణువులుగా మార్చబడుతుంది.



పటం-12: లాలాజల గ్రంథుల స్థానం

ఎంజైమ్‌ల సహాయంతో సంక్లిష్ట పదార్థాలు సరళ పదార్థాలుగా విడగొట్టబడి శరీరం శోషించుకోడానికి అనువుగా మార్చే విధానాన్ని జీర్ణక్రియ (Digestion) అంటారు. నాలుక ఆహారాన్ని మిశ్రమంగా చేయడానికి ఆహారనాళంలోని తరవాతి భాగంలోకి నెట్టడానికి ఉపయోగపడుతుంది. ఈ పనిని నిర్వహించడానికి కింది దవడ కూడా తోడ్పడుతుంది.

నోటిలో లాలాజలములోని అమైలేజ్ పిండి పదార్థంపై ఎటువంటి ప్రభావం చూపుతుందో తెలుసుకోగలం.

> 'జీవక్రియలలో సమన్వయం' పాఠంలో సూచించిన విధంగా పిండి పదార్థంపై లాలాజల ప్రభావాన్ని తెలిపే ప్రయోగం (కృత్యం-7) చేయండి.

మెత్తటి ఆహారం లాలాజలంతో కలిసిన తరువాత ఆహారవాహికలోకి పంపబడుతుంది. ఆహారం ఆహార వాహిక గుండా ప్రయాణిస్తున్నప్పుడు అలలు లేదా తరంగాల మాదిరిగా ఉండే చలనాన్ని గమనిస్తాం. దీనినే పెరిస్టాల్టిక్ చలనం (Peristaltic movement) అంటారు. జీర్ణాశయంలో ఆహారం జఠర రసంతో మరియు హైడ్రోక్లోరిక్ ఆమ్లం (HCl) తో కలిసి చిలికినట్లై ఆమ్ల మాధ్యమంగా మారుతుంది. ఈ దశలో ఆహారం అర్థఘన రూపంలో చిక్కగా ఉంటుంది. ఇక్కడ ఆహారంలోని ప్రొటీన్‌లు పెప్సిన్ అనే ఎంజైమ్ చర్య వలన చిన్న చిన్న అణువులుగా విడగొట్టబడతాయి.

ఆహారంలో ఉండే ప్రొటీన్లు మరియు కార్బోహైడ్రేట్ అణువులు చిన్నచిన్న ముక్కలుగా విడగొట్టబడి మెత్తగా చిక్కటి రూపంలోకి మారుతుంది. దీనినే కైమ్ (Chyme) అంటారు. జీర్ణాశయం చివర ఉండే వలయాకార సంవరిణి కండరాలు (Pyloric sphincters) సడలటం వలన ఆహారం జీర్ణాశయం నుండి చిన్న పేగులోకి పంపబడుతుంది. ఈ కండరాలు కైమ్ మొత్తం ఒకేసారిగా కాకుండా చిన్నచిన్న మొత్తాలుగా ఆహార పదార్థాన్ని జీర్ణాశయం నుండి చిన్న ప్రేగులోకి వచ్చేవిధంగా నియంత్రిస్తాయి.



పటం-13: పెరిస్టాల్టిక్ చలనం

ఆహారనాళంలో అతి పొడవైన భాగం చిన్నప్రేగు (Small intestine). ఇందులో కార్బోహైడ్రేట్స్, ప్రొటీన్లు మరియు కొవ్వుల జీర్ణక్రియ పూర్తవుతుంది. ఈ చర్యలో కాలేయం, క్లోమ గ్రంథుల నుండి వెలువడే జీర్ణరసాలు ఉపయోగపడతాయి. ఇవి ఆంత్రమూలంలో విడుదలవుతాయి. ఈ గ్రంథుల స్రావాలు చిన్న ప్రేగులో క్షారస్థితిని కల్పించడానికి దోహదపడతాయి.

కాలేయం ద్వారా విడుదలయ్యే పైత్యరసం కొవ్వు పదార్థాలను జీర్ణంచేసి చిన్నచిన్న రేణువులు (globules)గా మారుస్తుంది. ఈ విధానాన్ని ఎమల్సీకరణం (Emulsification) అంటారు.

క్లోమరసంలో ఉండే ట్రిప్సిన్ అనే ఎంజైమ్ ప్రొటీన్లను జీర్ణం చేయడానికి అదే విధంగా లైపేజ్ అనే ఎంజైమ్ క్రొవ్వులను జీర్ణం చేయడానికి ఉపయోగపడుతుంది.

చిన్న ప్రేగుల గోడలు ఆంత్రరసాన్ని (Succusentericus) స్రవిస్తాయి. ఈ స్రావాలు ప్రొటీన్లు మరియు క్రొవ్వులను మరింత చిన్న చిన్న అణువులుగా శోషించడానికి వీలుగా మార్పు చెందిస్తాయి. కార్బోహైడ్రేట్స్ నోటిలో కొంతవరకు మాత్రమే జీర్ణమౌతాయి. జీర్ణాశయంలో మార్పులు చెందకుండా చిన్న ప్రేగుల్లోకి చేరిన తరువాత అక్కడ క్షారస్థితి కలిగి ఉండటం వలన పూర్తిగా జీర్ణమవుతాయి.

## కృత్యం-4

### ఎంజైమ్‌ల పట్టిక పరిశీలిద్దాం.

జీర్ణవ్యవస్థలో పనిచేసే ఎంజైమ్‌ల పట్టికను పరిశీలించండి. వివిధ రకాల జీర్ణరసాలు మరియు ఎంజైమ్‌ల విధులను గురించి తరగతి గదిలో చర్చించండి.

### పట్టిక-1: జీర్ణక్రియా ఎంజైములు

| క్ర.సం. | ఎంజైమ్ / పదార్థం | గ్రంథి | స్రావం చేరే ప్రదేశం | జీర్ణరసాలు | వేటిపైన చర్య జరుపుతుంది | ఏర్పడే ఉత్పన్నం/పదార్థం |
|---|---|---|---|---|---|---|
| 1. | టయలిన్ (లాలాజల అమైలేజ్) | లాలాజల గ్రంథులు | ఆస్యకుహరం | లాలాజలం | కార్బోహైడ్రేట్స్ | మాల్టోజ్ |
| 2. | పెప్సిన్ | జఠరగ్రంథులు | జీర్ణాశయం | జఠరరసం | ప్రొటీన్స్ | పెప్టోన్స్ |
| 3. | పైత్యరసం (ఎంజైమ్స్ ఉండవు) | కాలేయం | ఆంత్రమూలం (Duodenum) | పైత్యరసం | కొవ్వులు | కొవ్వుల ఎమల్సీకరణ (కొవ్వులను చిన్న చిన్న రేణువులుగా మార్చుట) |
| 4. | అమైలేజ్ | క్లోమం | ఆంత్రమూలం | క్లోమరసం | కార్బోహైడ్రేట్స్ | మాల్టోజ్ |
| 5. | ట్రిప్సిన్ | క్లోమం | ఆంత్రమూలం | క్లోమరసం | ప్రొటీన్స్ | పెప్టోన్స్ |
| 6. | లైపేజ్ | క్లోమం | ఆంత్రమూలం | క్లోమరసం | కొవ్వులు | కొవ్వు ఆమ్లాలు మరియు గ్లిజరాల్ |
| 7. | పెప్టిడేజస్ | ఆంత్రగ్రంథులు | చిన్నప్రేగు | ఆంత్రరసం | పెప్టైడ్స్ | అమైనోఆమ్లాలు |
| 8. | సుక్రేజ్ | ఆంత్రగ్రంథులు | చిన్నప్రేగు | ఆంత్రరసం | సుక్రోజ్ (చెరకులోని చక్కెర) | గ్లూకోజ్ |

- *కార్బోహైడ్రేట్స్‌పై చర్యజరిపే ఎంజైమ్‌లు ఏవి?*
- *ఏ జీర్ణరసంలో ఎంజైమ్‌లు ఉండవు?*
- *క్రొవ్వుల జీర్ణక్రియలో ఏర్పడే అంత్య పదార్థాలు ఏవి?*
- *ప్రొటీన్లపై చర్య జరిపే ఎంజైమ్‌లు ఏవి?*

జీర్ణమైన అంత్యపదార్థాలు ప్రేగు నుండి రక్తంలోనికి (చిన్నప్రేగు గోడల ద్వారా) రవాణా కావడాన్ని శోషణ (Absorption) అంటారు. చిన్నప్రేగు గోడలలో చిన్న వేళ్ళ మాదిరిగా ఉండే నిర్మాణాలు కనబడతాయి. వీటిని సూక్ష్మచూషకాలు (Microvilli) అంటారు. ఇవి చిన్న ప్రేగుల ఉపరితల వైశాల్యాన్ని పెంచుతాయి. అందువల్ల శోషణ సామర్థ్యం పెరుగుతుంది. రక్తనాళాలు మరియు లింఫ్ గ్రంథులు సూక్ష్మచూషకాలతో కలిసి వలగా (జాలాకారం) ఏర్పడతాయి.

జీర్ణమైన అంత్యపదార్థాలు మొదట సూక్ష్మచూషకాలలోకి అక్కడి నుండి రక్తనాళాలలోకి శోషించబడతాయి. అంటే జీర్ణమైన ఆహార పదార్థాన్ని చిన్న ప్రేగుల గోడలు గ్రహిస్తాయన్నమాట. జీర్ణమైన ఆహారం అధికమొత్తంలో రక్తం ద్వారా శరీరంలోని ఇతర భాగాలకు తీసుకొనివెళ్ళడానికి దోహదపడతాయి. జీర్ణంకాని మిగిలిన ఆహారపదార్థం పెద్ద

పేగులోకి పంపబడుతుంది. తరువాత వ్యర్థపదార్థాలు పాయువు ద్వారా బయటికి నెట్టబడుతాయి. పాయువు ఆహారవాహిక యొక్క చివరి భాగం. పాయువు ద్వారా జీర్ణంకాని వ్యర్థపదార్థాలను తొలగించడాన్ని మలవిసర్జన అంటారు. పాయువు ద్వారా విసర్జించబడే పదార్థంలో స్వల్పపరిమాణంలో ఇంకా కొన్ని ప్రొటీన్లు, కొవ్వులు, కార్బోహైడ్రేట్లు ఉంటాయి. జీర్ణవ్యవస్థకు సంబంధించిన మరిన్ని వివరాలను జీవక్రియలలో సమన్వయం పాఠంలో చర్చిద్దాం.

## మానవుని జీర్ణవ్యవస్థ ఫ్లోచార్ట్

మానవుని జీర్ణవ్యవస్థను తెలియజేసే ఫ్లోచార్టును పరిశీలిద్దాం.

- *జీర్ణక్రియ ఆవశ్యకత ఏమిటి?*
- *జీర్ణక్రియలో జరిగే ప్రధాన దశలు ఏవి?*




## ఆహార వాహికకు సంబంధించిన ఆరోగ్యకర అంశాలు

మనం తీసుకునే ఆహారం పైన మన ఆహారవాహిక పనితీరు ఆధారపడి ఉంటుంది. కొన్ని సందర్భాలలో మనం తీసుకునే మితిమీరిన ఆహారం ఆహారవాహికపై ప్రభావం చూపుతుంది. అటువంటి సందర్భంలో మనం అనారోగ్యానికి గురికావడం లేదా అజీర్ణంతో బాధపడడంగాని చూస్తుంటాం.

జీర్ణాశయం నుండి అనవసరమైన పదార్థాలనుకానీ హానికరమైన పదార్థాలనుకానీ తొలగించుకోవడానికి మన శరీరం పాటించే ప్రక్రియయే వాంతి (vomiting). వాంతి వచ్చే సమయంలో జీర్ణాశయంలో మరియు ఆహారవాహికలో పెరిస్టాల్టిక్ చలనం తిరోగమనంలో వెనకకి జరగటం వలన ఆహారం నోటినుండి బయటకు నెట్టబడుతుంది. వాంతులు జరగడానికి అనేక కారణాలు ఉన్నప్పటికీ ఒక ముఖ్యమైన కారణం అతిగా తినటం. తిన్న ఆహారంలో

## తయారైన ఆహారం రవాణా



పటం-19: మొక్క నుండి ఎఫిడ్ ఆహారాన్ని సేకరించుట

ఆకుపచ్చటి మొక్కలలో ఆకులలో తయారైన ఆహారం చక్కెర రూపంలో మిగిలిన కణాలకు రవాణా చేయబడుతుంది. ముఖ్యంగా చురుకుగా పెరిగే భాగాలు మరియు నిల్వచేసే భాగాలకు రవాణా చేయబడుతుంది.

ఆకులలోని ఈనెలలో దారువు మరియు పోషక కణజాలాలు ఉంటాయని మనకు తెలుసు. ఇవి కాండంలోని కణజాలంతో అనుసంధానమై ఉంటాయి. కింది ప్రయోగం పోషక కణజాలం ద్వారా ఆహార పదార్థాల రవాణా జరుగుతుందని తెలియజేస్తుంది.

పోషక కణజాలంలోని చాలనీనాళాలు (sieve tubes) చాలా చిన్నవిగా ఉంటాయి. జీవశాస్త్రవేత్తలు మొక్కలలో ఆహార పదార్థాల రవాణాను పచ్చపురుగులు (aphids) ద్వారా అధ్యయనం చేశారు. ఎఫిడ్‌లు లేత కాండం చుట్టూ గుమికూడి మొక్కరసాన్ని పీలుస్తాయి. రసం పీల్చడానికి ఎఫిడ్ పొడవుగా సూదిమాదిరిగా ఉండే తొండాన్ని (proboscis) మొక్క కణజాలాలలోనికి చొప్పిస్తుంది. రసాన్ని పీల్చేటపుడు ఎఫిడ్లని చంపి కాండం అడ్డుకోతను జాగ్రత్తగా పరిశీలిస్తే ప్రోబోసిస్ పోషక కణజాలంలోని చాలనీ నాళాల వరకు మాత్రమే చొచ్చుకుపోయినట్లు శాస్త్రవేత్తలు గుర్తించారు. ప్రోబోసిస్‌లో ఉన్న రసాన్ని విశ్లేషించడానికి శాస్త్రవేత్తలు కింది ప్రయోగాన్ని చేశారు. మొక్క రసాన్ని పీల్చేటప్పుడే ఎఫిడ్‌ను చంపి ప్రోబోసిస్ భాగం పోషక కణజాలంలో ఉండే విధంగా ఎఫిడ్ శరీర భాగాన్ని వేరుచేశారు. పోషక కణజాలంలోని స్వల్ప పీడనంవల్ల రసం కోసిన ప్రోబోసిస్ భాగం గుండా రసం చుక్కల రూపంలో కారుతుండడాన్ని గుర్తించారు. ఈ ద్రవరూప చుక్కలని సేకరించి విశ్లేషించగా అందులో చక్కెరలు మరియు అమైనో ఆమ్లాలు ఉన్నాయని తెలిసింది.

ఎఫిడ్లు (aphids) పోషక కణజాలం నుంచి ఎక్కువ మొత్తంలో చక్కెరను గ్రహించినప్పటికీ మొత్తాన్నీ శోషించలేవు. మిగిలిన చక్కెర చిక్కటి ద్రవరూపంలో పాయువునుండి వెలుపలికి వస్తుంది. దీనిని తేనె (honey-dew) అంటారు. అందువల్లనే ఎఫిడ్స్ ఉన్న మొక్కల కాండం, ఆకులు చేతితో తాకితే అంటుకున్నట్లుగా ఉంటాయి.



పటం-20: వలయాకారంలో బెరడును తొలగించిన కాండం

మీరు కొన్ని సందర్భాలలో చెట్లలో సగానికిపైగా బెరడు పూర్తిగా నశించిపోయినప్పటికీ చెట్టు సజీవంగా ఉండడాన్ని చూసే ఉంటారు. ఇది ఎలా సాధ్యం!

పోషక కణజాలం ద్వారా చక్కెరలు రవాణా చేయబడ-తాయని మరొక ప్రయోగం ద్వారా కూడా నిరూపించవచ్చు. దారువు కనబడే విధంగా దాని చుట్టూ ఉన్న బెరడును తొలగించాలి. మధ్యభాగం మాత్రం ఉంచి మిగిలిన మొత్తం

కణజాలాన్ని పోషక కణజాలంతో సహా తొలగించాలి. కొన్ని రోజుల తరువాత తొలగించిన బెరడు పైభాగాన్ని, కింది భాగంయొక్క కణజాలాన్ని విశ్లేషించినప్పుడు మనకు ఆహార పదార్థ నిలువలు వలయంగా ఏర్పడిన పై భాగంలో మాత్రమే కనబడతాయి. కింది భాగంలో కనబడవు. కొన్నిరోజుల తరువాత మనం అలాగే వదిలిపెడితే రింగుపై భాగంలో కాండం మందం పెరుగుతుంది. కాని కింది భాగంలో పెరుగుదల జరుగదు. అందువలన కాండం చుట్టూ ఉన్న కణజాలానికి ఎటువంటి నష్టం కలిగించినా వేరుకు ఆహార సరఫరా ఆగిపోతుంది. తద్వారా చెట్టు మరణిస్తుంది. ఈ అంశం చాలా ఆర్థిక ప్రాముఖ్యత కలిగినది. కొన్ని క్షీరదాలు పోషక కణజాలంలో ఉండే ఆహారం కోసం చెట్టు బెరడును తొలుస్తాయి.

సాధారణంగా పోషక కణజాలంలోని చక్కెర కొరకు శీతాకాలంలో ఆహారపు కొరత ఉన్నప్పుడు ఇలా చేస్తుంటాయి. చిట్టెలుకల వంటి కొన్ని జంతువులు చిన్నచిన్న మొక్కలకు హానిచేస్తుంటే కుందేళ్ళ వంటి జంతువులు పెద్దపెద్ద చెట్లను నాశనం చేస్తుంటాయి. కుందేళ్ళ వంటి జంతువుల వల్ల చెట్లకు హాని కలగకుండా అటవీ సంరక్షణకు ఇనుప తీగ వలను అమరుస్తారు. అయితే ఇది ఖర్చుతో కూడినది.



## కీలక పదాలు

ప్రసరణ, కర్ణిక, జఠరిక, నాడీస్పందన, ధమని, సిర, స్టెతస్కోపు, బృహద్ధమని, రక్తకేశనాళిక, సిస్టోల్, డయాస్టోల్, హార్దికవలయం, రక్తపీడనం, శోషరసం, ఏకవలయ ప్రసరణం, ద్వివలయ ప్రసరణం, ద్విప్రసరణ వలయం, రక్త స్కందనము, స్ఫిగ్మోమానోమీటర్, ప్రోత్రాంబిన్, త్రాంబిన్, ఫైబ్రినోజన్, ఫైబ్రిన్, మూలకేశాలు, ప్రథమ మూలం, వేరుపీడనం, మొక్కల పోషకాలు, దారువు, పోషక కణజాలం, నాళికాపుంజాలు.



## మనం ఏం నేర్చుకున్నాం?

- నాడీస్పందన హృదయస్పందనకు సమానంగా ఉంటుంది. ఏ పరికరం సహాయం లేకుండానే మనం హృదయస్పందనను కొలవవచ్చు.
- మొట్టమొదటిసారిగా స్టెతస్కోపును రెనిలెన్నెక్ అను శాస్త్రవేత్త కనుగొన్నాడు.
- గుండె రెండు హృదయావరణత్వచాలచే ఆవరింపబడి ఉంటుంది. వీటి మధ్య ఉండే ద్రవం గుండెను అఘాతాలనుండి కాపాడుతుంది.
- గుండెకు అతికి ఉన్న రక్తనాళాలలో దృఢంగా ఉండేవి ధమనులు. వీటిలో ధమనీచాపం శరీర భాగాలకు, పుపుస ధమని ఊపిరితిత్తులకు రక్తాన్ని తీసుకుపోతుంది.
- తక్కువ దృఢత్వం కలిగిన నాళాలను సిరలు అంటారు. పూర్వపరమహాసిరలు శరీర ఊర్ధ్వ, అధోభాగాలనుండి రక్తాన్ని సేకరిస్తాయి. పుపుస సిరలు ఊపిరితిత్తులనుండి రక్తాన్ని సేకరిస్తాయి.
- గుండెలో నాలుగు గదులుంటాయి. పూర్వభాగంలో రెండు కర్ణికలు, పరభాగంలో రెండు జఠరికలు ఉంటాయి.

- ఒక వైపున గల కర్ణికజఠరికలు కర్ణికజఠరికా రంధ్రం ద్వారా కలుపబడి ఉంటాయి. కర్ణికాంతార విభాజకం అనే కండర పొర కర్ణికలనూ జఠరికాంతర విభాజకం జఠరికలను వేరుచేస్తుంది.
- కర్ణికలు, జఠరికల మధ్య రంధ్రాలుంటాయి. ఈ రంధ్రాలను కర్ణికా జఠరికా కవాటాలు మూసి ఉంచుతాయి.
- ధమనీ చాపం, పుపుస ధమనిలో కూడా కవాటాలుంటాయి.
- గుండె కుడివైపు భాగం శరీర భాగాలనుండి ఆమ్లజని రహిత గ్రహించి ఊపిరితిత్తులకు పంపుతుంది.
- గుండె ఎడమవైపు భాగం ఊపిరితిత్తుల నుండి ఆమ్లజని సహిత గ్రహించి శరీర భాగాలకు పంపుతుంది.
- పుపుస ధమని తప్ప మిగిలిన ధమనులన్నీ ఆమ్లజనియుత రక్తాన్ని శరీరభాగాలకు సరఫరా చేస్తాయి. పుపుస సిర తప్ప మిగిలిన సిరలన్నీ ఆమ్లజని రహిత రక్తాన్ని గుండెకు చేరుస్తాయి.
- గుండె ఒక సంకోచం వెంటనే ఒక యధాపూర్వస్థితికి (సడలింపు) రావడాన్ని హార్దికవలయం అంటారు.
- శరీర అవయవాలకు చేరేటపుడు రక్తం ఒక్కసారి మాత్రమే గుండెకు చేరడాన్ని ఏకవలయప్రసరణ అనీ రెండుసార్లు రావడాన్ని ద్వంద్వవలయ ప్రసరణ అనీ అంటారు.
- K విటమిన్ లోపం ఉన్నవారిలో రక్తస్కందనం జరగదు.
- మొక్కలు నేలలోని లవణాలు కరిగిన నీటిని ద్రవాభిసరణ పద్ధతిలో వేళ్ళ ద్వారా గ్రహిస్తాయి.
- నీరు దారువు ద్వారా, పోషక పదార్థాలు పోషక కణజాలం ద్వారా సరఫరా అవుతాయి.
- మొక్కలలో భాష్పోత్సేకానికి ప్రసరణ వ్యవస్థకు మధ్య సంబంధం ఉంటుంది.
- జీవశాస్త్రవేత్తలు ఎఫిడ్‌ల సహాయంతో పోషక కణజాలాల గురించి తెలుసుకోగలిగారు.



## అభ్యసనాన్ని మెరుగుపరచుకుందాం

1. ప్రసరణ వ్యవస్థ అంటే ఏమిటి? ఇది జీవులకు ఏవిధంగా ఉపయోగపడుతుందో రాయండి.(AS1)
2. ప్లాస్మా మరియు రక్తం మధ్య గల సంబంధం ఏమిటి?(AS1)
3. గుండెనుండి ఏ రక్తనాళం శరీర భాగాలకు రక్తాన్ని సరఫరా చేస్తుంది?(AS1)
4. మన శరీరంలో గల మూడు ప్రధానమైన రక్తనాళాలను పేర్కొనండి.(AS1)
5. మన శరీరంలో అతిపెద్ద ధమని ఏది? ఇది పెద్దదిగా ఉండడానికి కారణమేమిటి?(AS1)
6. ఆక్సీకరణం చెందడం కోసం రక్తాన్ని తీసుకువెళ్ళే రక్తనాళాలు ఏవి?(AS1)
7. లింఫ్‌నాళాలు, సిరలలో ఉండి ధమనులలో లేని నిర్మాణాలు ఏమిటి?(AS1)
8. రక్తఫలకికల యొక్క ఉపయోగాలు రాయండి.(AS1)
9. కిందివాని మధ్య భేదాలు రాయండి.(AS1)

   (ఎ) సిస్టోల్ – డయాస్టోల్ (బి) ధమనులు–సిరలు (సి) దారువు–పోషక కణజాలం
10. మూలకేశాల ద్వారా మొక్కలు నీటిని గ్రహించే విధానాన్ని వివరించండి.(AS1)
11. వేరు పీడనం అంటే ఏమిటి? ఇది మొక్కకు ఏవిధంగా ఉపయోగపడుతుంది?(AS1)
12. పోషక కణజాలం కొన్ని జంతువులకు ఆహారంగా ఉపయోగపడుతుంది? దీనిని నీవు ఎలా సమర్థిస్తావు?(AS1)
13. కింది పేరాలు చదవండి. ఖాళీలలో సమాచారాన్ని నింపండి.

- **గుండె నాలుగు గదులతో కూడిన కండరయుతమైన నిర్మాణం. గదులను విభజిస్తూ విభాజక పొర ఉంటుంది. గుండెలో గల విభాజక పొరలకు పేర్లు పెట్టండి.**

(ఎ)రెండు కర్ణికల మధ్యగల విభాజకాన్ని కర్ణికాంతర విభాజకం అంటారు.

(బి)రెండు జఠరికల మధ్యగల విభాజకాన్ని ________________ అంటారు.

(సి)ఒక కర్ణిక దాని దిగువన ఉన్న జఠరికల మధ్య ఉన్న విభాజకాన్ని ________________ అంటారు.

- **గుండెలోని రెండు గదులను కలుపుతూ ఉండే మార్గాన్ని రంధ్రం (aperture) అంటారు. కర్ణికలు, జఠరికల మధ్య ఉండే రంధ్రాలకు పేర్లు పెట్టండి.**

(ఎ) కుడికర్ణిక, కుడి జఠరికలను కలుపుతూ ఉండే రంధ్రాన్ని ________________అంటారు.

(బి) ఎడమ కర్ణిక, ఎడమ జఠరికలను కలుపుతూ ఉండే రంధ్రాన్ని ________________అంటారు.

తమగుండా ఒకదిశలో మాత్రమే పదార్థాలు ప్రయాణించడానికి అనుమతించే రంధ్రాన్ని కవాటం అంటారు.

(ఎ)గుండె గదుల మధ్య ఉండే కవాటాలకు పేర్లు రాయండి.

(బి)ఎడమ కర్ణిక, ఎడమ జఠరికల మధ్య ఉండే కవాటం ________________.

(సి) కుడి కర్ణిక, కుడి జఠరికల మధ్య ఉండే కవాటం ________________.

14. కాళ్ళలో ఉండే సిరల్లో కవాటాలు రక్త ప్రవాహాన్ని అడ్డుకోకపోతే జరిగే పరిణామాలేమిటో ఊహించండి.(AS2)
15. మొక్కల మూలకేశ కణాలలోని కణద్రవ్యం గాఢత ఎక్కువయినపుడు ఏమి జరుగుతుంది?(AS2)
16. జాన్ కాగితం కప్పు, ప్లాస్టిక్ గొట్టాలను ఉపయోగించి స్టెతస్కోపును తయారుచేశాడు. అతడు అనుసరించిన విధానాన్ని రాయండి.(AS3)
17. పోషక కణజాలం ద్వారా మొక్కలలో ఆహారం రవాణా జరుగుతుందని తెలపడానికి శాస్త్రవేత్తలు ఏ ప్రయోగాన్ని చేస్తావు? ఎలా చేసారో వివరించండి.(AS3)
18. ఎఫిడ్‌లపై శాస్త్రవేత్తలు చేసిన ప్రయోగాల సారాంశం ఏమిటి?(AS3)
19. మీ పాఠశాలలో ఉండే ఉపాధ్యాయుల లేదా మీ ఇంటి చుట్టుపక్కల ఉండే వారి రక్తపీడన సమాచారాన్ని సేకరించండి. వారిలో ఎక్కువ రక్తపీడనం (high B.P.) తక్కువ రక్తపీడనం (low B.P.) గలవారు ఎదుర్కొంటున్న ఆరోగ్య సమస్యల గురించి నివేదిక రాయండి.(AS4)
20. ఏకవలయ, ద్వంద్వవలయ రక్తప్రసరణను తెలియజేసే బ్లాక్ డయాగ్రం గీసి రెండింటి మధ్య తేడాలు రాయండి.(AS5)
21. ఆకుల గుండా జరిగే బాష్పోత్సేకాన్ని, వేళ్ళ గుండా జరిగే నీటి శోషణను తెలియజేసే నమూనా పటం గీయండి.(AS5)
22. మానవునిలో విస్తరించి ఉన్న రక్తప్రసరణ వ్యవస్థ నిర్మాణాన్ని నీవు దేనితో పోలుస్తావు?(AS6)
23. హీమోఫిలీయా అనగానేమి ?(AS1)
24. హృదయస్పందనపై ఏదైనా ఒక కార్టూన్‌ను తయారుచేయండి.(AS7)
25. ఈ పాఠం చదివిన తరువాత ప్రయాణ సమయాల్లో కాళ్ల వాపు గురించి మీ పెద్దలకు నీవు ఏమి సలహాలిస్తావు?(AS7)

## సరైన సమాధానాన్ని గుర్తించండి

1. కార్డియాక్ అన్న పదం మన శరీరంలో ఈ అవయవానికి సంబంధించినది. ( )
   (ఎ) గుండె (బి) సిర (సి) లింఫ్ గ్రంథి (డి) రక్తకేశనాళిక
2. గుండెలో ఏ భాగంలో ఉండే రక్తంలో తక్కువ ఆక్సిజన్ ఉంటుంది? ( )
   (ఎ) కుడి కర్ణిక (బి) కుడి జఠరిక (సి) ఎడమ కర్ణిక (డి) ఎ మరియు బి
3. కిందివానిలో ఏ భాగం రక్త ప్రసరణను నియంత్రిస్తుంది? ( )
   (ఎ) ధమనులు (బి) సిరలు (సి) కవాటాలు (డి) రక్తకేశనాళిక
4. కిందివానిలో ఏది సరైనది కాదు? ( )
   ఎ) రక్త స్కంధనం తరువాత మిగిలిన ద్రవాన్ని 'సీరం' అంటారు.
   బి) శోష రసం రక్తాన్ని కణాలతో జోడించే ప్రధానమైన పదార్థం.
   సి) దారువు, పోషక కణజాలలు నీటిని, ఆహార పదార్థాలను సరఫరా చేస్తాయి.
   డి) కీటకాలలో సంవృత రక్త ప్రసరణ వ్యవస్థ ఉంటుంది.
5. ఎఫిడ్ తన తొండాన్ని మొక్కలో .................. లోనికి చొప్పించి రసాన్ని పీలుస్తుంది. ( )
   ఎ) దారువు (బి) పోషక కణజాలం (సి) దవ్వ (డి) నాళికాపుంజం



## అనుబంధం-1

### రీసస్ కారకం

రక్తంలో ఉండే మరొక ప్రతిదేహమే రీసస్ కారకం. బ్రిటన్ దేశ జనాభాలో 85 శాతం మందిలో ఈ రకమైన ప్రతిదేహాలున్నట్లు గమనించారు. దీనిని మొట్టమొదటి సారిగా రీసస్ అనే జాతి కోతులలో గుర్తించారు. అందువల్ల ఈ ప్రతిదేహాలకు రీసస్ కారకం అని పేరు వచ్చింది. రక్తంలో ఈ ప్రతిదేహాలు కలిగిన వారిని $Rh^+$ గానూ లేని వారిని $Rh^-$ గానూ గుర్తిస్తారు. సాధారణంగా $Rh^-$ వ్యక్తుల ప్లాస్మాలో దీనికి సంబంధించిన ప్రతిరక్షకాలు ఉండవు. ఒకవేళ $Rh^+$ వ్యక్తి రక్తాన్ని $Rh^-$ కు ఎక్కించినట్లయితే అతనిలో $Rh^-$ ప్రతిరక్షకాలు ఏర్పడి $Rh^+$ రక్తకణాలను నాశనం చేస్తాయి. ఇది శిశువులలో తీవ్రమైన ఆటంకంగా పరిణమిస్తుంది.

ఒకవేళ $Rh^+$ పురుషుడు $Rh^-$ స్త్రీని వివాహం చేసుకొన్నపుడు పుట్టే పిల్లల్లో కొందరు $Rh^+$ గానే ఉంటారు. గర్భంలో ఉన్నపుడు తల్లినుండి పిండానికి నిరంతరం రక్తం సరఫరా కావలసిన పరిస్థితి ఉంటుంది. బిడ్డ రక్తం తల్లి రక్తంతో కలిసిపోతుంది. అప్పుడు ఆమెలో ప్రతిరక్షకాలు ఏర్పడతాయి. తరువాత పుట్టే పిల్లలు కూడా $Rh^+$ అవుతున్నట్లయితే తల్లిలో ప్రతిదేహాల పరిమాణం పెరుగుతూపోతుంది. ఈ ప్రతిదేహాలు రక్తం ద్వారా బిడ్డకు చేరినట్లయితే వారు తీవ్రమైన రక్తహీనతకు గురవుతారు. కొన్నిసార్లు గర్భస్రావం, ప్రాణాపాయం కూడా జరగవచ్చు. ఇలాంటి సందర్భాలలో ప్రతిరక్షకాలు లేకుండా శిశువులో మొత్తం రక్త మార్పిడి చేయాల్సి ఉంటుంది. $Rh^+$ కారకం కలిగిన మొదటి శిశువు పుట్టగానే ప్రత్యేకమైన సూదిమందు ఇవ్వడం ద్వారా తరువాత పుట్టే పిల్లలకు హాని జరగకుండా వైద్యసదుపాయాలు అందుబాటులోకి వచ్చాయి.



# అనుబంధం-2

## తలసేమియా

తలసేమియా అనేది వంశపారంపర్యంగా వచ్చే రక్తసంబంధ వ్యాధి. ఎర్రరక్త కణాలలో హీమోగ్లోబిన్ లోపించి రక్తహీనతకు దారితీస్తుంది. తలసేమియాతో బాధపడేవారిలో ఆక్సిజన్‌ను రవాణాచేసే హీమోగ్లోబిన్ తక్కువగా ఉత్పత్తి అవుతుంది. ఈ వ్యాధి అల్ఫా మరియు బీటా అనే రెండు రకాలు. హిమోగ్లోబిన్ ప్రోటీన్‌లో వివిధ భాగాలలో వచ్చే లోపాలవల్ల ఈ రెండు రకాల తలసేమియా వ్యాధులు వస్తాయి. తక్కువస్థాయి తలసేమియా వ్యాధిగ్రస్తులలో రక్తహీనత, కాలేయం, పిత్తాశయం పరిమాణం పెరగడం, వ్యాధినిరోధక శక్తి తగ్గడం పెరుగుదల నెమ్మదిగా ఉండడం. ఎముకలు సన్నబడి పెళుసుగా మారడం గుండెపోటు మొదలైన లక్షణాలు ఈ వ్యాధి సోకిన వారిలో కనిపిస్తాయి.

## తలసేమియా కొన్ని వాస్తవాలు

- ఇది ఒక తీవ్రమైన వంశపారంపర్య, రక్తసంబంధ వ్యాధి.
- ప్రపంచ జనాభాలో 4.5 (250 మిలియన్లు) శాతం మంది తలసేమియా మైనర్ వ్యాధితో బాధపడుతున్నారు.
- సుమారు 35 మిలియన్ల భారతీయులు ఈ వ్యాధి కలిగించే అసాధారణ జన్యువును కలిగిన వాహకులు.
- ప్రపంచంలో ప్రతిసంవత్సరం లక్షమంది శిశువులు తలసేమియా మేజర్‌తో జన్మిస్తున్నారని అంచనా.
- మనదేశంలో ప్రతిసంవత్సరం 10 నుండి 12 వేలమంది పిల్లలు ఈ వ్యాధితో జన్మిస్తున్నారు.
- తలసేమియా వ్యాధిగ్రస్తుల జీవితకాలం పెంచాలంటే రక్తమార్పిడి, విలువైన మందులు అవసరం.
- వివాహం, గర్భధారణకు ముందు శిశుజననం తరువాత పరీక్షలు చేయించుకోవడం, అవగాహన కల్పించడం వల్ల ఈ వ్యాధిని నివారించవచ్చు.

## చికిత్స

పెరుగుదల తక్కువగా ఉండడం, పెళుసు బారిన ఎముకలు తొందరగా వ్యాధులకు గురికావడం వంటి లక్షణాలను మొదటి ఏడాదిలోనే గుర్తించినట్లయితే తలసేమియా మేజర్‌ని తగ్గించడం తేలికవుతుంది. మొదటి సంవత్సరంలోనే శిశువులలో హిమోగ్లోబిన్ స్థాయిని, పెరుగుదలను జాగ్రత్తగా గమనిస్తుండాలి. హిమోగ్లోబిన్ పరిమాణం 70% కన్నా తగ్గినపుడు పిల్లల్లో పెరుగుదల లోపిస్తుంది. వారు క్రమం తప్పకుండా రక్తమార్పిడి చికిత్స చేయించుకోవాల్సి ఉంటుంది. ప్రపంచ ఆరోగ్య సమస్యల లెక్కల ప్రకారం హిమోగ్లోబిన్ స్థాయి 115-120 గ్రా./లీ. గా ఉండేలా చూడడం. ఈ చికిత్సలో ముఖ్యమైన అంశం ప్రతిమూడు నాలుగు వారాలకొకసారి గాఢత కలిగిన ఎర్రరక్తకణాలను ప్రవేశపెట్టడం ద్వారా చికిత్స చేస్తారు. మూలకణాల మార్పిడి ద్వారా తలసేమియా మేజర్ వ్యాధిని నయం చేయవచ్చు. ఈ వ్యాధితో బాధపడుతున్న పిల్లలకు వారి కణజాలాలకు సమానమైన కణజాలం కలిగిన వారి (HLA రకం) సోదర / సోదరిల నుండి సేకరించిన ఎముక మజ్జలో ఉండే ఎర్రరక్తకణాల మూలకణాల (ఎముక మజ్జ మార్పిడి) మార్పిడి ద్వారా చికిత్స చేయవచ్చు.

పాఠం

4

# విసర్జన



కొత్తగా ఏ వస్తువును ఉత్పత్తి చేసినా దానితోపాటు, వ్యర్థపదార్థాలు కూడా ఏర్పడటమనేది సహజం. ఎలాంటి వ్యర్థం ఏర్పడకుండా ఏ కర్మాగారమూ ఒక నూతన ఉత్పత్తిని చేపట్టలేదు. అదేవిధంగా మన శరీరం ఒక సజీవ కణ కర్మాగారం. ఇతర జీవులు కూడా ఇలాంటివే. జీవులలో జీవక్రియలు జరిగేటపుడు అవసరమైన పదార్థాల ఉత్పత్తిలో భాగంగా నిర్దిష్ట విరామాలలోఅనేక వ్యర్థ పదార్థాలు కూడా తయారవుతూ ఉంటాయి. ఈ విషయం గురించి ఆలోచించినపుడు మనకు అనేక సందేహాలు కలుగుతాయి. ఉదాహరణకు

- *వ్యర్థ పదార్థాలు ఎక్కడ ఉత్పత్తి అవుతాయి?*
- *అవి ఎలా ఉత్పత్తి అవుతాయి?*
- *వాటిలో ఏ యే పదార్థాలుంటాయి?*
- *ఒకేజీవి విభిన్న పరిస్థితుల్లో ఉత్పత్తిచేసే వ్యర్థపదార్థాలు ఒకే రకంగా ఉంటాయా?*

ఇలాంటి ఆలోచనాత్మకమైన ప్రశ్నలే విసర్జన క్రియావిధానం గురించిన విశేషాలను విపులంగా అర్థం చేసుకోవడానికి దారితీస్తాయి. వీటన్నింటి గురించి ఈ పాఠంలో చర్చిద్దాం.

సజీవుల మనుగడకు మరియు వివిధ జీవక్రియల నిర్వహణకు శక్తి అవసరం. ఇవి నిర్మాణాత్మక క్రియలు (Anablolic activities) లేదా విచ్ఛిన్న క్రియలు (Catabolic

**పట్టిక-1**

| జీవక్రియలు | ఉత్పన్నాలు |
|---|---|
| కిరణజన్య సంయోగక్రియ | |
| శ్వాసక్రియ | |
| జీర్ణక్రియ | |

activities) కావచ్చు. వాటన్నింటిని కలిపి జీవ క్రియలు (Metabolic activities) అని అంటారు. జీవులన్నీ జీవక్రియల నిర్వహణలో వివిధ రకాలైన పదార్థాలను ఉపయోగిస్తాయి. ఫలితంగా అనేక రకాల పదార్థాలు ఉత్పన్నమవుతూ ఉంటాయి. పట్టిక-1లో సూచించిన వివిధ జీవ ప్రక్రియలలో ఏర్పడే వివిధ ఉత్పన్నాలేమిటో చర్చించి పట్టికలో రాయండి.

- *జీవులు ఏయే ఉత్పన్నాలను, ఇతర క్రియల నిర్వహణకు ఉపయోగించుకుంటాయి.*
- *విసర్జించకపోయినట్లయితే ఏ యే ఉత్పన్నాలు శరీరానికి హాని కలిగిస్తాయి?*
- *శరీరానికి హానికలిగించే వాటిని ప్రతిరోజూ విసర్జించకపోతే ఏం జరుగుతుంది?*

జీవులలో వివిధ జీవక్రియల ఫలితంగా ఉత్పన్నమయ్యే వివిధ రకాల పదార్థాల గురించి నేర్చుకున్నాం. వానిలో హాని కలుగజేసే పదార్థాలను విసర్జించటం, కొన్నింటిని వేరే రూపంలోకి మార్చుకొని నిల్వ చేయటం జరుగుతుంది. అంటే అవన్నీ ఉత్పత్తి చేయబడిన వ్యర్థ పదార్థాలన్నమాట.

కిరణజన్యసంయోగక్రియ లేదా శ్వాసక్రియలో ఉత్పన్నమయ్యే వాయురూప వ్యర్థాలు బయటికి ఎలా పంపబడతాయో మనం ఇంతకుముందు పాఠాలలో తెలుసుకున్నాం. ఇతర జీవక్రియలలో ఉత్పత్తిచేయబడే నత్రజని సంబంధిత పదార్థాలు కూడా బయటకి పంపించవలసిన అవసరం ఉంటుంది. లవణాలు, ఎక్కువగానున్న నీరు మరియు ఇతర వ్యర్థపదార్థాలు తొలగించబడాలి. విసర్జన (excretion) లాటిన్ భాషలో ex అంటే బయటకు అని, crenere అంటే పంపుట అని అర్థం. విసర్జన సజీవులలో జరిగే ఒక జీవక్రియ. అంటే దేహంలో తయారయ్యే వ్యర్థపదార్థాలను వేరుచేయడం మరియు బయటకి పంపించడం జరుగుతుంది.

ఇప్పుడు మనం మానవులలో విసర్జక వ్యవస్థ ఎలా పని చేస్తుందో తెలుసుకుందాం?

## మానవులలో విసర్జన

వివిధ జీవక్రియలలో అసంఖ్యాకమైన చర్యలు జరుగుతూ ఉంటాయి. వీటిలో ఉపయోగకరమైన పదార్థాలు మరియు శక్తి ఉత్పన్నం చేయబడతాయి. అయితే, అదే సమయంలో అనేక మార్పులు సంభవిస్తాయి. ఉదాహరణకు హానికరమైన పదార్థాలు ఉత్పన్నం కావటం, నీటిస్థాయి పెరగటం, అయాన్‌ల సమతుల్యత (homeostasis) లో మార్పురావటం మొదలైనవి. మన శరీరంలో ఉత్పన్నమయ్యే వ్యర్థపదార్థాలలో కార్బన్‌డైఆక్సైడ్, నీరు, నత్రజని సంబంధిత వ్యర్థాలైన అమ్మోనియా, యూరియా, యూరికామ్లం, పైత్యరస వర్ణకాలు, అదనపు లవణాలు మొదలైనవి ఉంటాయి. ఈ వ్యర్థ పదార్థాలన్నింటిలోనూ అమ్మోనియా విషతుల్యమైనది. ఈ వ్యర్థాలన్నీ శరీరంలో ఎక్కడ తయారవుతాయి? ఎక్కడ ఉంటాయి? శరీరం వీటిని ఏవిధంగా సర్దుబాటు చేసుకుంటుంది. శరీరంలో వీటిని ఏవిధంగా గుర్తిస్తారు?

### పట్టిక-2: డిపార్టుమెంట్ ఆఫ్ బయోకెమిస్ట్రీ
### ప్లాస్మా / సీరం రక్త పరీక్ష విశ్లేషణ (రిపోర్టు)

| పరీక్ష పేరు | ఫలితం | ప్రమాణాలు | సాధారణస్థాయి |
|---|---|---|---|
| గ్లూకోజ్-ఫాస్టింగ్ | 82 | మి.గ్రా / డె.లీ. | 60-100 |
| సోడియం | 137 | మి.మోల్స్ / లీ | 135-145 |
| పొటాషియం | 4.10 | మి.మోల్స్ / లీ | 3.5-5.0 |
| క్లోరైడ్స్ | 101 | మి.మోల్స్ / లీ | 95-106 |
| యూరియా | 29 | మి.గ్రా / డె.లీ. | 15-40 |
| క్రియాటినిన్ | 2.8 | మి.గ్రా / డె.లీ. | 0.6-1.5 |
| యూరికామ్లం | 7.50 | మి.గ్రా / డె.లీ. | 3.0-5.0 |
| టోటల్ కొలెస్ట్రాల్ | 221 | మి.గ్రా / డె.లీ. | 150-200 |
| ట్రై గ్లిజరైడ్స్ | 167 | మి.గ్రా / డె.లీ. | 60-200 |
| కాల్షియం | 9.40 | మి.గ్రా / డె.లీ. | 8.0-10.5 |
| ఫాస్ఫరస్ | 4.50 | మి.గ్రా / డె.లీ. | 3-4.5 |
| బైలిరుబిన్ (మొత్తం) | 0.70 | మి.గ్రా / డె.లీ. | 0.1-0.8 |
| ప్రోటీన్లు (మొత్తం) | 7.20 | గ్రా / డె.లీ. | 6.0-7.5 |
| ఆల్బుమిన్ | 4.60 | గ్రా / డె.లీ. | 3.0-5.0 |

మి.మోల్స్ / లీ = మిల్లిమోల్స్ / లీటరు, మి.గ్రా / డె.లీ. = మిల్లిగ్రామ్ / డెసిలీటరు

### పట్టిక-3: డిపార్టుమెంట్ ఆఫ్ బయోకెమిస్ట్రీ
### మూత్ర పరీక్ష విశ్లేషణ (రిపోర్టు)

| పరీక్ష / విధానం | ఫలితం | ప్రమాణాలు | సాధారణస్థాయి |
|---|---|---|---|
| 24గంటల ప్రోటీన్లు | 90 | మి.గ్రా / రోజు | <100 మి.గ్రా. |
| 24గంటల క్రియాటినిన్ | 2.7 | మి.గ్రా / రోజు | 1-2 |
| 24గంటల కాల్షియం | 305 | మి.గ్రా / రోజు | 200 మి.గ్రా. వరకు |
| 24గంటల ఫాస్ఫరస్ | 0.8 | మి.గ్రా / రోజు | 1 గ్రా. వరకు |
| 24గంటల యూరికామ్లం | 800 | మి.గ్రా / రోజు | 600 మి.గ్రా.వరకు |
| **లవణాలు** | | | |
| సోడియం | 140 | మి.మోల్స్/లీ. | 125 - 250 |
| పొటాషియం | 50 | మి.మోల్స్/లీ. | 25 - 100 |
| ఆస్మోలారిటి (గణన చేసిన) | 180 | మి.మోల్స్/లీ. | 100 - 600 |
| గ్లూకోజ్ | 65 | మి.గ్రా./డె.లీ. | 50 - 80 |
| క్లోరైడ్స్ | 128 | మి.మోల్స్/లీ. | 120 - 130 |
| యూరియా | 35 | గ్రామ్/రోజు | 20 - 30 |

పట్టిక-2, 3లలోని ఒక వ్యక్తికి సంబంధించిన రక్తపరీక్ష మరియు మూత్రపరీక్షల రిపోర్ట్లను పరిశీలించండి. రక్తం మరియు మూత్రంలో ఏ ఏ పదార్థాలు ఉన్నాయో తెలుసుకోండి.

24 గంటల మూత్రపరీక్ష అనగా ఒక వ్యక్తినుండి 24 గంటలలో సేకరించిన మొత్తం మూత్రంలో నుండి 100-150 మి.లీ. మూత్రం నమూనాగా తీసుకొని దానిని పరీక్ష చేస్తారు.

- *రక్తంలో ఉన్న పదార్థాలు ఏవి?*
- *మూత్రంలో ఉన్న పదార్థాలు ఏవి?*
- *రక్తం మరియు మూత్రం రెండింటిలోనూ ఉన్న పదార్థాలేమిటి?*
- *చాలా పదార్థాలు రక్తం, మూత్రం రెండింటిలోనూ ఉన్నాయి. ఎందుకు?*
- *రక్తం మరియు మూత్రంలో సాధారణ స్థాయిని మించి ఉన్న పదార్థాలేమిటి?*
- *ఏవేని పదార్థాలు సాధారణ స్థాయిని మించి ఉంటే ఏం జరుగుతుంది?*
- *ఎక్కడినుండి ఈ పదార్థాలను తొలగించాలి?*
- *ఏ యే పదార్థాలను శరీరం నుండి తొలగించవలసిన అవసరమున్నదో పేర్కొనండి.*
- విసర్జక పదార్థాలను ఏ అవయవాలు వేరు చేస్తాయి?
- ఈ పదార్థాలను శరీరం నుండి వేరు చేయవలసిన అవసరం ఏమిటి?

మానవ విసర్జక వ్యవస్థ నిర్మాణం మరియు పనితీరును అధ్యయనం చేస్తే ఆయా విషయాలను మనం చక్కగా అవగాహన చేసుకోవచ్చు.

## మానవ విసర్జక వ్యవస్థ

మానవునిలో విసర్జన ముఖ్యంగా మూత్ర లేదా విసర్జక వ్యవస్థ ద్వారా జరుగుతుంది. దీనిలో ఒకజత మూత్రపిండాలు, ఒక జత మూత్ర నాళాలు, మూత్రాశయం మరియు ప్రసేకం మొదలైన భాగాలుంటాయి.పటం-4 ను పరిశీలించండి. ఇప్పుడు మనం మేక లేదా గొర్రె మూత్రపిండాల బాహ్య మరియు అంతర్గత లక్షణాలను పరిశీలిద్దాం.



### ప్రయోగశాల కృత్యం

**ఉద్దేశ్యం:** మూత్రపిండం బాహ్య మరియు అంతర లక్షణాలను అధ్యయనం చేయుట

**కావాల్సిన పదార్థాలు:** మాంసం కొట్టులో సేకరించిన మేక లేదా గొర్రె మూత్రపిండం. లేదా మూత్రపిండం 3D నమూనా, పదునైన బ్లేడ్, ట్రే మరియు నీళ్ళు.

**పరిశీలనా విధానం:**

మేక లేదా గొర్రె మూత్రపిండాన్ని సేకరించి ప్రయోగశాలకు తీసుకుని వచ్చేముందు రక్తమంతా పోయేలా నీటితో శుభ్రంగా కడగాలి. పూర్తిగా ఆరిన తర్వాత దానిని ఒక ట్రేలో పెట్టి బాహ్య లక్షణాలను జాగ్రత్తగా పరిశీలించండి. నోట్‌బుక్‌లో మీ పరిశీలనలు నమోదుచేయండి. ఒక పదునైన బ్లేడు లేదా స్కాల్‌పెల్ సాయంతో మూత్రపిండాన్ని నిలువుగా

పటం-1: మేక మూత్రపిండం




పటం-2:
మేక మూత్రపిండం నిలువుకోత

జాగ్రత్తగా కోసి, అంతర్గత నిర్మాణాన్ని పరిశీలించండి. ఇందుకోసం మీ ఉపాధ్యాయుని సహకారం తీసుకోండి. పరిశీలించిన దాని పటం గీయండి. మీరు గీసిన పటాన్ని పటం-1 మరియు 2లతో పోల్చండి.

- *మూత్రపిండాలు ఏ ఆకారంలో ఉన్నాయి?*
- *ఏ రంగులో ఉన్నాయి?*
- *మూత్రపిండంపై భాగంలో అతుక్కొని ఏవైనా నిర్మాణాలు ఉన్నాయా?*
- *మూత్రపిండాల లోపలి నిర్మాణం పటం-2 మాదిరిగానే ఉందా?*
- *మూత్రపిండం అడ్డుకోతలో బయటిభాగం ఏ రంగులో ఉంది?*
- *ముదురు ఎరుపురంగు భాగం ఎక్కడ ఉంది?*
- *మూత్రపిండాల గుంటభాగం (హైలస్) నుండి ఎన్ని నాళాలు బహిర్గతమవుతున్నాయి?*

మీ పరిశీలన పూర్తయిన వెంటనే యాంటిబాక్టీరియల్ లోషన్‌తో చేతులు శుభ్రం చేసుకోవడం మరిచిపోకండి. మీ పరిశీలనల ఆధారంగా మానవ విసర్జక వ్యవస్థ యొక్క నిర్మాణం మరియు పనిచేసే విధానాలను గురించి తెలుసుకుందాం.

## మూత్రపిండాలు

మానవులలో చిక్కుడు గింజ ఆకారంలో ముదురు ఎరుపు రంగులో ఒక జత మూత్రపిండాలు ఉంటాయి. ఇవి ఉదరకుహరంలో పృష్ఠ శరీర కుడ్యానికి అతుక్కొని, వెన్నెముకకు ఇరువైపులా అమరి ఉంటాయి. (పటం-3) కుడివైపు మూత్రపిండం, ఎడమవైపు దాని కన్నా కొద్దిగా కిందికి ఉంటుంది. ఎందుకు ఈ విధంగా ఉంటుందో ఆలోచించండి? ఉదరకుహర కుడి భాగంలో అధిక ప్రాంతం కాలేయం ఆక్రమిస్తుంది. మూత్రపిండాలు 10 సెం.మీ. పొడవు, 5-6 సెం.మీ. వెడల్పు, 4 సెం.మీ. మందంతో ఉంటాయి. ప్రతి మూత్రపిండం వెలుపలవైపు కుంభాకారంగాను, లోపలివైపు పుటాకారంగాను ఉంటుంది.

ఒకసారి ప్రయోగశాల కృత్యంలో చివరి ప్రశ్నను జ్ఞప్తికి తెచ్చుకోండి. పుటాకారంగా ఉన్న లోపలి తలం మధ్యలో గల పల్లాన్ని హైలస్ అంటారు. ఈ హైలస్ ద్వారా వృక్కధమని మూత్రపిండంలోనికి ప్రవేశిస్తుంది. వృక్కసిర, మూత్రనాళం వెలుపలికి వస్తాయి. శరీరంలోని వివిధ అవయవాలలో ఉత్పత్తి అయిన వ్యర్థాలు ఆమ్లజని సహిత రక్తంతో కూడి వృక్కధమని ద్వారా మూత్రపిండాన్ని చేరుతాయి. ఆమ్లజని రహిత రక్తాన్ని వృక్కసిర మూత్రపిండం నుండి బయటికి పంపుతుంది. మూత్రపిండంలో రక్తం వడగట్టబడుతుంది. ఫలితంగా వేరుచేయబడిన వ్యర్థాలు మూత్రంగా బయటికి విసర్జింపబడతాయి.



పటం-3: మూత్రపిండస్థానం





పటం-4: విసర్జక వ్యవస్థ

## మూత్రపిండం - అంతర్నిర్మాణం

మూత్రపిండం అంతర్నిర్మాణాన్ని తెలుసుకోవడానికి మూత్రపిండ నిలువుకోతను పరిశీలిద్దాం. మూత్రపిండం లోపల రెండు భాగాలుగా కనిపిస్తుంది. ముదురుగోధుమ వర్ణంలోనున్న వెలుపలి భాగాన్ని వల్కలం (Cortex) అనీ, లేత వర్ణంలోనున్న లోపలి భాగాన్ని దవ్వ (Medulla) అనీ అంటారు. ప్రతీ మూత్రపిండంలోనూ సుమారు ఒక మిలియన్ కంటే ఎక్కువ (1.3 నుండి 1.8 మిలియన్) సూక్ష్మ వృక్కనాళాలు ఉంటాయి. వాటినే వృక్క ప్రమాణాలు లేదా నెఫ్రాన్‌లని (Nephrons) అంటారు.

## నెఫ్రాన్ నిర్మాణం

ప్రతి నెఫ్రాన్‌లోను కింది భాగాలుంటాయి. అవి

### 1. మాల్ఫీజియన్ దేహం (Malpighian body)

నెఫ్రాన్‌లో ఒకచివర వెడల్పయిన కప్పు ఆకారంలో ఉండే నిర్మాణాన్ని భౌమన్ గుళిక అంటారు. దానిలో ఉన్న రక్తకేశనాళికలతో ఏర్పడిన వలలాంటి నిర్మాణాన్ని రక్తకేశనాళికా -గుచ్ఛం (Glomerulus) అంటారు. అభివాహిధమనిక (ధమనిక అనునది ధమనుల అతిచిన్న శాఖ) భౌమన్స్ గుళికలోకి ప్రవేశించి రక్తకేశనాళికలన్నీ కలిసి అభివాహిధమని కంటే తక్కువ వ్యాసంకల అపవాహిధమనిగా బౌమన్స్ గుళికలో నుంచి వెలుపలికి వస్తుంది.

- *పటంలో అభివాహిధమనిక కంటే అపవాహిధమనిక సన్నగా ఉండడం గమనించారా? దీనికి కారణం ఆలోచించండి.*

అభివాహి ధమనిక వ్యాసం, అపవాహి ధమనిక వ్యాసం కంటే ఎక్కువగా ఉండడం వల్ల రక్తకేశనాళికాగుచ్ఛంలో పీడనం పెరిగి దానిలోని పదార్థాలు వడపోతకు గురవుతాయి. భౌమన్ గుళిక గోడలలోని కణాలు ఉపకళాకణజాలంతో ఏర్పడతాయి. వీటిని పోడోసైట్లు అంటారు. పదార్థాల వడపోతకు వీలుకలిగించేలా పోడోసైట్ కణాల మధ్య సూక్ష్మరంధ్రాలు ఉంటాయి.




పటం-5: మూత్రపిండ అంతర్నిర్మాణం

పటం-6: నెఫ్రాన్ నిర్మాణం

## 2. వృక్కనాళిక (Renal tubule)

వృక్కనాళికలో 3 భాగాలుంటాయి. 1. సమీపస్థ సంవళితనాళం (Proximal convoluted tubule-PCT) 2. హెన్లీ శిక్యం (U ఆకారంలో ఉంటుంది.) 3. దూరస్థ సంవళితనాళం (Distal convoluted tubule-DCT).

దూరస్థ సంవళితనాళం, సంగ్రహణ నాళంలోనికి తెరచుకుంటుంది. సంగ్రహణ నాళాలు పిరమిడ్‌లు మరియు కెలిసిస్‌లుగా ఏర్పడి చివరికి ద్రోణి (Pelvis)లోనికి తెరచుకుంటాయి. ద్రోణి మూత్రనాళంలోకి తెరుచుకుంటుంది.

వృక్కనాళికలోని అన్ని భాగాలు అపవాహి ధమనిక నుండి ఏర్పడిన బాహ్య రక్తకేశనాళికల వలచేత ఆవరింపబడి ఉంటాయి. బాహ్య రక్తకేశనాళికలన్నీ కలిసి చివరన వృక్కసిరగా ఏర్పడతాయి.

- *నెఫ్రాన్ మూత్రపిండం యొక్క నిర్మాణాత్మక మరియు క్రియాత్మక ప్రమాణమని ఎందుకంటారు?*

## మూత్రం ఏర్పడే విధానం

మూత్రం ఏర్పడే విధానంలో4 దశలుంటాయి. 1) గుచ్ఛగాలనం (Glomerular filtration) 2) వరణాత్మక పునఃశోషణం (Tubular reabsorption) 3) నాళికాస్రావం (Tubular secretion) 4) అధిక గాఢత గల మూత్రం ఏర్పడడం (Formation of hypertonic urine).

### 1. గుచ్ఛగాలనం (Glomerular filtration)

వృక్కధమని ద్వారా రక్తం అభివాహిక ధమనిలోని రక్తకేశనాళిక గుచ్ఛంలోకి ప్రవహించి, అక్కడ అది అధిక పీడనంతో వడపోయబడుతుంది. దీని ఫలితంగా వ్యర్థపదార్థాలతో పాటుగా కొంత నీరు మరియు ఉపయోగకరమైన పదార్థాలు వడపోయబడుతాయి. అవి బౌమన్స్ గుళికలోకి ప్రవేశిస్తాయి. దీనినే గుచ్ఛగాలనం అంటారు. గుచ్ఛగాలనం ద్వారా ఏర్పడిన వడపోత పదార్థాన్ని ప్రాథమిక మూత్రం అంటారు.

### 2. వరణాత్మక పునఃశోషణం (Tubular reabsorption)

గుచ్ఛగాలనం ద్వారా ఏర్పడిన మూత్రం దాదాపుగా రసాయనికంగా రక్తంలో సమానంగా ఉంటుంది. కాని ప్రాథమిక మూత్రంలో రక్తకణాలు ఉండాలి. హేన్లీశక్యం చుట్టు ఉండే బాహ్యరక్తకేశనాళికలు (Peritubular capillaries) ప్రాథమిక మూత్రంలోని అవశ్యక పదార్థాలు మరియు అధికమొత్తంలోని నీటిని పునఃశోషణం చేస్తాయి.

### 3) నాళికా స్రావం (Tubular secretion):

అవశ్యక పదార్థాలు మరియు నీటి పునఃశోషణ తరువాత మూత్రం హేన్లీశక్యం ద్వారా ప్రవహిస్తుంది. హేన్లీశక్యం చుట్టు ఉన్న బాహ్యరక్తకేశ నాళికల నుండి (peritubular capillaries) రక్తకేశనాళిక గుచ్ఛంలో వడపోయబడని వ్యర్థపదార్థాలు హేన్లీశక్యంలోకి స్రవించబడతాయి.

### 4) అతిగాఢత గల మూత్రం ఏర్పడడం :

హేన్లీశక్యం నుండి సంగ్రహణ నాళంలోనికి చేరిన మూత్రం వాసోప్రెసిన్ అనే హార్మోన్ సమక్షంలో మరింత గాఢత చెందుతుంది. వాసోప్రెసిన్ లోపం వలన తక్కువ గాఢత గల మూత్రం అధికంగా విసర్జించబడుతుంది. ఈ స్థితిని అతిమూత్ర వ్యాధి లేదా 'డయాబెటిస్ ఇన్సిపిడస్' అంటారు.



**మీకు తెలుసా?**

40 సంవత్సరాల వయసు దాటిన తరువాత దాదాపుగా అందరిలోను ప్రతి 10 సంవత్సరాలకు 10% నెఫ్రాన్ల క్రియాశీలత తగ్గుతుంది.

- *శీతాకాలంలో ఎక్కువసార్లు మూత్రవిసర్జన చేయవలసి వస్తుంది. ఎందుకు?*
- *ఒకవేళ, నీటి పునఃశోషణ జరగపోతే ఏం జరుగుతుంది?*

ఇపుడు మనం విసర్జక వ్యవస్థలోని మిగిలిన భాగాల గురించి పరిశీలిద్దాం.

### మూత్రనాళికలు (Ureters)

ప్రతి మూత్రపిండం యొక్క నొక్కు లేదా హైలస్ నుండి ఒక జత తెల్లని, కండరయుతమైన సన్నని మూత్రనాళాలు బయటికి వస్తాయి. ఇవి దాదాపు 30 సెం.మీ. పొడవు ఉంటాయి.

ప్రతి మూత్రపిండం హైలస్ (గుంటభాగం) నుండి మూత్రనాళాలు బయలు దేరతాయి. పరభాగానికి ప్రయాణించి మూత్రాశయంలోనికి తెరచుకుంటాయి. మూత్రం, మూత్రపిండాలనుండి మూత్రాశయంలోనికి మూత్ర నాళాల ద్వారా పెరిస్టాలిసిస్ కదలికలతో ప్రయాణిస్తుంది.

### మూత్రాశయం (Urinary Bladder)

మూత్రాశయం పలుచని గోడలు కలిగి, బేరిపండు ఆకారంలో ఉండే సంచి వంటి నిర్మాణం. ఇది ద్రోణి (కటివలయ) భాగంలో పురీషనాళానికి ఉదరతలాన ఉంటుంది. మూత్రనాళాల ద్వారా చేరిన దాదాపు 300-800మి.లీ. మూత్రాన్ని ఇది తాత్కాలికంగా నిల్వచేస్తుంది.

### ప్రసేకం (Urethra)

ప్రసేకం, మూత్రాశయం నుండి మూత్రాన్ని బయటికి విసర్జించే నాళం. మూత్రాశయం చివర ప్రసేకంలోనికి తెరచుకునే చోట వర్తుల సంవరణి (Sphincter) కండరాలనుండి మూత్ర కదిలికల నియంత్రణకు తోడ్పడుతుంది. ప్రసేకం స్త్రీలలో 4 సెం.మీ.ల పొడవు ఉండి ఆళిందంలోకి (Vestibule) తెరచుకొంటుంది. అయితే పురుషులలో 20 సెం.మీ. పొడవుండి మూత్ర జననేంద్రియనాళం (Urino-genital duct) గా పిలవబడుతుంది.

### మూత్ర విసర్జన (Micturition)

మూత్రాశయంలో మూత్రం తాత్కాలికంగా నిల్వ ఉంటుంది. మూత్రం బయటకు వచ్చే మార్గాన్ని ఆవరించి రెండు జతల వర్తుల సంవరిణీ కండరాలు ఉంటాయి. మూత్రాశయం నిండేంత వరకు ఈ రెండు జతల కండరాలు సంకోచస్థితిలో ఉంటాయి. దీనివలన రంధ్రం మూసుకొని ఉంటుంది. మూత్రం చేరేకొద్ది అది కలుగజేసే వత్తిడి వలన మూత్రాశయం గోడల మీద పీడనం అధికమవుతుంది. దీనివలన అసంకల్పితంగానే పై వర్తుల సంవరిణీ కండరం సడలుతుంది. కానీ క్రింది సంవరిణీ కండరం మన ఆధీనంలో ఉండి మూత్రవిసర్జనను నియంత్రించగలుగుతుంది. కానీ చిన్నపిల్లలలో ఈ విధమైన నియంత్రణ సాధ్యంకాదు. కాలక్రమేణ వారు మూత్రవిసర్జనను నియంత్రించగలుగుతారు.

మూత్రాశయంలో గరిష్టంగా 700-800 మి.లీ. మూత్రం నిల్వ ఉంటుంది. అయితే దాదాపు 300-400 మి.లీ. మూత్రం చేరినప్పుడు మూత్రాశయం ఉబ్బి, దాని గోడలలోని స్ట్రెచ్ గ్రాహకాలు ఉత్తేజితమై మెదడుకు ప్రచోదనాలను పంపుతాయి. ఫలితంగా మూత్రం విసర్జించాలనే కోరిక కలుగుతుంది. మూత్రాశయం సంకోచించడం వలన మూత్రం బయటకు విడుదుల అవుతుంది. ఈ ప్రక్రియనే మూత్ర విసర్జన (Micturition) అంటారు.

మానవుడు రోజుకు దాదాపు 1.6-1.8 లీటర్ల మూత్రాన్ని విసర్జిస్తారు. అయితే అధికంగా నీరు, పండ్లరసాలు, ద్రవాలు ఎక్కువ తీసుకొనేవారు ఎక్కువగానూ, తక్కువ తీసుకునే వారు తక్కువగానూ మూత్రాన్ని విసర్జించటం సాధారణంగా జరుగుతుంది.



### ఆలోచించండి - చర్చించండి

- కణాలన్నింటికి విసర్జన క్రియ అవసరమా?
- తగినన్ని నీళ్ళు త్రాగడం మంచిదని సూచిస్తుంటారు ఎందుకు?
- కొంతమంది పిల్లలు 15 లేదా 16 సంవత్సరాలు వచ్చేవరకు కూడా రాత్రిపూట నిద్రలో పక్క తడుపుతుంటారు. ఎందుకు?

## మూత్రం సంఘటనం (Composition of urine)

మూత్రం లేత పసుపురంగు ద్రవం. రక్తంలోని హీమోగ్లోబిన్ విచ్ఛిన్నమైనప్పుడు ఏర్పడే యూరోక్రోమ్ అనే పదార్థం ఈ రంగుకి కారణమవుతుంది. మూత్ర సంఘటనం అనేది అనేక కారణాలపైన ఆధారపడి ఉంటుంది.

ఉదాహరణకు మాంసకృత్తులు ఎక్కువగా ఉన్న ఆహారాన్ని తీసుకొన్న వ్యక్తి మూత్రంలో యూరియా ఎక్కువగా ఉంటుంది. ఎందుకంటే ప్రోటీన్ల జీర్ణక్రియలో భాగంగా కాలేయంలో జరిగే డీఅమైనేషన్ ఫలితంగా ఎక్కువ పరిమాణంలో యూరియా ఏర్పడుతుంది.

పిండిపదార్థాలు అధికంగా తీసుకొన్నవారి మూత్రంలో అధిక చక్కెర కనిపించవచ్చు.

ద్రవపదార్థాలు లేదా నీరు అధికంగా ఉండే ఆహార పదార్థాలను తీసుకొన్నవారి రక్తంలోనికి అధికంగా నీరు చేరటం ఫలితంగా పలుమార్లు వారు మూత్రానికి వెళ్ళవలసి వస్తుంది.

మూత్రంలో 96% నీరు, 2.5% కర్బన పదార్థాలు (యూరియా, యూరికామ్లం, క్రియాటిన్, నీటిలో కరిగే విటమిన్‌లు, హార్మోన్‌లు మరియు ఆగ్జలేట్‌లు మొదలైనవి) మరియు 1.5% అకర్బన పదార్థాలు (సోడియం, క్లోరైడ్, ఫాస్ఫేట్, సల్ఫేట్, మెగ్నీషియం, కాల్షియం, అయోడిన్ మొదలైనవి) ఉంటాయి. మూత్రం మొదట ఆమ్లయుతంగా (pH = 6.0) ఉన్నప్పటికీ క్రమంగా క్షారయుతంగా మారుతుంది. ఎందుకంటే యూరియా విచ్ఛిన్నం జరిగి అమ్మోనియా ఏర్పడుతుంది.

రెండు మూత్రపిండాలు పూర్తిగా పనిచేయకపోతే ఏమి జరుగుతుంది?

మూత్రపిండాలు పనిచేయకపోవడాన్ని ESRD (End Stage Renal Disease) అంటారు. మూత్రపిండాలు పనిచేయడం ఆగిపోతే శరీరంలో నీరు, వ్యర్థపదార్థాలు నిండిపోతాయి. ఈ దశను 'యూరేమియ' అంటారు. కాళ్ళు, చేతులు ఉబ్బిపోతాయి. రక్తం శుద్ధికాకపోడం వలన నీరసం, అలసట వస్తాయి. దీనికి పరిష్కారం ఏమైనా ఉందా? ఇపుడు మనం కృత్రిమ మూత్రపిండాలను గురించి తెలుసుకుందాం.

## కృత్రిమ మూత్రపిండం (Artificial kidney)



పటం-8: డయాలసిస్

జీవుల మనుగడకు అతిముఖ్యమైన అవయవాలు మూత్రపిండాలు. కాని ఇన్ఫెక్షన్‌లు, ప్రమాదాలు, అధిక రక్తపీడనం, మధుమేహం లేదా షుగర్ వ్యాధి లేదా మూత్రపిండాలకు ప్రవహించే రక్తంలో ఆటంకాలు మొదలైనవి శరీరంలో విషతుల్యమైన పదార్థాల చేరికకు కారణాలవుతాయి. ఇదే పరిస్థితి కొనసాగితే మరణం సంభవించవచ్చు.

మూత్రపిండాలు పనిచేయని వారిలో డయాలసిస్ యంత్రంతో రక్తాన్ని వడకడతారు. కృత్రిమంగా రక్తాన్ని వడగట్టే ప్రక్రియను హీమోడయాలసిస్ (heamodialysis) అంటారు. ఈ ప్రక్రియలో రక్తాన్ని ఒక ముఖ్యమైన ధమని ద్వారా బయటకు తెచ్చి రక్తస్కందనాన్ని నిరోధించే కారకాలను కలిపి (హెపారిన్ వంటివి) డయలైజర్ యంత్రంలోనికి పంపే ఏర్పాటును చేస్తారు. డయలైజర్ యంత్రంలో రక్తం కొన్ని గదులు లేదా గొట్టాల వంటి (channels) సెల్లోఫేన్‌తో తయారైన నాళికల ద్వారా ప్రవహిస్తుంది. ఈ నాళికలు డయలైజింగ్ ద్రావణంలో మునిగి ఉంటాయి. ఒక సన్నని పొర నాళికలోని రక్తాన్ని బయటఉన్న డయలైజింగ్ ద్రావణాన్ని వేరుచేస్తుంది. నాళాలలో ప్రవహిస్తున్న రక్తం నాళాల బయటఉన్న డైయలైజింగ్ ద్రావణం రెండు ఒకేవిధమైన నిర్మాణాన్ని కలిగిఉంటాయి. తేడా కేవలం నత్రజని వ్యర్థాలే.

డయలైజింగ్ ద్రావణంలో నత్రజనియుత వ్యర్థాలుండవు కనుక డయలైజర్‌లో రక్తం ప్రవహించేటప్పుడు నత్రజని వ్యర్థాలు వేరై రక్తం శుద్ధి చేయబడుతుంది. ఈ ప్రక్రియనే డయాలసిస్ అంటారు. ఈ ప్రక్రియ మూత్రపిండాల పనితీరుకు సారూప్యంగా ఉంటుంది. కానీ పునఃశోషణ ప్రక్రియ జరుగదు. శుద్ధిచేయబడిన రక్తం తిరిగి సిర ద్వారా శరీరంలోనికి ఎక్కిస్తారు. ప్రతిసారి డయాలసిస్‌కు 3-6 గంటల సమయం తీసుకొంటుంది. మూత్రపిండాలు పనిచేయని వేలాది రోగులకు ఈ ప్రక్రియద్వారా ఉపయోగాన్ని చేకూర్చుతున్నారు.

- *మూత్రపిండాలు పనిచేయని వారికి దీర్ఘకాలిక పరిష్కారం ఏదైనా ఉందా?*

## మూత్రపిండ మార్పిడి (Kidney transplantation)

మూత్రపిండాలు పనిచేయని వారికి దీర్ఘకాలిక పరిష్కారం చూపే ప్రక్రియనే మూత్రపిండ మార్పిడి అంటారు. మూత్రపిండాలు పనిచేయని వారికి వారి దగ్గర బంధువు (దాత) నుండి బాగా పనిచేస్తున్న మూత్రపిండాన్ని వేరుచేసి అమర్చుతారు. రోగికి అమర్చిన మూత్రపిండం సరిగ్గా సరిపోయేలా అసంక్రామ్యత వ్యవస్థ ఆ మూత్రపిండాన్ని తిరస్కరించకుండా ఉండాలంటే అతి సమీప బంధువు మూత్రపిండాన్ని దానం చేయాల్సి ఉంటుంది. అయితే ఆధునిక వైద్య విద్యా వైజ్ఞానిక కృషి ఇలాంటి ప్రక్రియల సమర్థతను పెంచాయి.

- *దాతనుండి సేకరించిన మూత్రపిండాన్ని రోగికి ఎక్కడ అమరుస్తారు?*
- *పనిచేయని మూత్రపిండాన్ని ఏం చేస్తారు?*
- *దాత ఒక మూత్రపిండంతోనే జీవించగలడా?*



పటం-9: మూత్రపిండ మార్పిడి

ఈ మధ్య కాలంలో దాతల నుండి మూత్రపిండాలు సేకరించి మూత్రపిండాలు పాడైపోయిన వారికి అమరుస్తున్నారు. వైద్య పరంగా మరణించారని నిర్ధారించిన వ్యక్తి (brain dead) నుండి అవయవాలను సేకరించి అవసరమైన వారికి అమరుస్తారు. దీనినే అవయవదానం అంటారు. ఈ ప్రక్రియను గురించిన సమాచారం అనుబంధంలో చూడండి.

## ఇతర విసర్జక మార్గాలు (అనుబంధ విసర్జకావయవాలు)

మానవ శరీరంలోని అతిముఖ్యమైన విసర్జకావయవమైన మూత్రపిండం గురించి మీరు తెలుసుకున్నారు.

- *మన శరీరంలో ఇంకా ఏ యే విసర్జకావయవాలున్నాయి?*

ఊపిరితిత్తులు, చర్మం, కాలేయం మొదలైన అవయవాలకు ప్రాథమికంగా చేయవలసిన ప్రత్యేక విధులున్నప్పటికీ, అదనంగా విసర్జన ప్రక్రియను కూడా నెరవేరుస్తూ ఉంటాయి.



పటం-10: ఊపిరితిత్తులు, చర్మం

**ఊపిరితిత్తులు:** శ్వాసక్రియలో ఏర్పడే కార్బన్‌డైఆక్సైడ్ మరియు నీటిఆవిరి వంటి వ్యర్థపదార్థాలను ఊపిరితిత్తులు బయటికి పంపుతాయి.

**చర్మం:** చర్మం అసంఖ్యాకమైన స్వేధగ్రంథులను కలిగి ఉంటుంది. వాటి చుట్టూ అనేక రక్తకేశనాళికలుంటాయి. స్వేదగ్రంథులు రక్తం నుండి నీరు మరియు జీవక్రియా ఉత్పన్నాల వ్యర్థాలను సంగ్రహిస్తాయి. అలా శరీరంలో అధికంగా ఉన్న నీటిని మరియు అతి తక్కువ మోతాదులో లవణాలను చెమట రూపంలో బయటకు పంపుతూ

చర్మం ఒక అదనపు విసర్జకాంగంగా పరిగణించబడుతోంది. చర్మంలోని సెబేషియస్ గ్రంథులు సెబం అనే పదార్థాన్ని స్రవిస్తాయి. దీనిలో సెబం, మైనం, స్టిరాల్స్, హైడ్రోకార్బన్‌లు మరియు ఫాటీ ఆమ్లాలు ఉంటాయి. సెబం గురించిన విశేషాలను గ్రంథాలయంలోని పుస్తకాలలో పరిశీలించి వ్యాఖ్య తయారుచేయండి. బులెటిన్ బోర్డులో ప్రదర్శించండి.

- శీతల ప్రాంతాలలో నివసించే వారికి అతి తక్కువ చెమట వస్తుంది. లేదా చమట పట్టదు. దీనివల్ల వారి శరీరంలోని ఇతర విసర్జకావయవాల్లో ఎలాంటి మార్పులు వస్తాయి?



పటం-11:కాలేయం పెద్దప్రేగు

**కాలేయం:** ఎర్రరక్తకణాల జీవితకాలం 120 రోజుల తర్వాత కాలేయంలో అవి విచ్ఛిన్నం అవుతాయి. ఎర్రరక్తకణాలు విచ్ఛిన్నం అయినపుడు హిమోగ్లోబిన్ నుండి బైలురూబిన్, బైలువర్డిన్, యూరోక్రోం అనే పైత్యరస వర్ణకాలు తయారవుతాయి. యూరోక్రోం మూత్రం ద్వారా విసర్జించబడుతుంది. పిత్తాశయంలో పైత్యరస వ్యర్థాలు నిలవవుండి తర్వాత పైత్యరసంతో పాటు కొలెస్ట్రాల్ మరియు స్టిరాయిడ్ హార్మోన్‌లు, మందులు, విటమిన్‌లు, క్షారలవణాలు మొదలైన వాటితోపాటూ మూత్రం ద్వారా బయటకు విసర్జింపబడతాయి. యూరియా తయారీలోను కాలేయం ప్రముఖ పాత్ర పోషిస్తుంది.

**పెద్దప్రేగు (Large intestine):** అధికంగానున్న కాల్షియం, మెగ్నీషియం మరియు ఐరన్‌ల యొక్క లవణాలు పెద్దప్రేగు యొక్క ఉపకళాకణజాలం (Epithelial tissue) చేత వేరుచేయబడి మలంతోబాటు బయటకి విసర్జింపబడతాయి.

అతికొద్ది మోతాదులో నత్రజనియుత వ్యర్థపదార్థాలు నోటిలోని లాలాజలం మరియు కన్నీటి ద్వారా కూడా బయటకి పంపివేయబడతాయి.

## ఇతర జీవుల్లో విసర్జన

విసర్జన వివిధ రకాలైన జీవుల్లో వేరువేరుగా ఉంటుంది. ఏకకణ జీవుల్లో ప్రత్యేకమైన విసర్జకావయవాలుండవు. కణంలోని వ్యర్థపదార్థాలను వ్యాపన పద్ధతిలో బయటికి (చుట్టూ ఉన్న నీటిలోనికి) పంపుతాయి. మంచినీటిలో నివసించే అమీబా, పారమీషియం మొదలైనవి సంకోచ రిక్తికల ద్వారా ద్రవాభిసరణ క్రమతను చూపుతాయి. సంకోచ రిక్తికలు కణంలో అధికంగా ఉన్న నీటిని మరియు వ్యర్థపదార్థాలను సేకరిస్తాయి. సంకోచ రిక్తికలు (Contractile vacuoles) కణద్రవ్యంలో కొద్ది కొద్దిగా జరుగుతూ కణ పరిధిని చేరి పగిలిపోవుట ద్వారా సేకరించిన వ్యర్థాలను బయటకు పంపిస్తాయి. ప్రధానమైన విసర్జన వ్యాపనం (Diffusion) ద్వారా జరుగుతుంది.

బహుకణ జీవులు వివిధ రకాలైన విసర్జకాంగాలను కలిగి ఉండి శరీరంలోని వ్యర్థాలను బయటికి విసర్జిస్తాయి. విసర్జకాంగాల యొక్క నిర్మాణాత్మక మరియు క్రియాత్మక సంక్లిష్టత స్పంజికల నుండి మానవుల వరకు పెరుగుతూ ఉంటుంది.

స్పంజికలు, సీలెంటరేట్లు ప్రత్యేకమైన విసర్జకాంగాలను కలిగి ఉండవు. ప్రతి కణంలోకి నీటి ప్రసరణ జరుగుతూనే ఉంటుంది. ప్లాటిహెల్మింథిస్‌లలో మొట్టమొదటగా విసర్జకాంగాలు కనిపిస్తాయి. వీటిని జ్వాలా కణాలు అంటారు. పట్టిక-4ను పరిశీలించండి.

**పట్టిక-4**

| జీవి పేరు / వర్గం | విసర్జక వ్యవస్థ |
|---|---|
| ప్రోటోజోవా | కణం ఉపరితలం నుండి వ్యాపనం ద్వారాచుట్టూ నీటిలోనికి |
| పొరిఫెరా, సీలెంటరేటా | నీటిప్రసరణ అన్ని కణాల ద్వారా జరగడం వలన |
| ప్లాటీహెల్మింథిస్ | జ్వాలాకణాలు |
| నెమటోడా | రెనెట్ కణాలు |
| అనెలిడా | నెఫ్రీడియా |
| ఆర్థ్రోపోడా | హరితగ్రంథులు, మాల్ఫీజియన్ నాళికలు |
| మొలస్కా | మెటానెఫ్రీడియా |
| ఇఖైనోడెర్మేటా | జలప్రసరణ వ్యవస్థ |
| సరీసృపాలు, పక్షులు, క్షీరదాలు | మూత్రపిండాలు |

## మొక్కల్లో విసర్జన

మొక్కలు కూడా జంతువులలాగే విసర్జిస్తాయా?

ఈరకమైన ప్రశ్నలు ఆశ్చర్యం కలిగిస్తాయి. ఏ జీవక్రియలలోనైనా అంత్య ఉత్పన్నాలతో పాటుగా కొన్ని నత్రజనియుత వ్యర్థపదార్థాలు కూడా తయారవుతాయి. ఇవి చాలా ముఖ్యమైనవి. అలా తయారైన వ్యర్థాలను విసర్జించడానికి మొక్కల్లో ప్రత్యేకంగా అవయవాలు ఉండవు. మొక్కల్లో వ్యర్థపదార్థాలు విచ్ఛిన్నం కావడమనే ప్రక్రియ జంతువులతో పోల్చినపుడు అతినెమ్మదిగా జరుగుతుంది. అంటే మొక్కల్లో వ్యర్థపదార్థాల తయారీ కూడా అతినెమ్మదిగా జరుగుతుందన్నమాట. అవి మొక్క దేహంలో పోగవడం కూడా నెమ్మదిగానే జరుగుతుంది.

రాత్రిపూట ఆకుపచ్చని మొక్కలు హరితపదార్థం లేని భాగాలలో శ్వాసక్రియను జరిపి కార్బన్‌డైఆక్సైడ్ మరియు నీటిని వ్యర్థపదార్థాలుగా విడుదల చేస్తాయి. కిరణజన్యసంయోగ క్రియలో ఆక్సిజన్ వ్యర్థపదార్థంగా ఉత్పత్తిచేయబడి, ఆకుల్లోని పత్రరంధ్రాల ద్వారా, కాండంలోని లెంటిసెల్స్ ద్వారా వాతావరణంలోనికి విడుదల చేయబడుతుంది.

- *మొక్కలు వ్యర్థపదార్థాలను ఏవిధంగా సర్దుబాటుచేస్తాయి లేదా బయటికి పంపిస్తాయి?*

మొక్కలు అధికంగా ఉన్న నీటిని భాష్పోత్సేకం (Transpiration) మరియు బిందుస్రావం (Guttation) ప్రక్రియల ద్వారా బయటికి పంపుతాయి. వ్యర్థ పదార్థాలను ఆకులు, బెరడు

మరియు పండ్లలో నిల్వచేసి, పక్వస్థితిలో వాటిని రాల్చటం ద్వారా వ్యర్థాలను తగ్గించుకుంటాయి. కొన్ని మొక్కలు పండ్లలో వ్యర్థాలను శిలాకణాలు (Raphides)గా నిల్వచేస్తుంటాయి. కొన్ని మొక్కలు వ్యర్థపదార్థాలను స్వీయరక్షణకు ఉపయోగపడే పదార్థాలుగా మార్చుకొంటాయి. కొన్ని మొక్కలు వ్యర్థ పదార్థాలను వేర్లు, ఆకులు, విత్తనాలలో విషపూరిత పదార్థాలుగా మార్చుకొని శాకాహార జంతువుల నుండి రక్షించుకోడానికి ఉపయోగించుకుంటాయి. వీటిలో ఉండే రసాయనాల వలన మొక్కల భాగాలు తినడానికి వీలుకాని రుచితో ఉంటాయి. అందువల్ల ఆ మొక్కలను జంతువులు తినలేవు. కొన్ని రసాయనాలు ఎక్కువగా విషపూరితంగా ఉండి వీటిని తిన్న జంతువులు చనిపోతాయి.



### ఆలోచించండి-చర్చించండి.

- కలుపు మొక్కలు, కొన్ని అటవీ మొక్కలను కీటకాలు, చీడపురుగులు ఎందువలన హాని చేయలేవు?

కొన్ని రకాల మొక్కలలో, మొక్క భాగాలకు గాయమైనపుడు కొన్ని రసాయనాలను స్రవిస్తాయి. అలా స్రవించిన రసాయనాలు గాయాన్ని మాన్పుటలో మొక్కకు సహాయపడతాయి. కొన్ని మొక్కలు ఆకర్షణీయమైన పదార్థాలను వెదజల్లి తమకు ఉపయుక్తంగా మార్చుకొంటాయి. పరాగసంపర్కానికి, విత్తన వ్యాప్తికి, పోషణకు కూడా ఉపయోగపడేలా చేసుకోగలుగుతాయి. ఉదా: వేరుబుడిపెలను కలిగిఉన్న మొక్కలు, కొన్ని రసాయనిక స్రావాలచేత రైజోబియం బాక్టీరియాలను ఆకర్షించి, ఆశ్రయం కల్పించి సహజీవనం చేస్తుంటాయి. ఈ విధమైన సమ్మేళనాలను ద్వితీయ జీవక్రియా ఉత్పన్నాలు (secondary metabolites) అని కూడా అంటారు.

- మొక్కలు నిర్దిష్ట కాలవ్యవధిలో ఆకులు, బెరడును రాలుస్తూ ఉంటాయి ఎందుచేత?

మొక్కల్లో ఉత్పత్తయ్యే జీవరసాయనిక పదార్థాలు రెండు రకాలు. అవి ప్రాథమిక జీవక్రియా ఉత్పన్నాలు మరియు ద్వితీయ జీవక్రియా ఉత్పన్నాలు. పిండిపదార్థాలు, మాంసకృత్తులు, మరియు కొవ్వుల వంటి వాటిని ప్రాథమిక జీవక్రియా ఉత్పన్నాలు అంటారు.

మొక్కల సాధారణ పెరుగుదలకు మరియు అభివృద్ధికి కాకుండా ఇతరమైన విధులకు ఉపయోగపడేవాటిని ద్వితీయ జీవక్రియా ఉత్పన్నాలంటారు. ఉదా: ఆల్కలాయిడ్స్, టానిన్లు, రెసిన్‌లు, జిగురులు మరియు లేటెక్స్‌లు. ఇవి రంగు, సువాసన కలిగి ఉంటాయి. మనం ఆయా రసాయనాలను అనేక రకాలుగా ఉపయోగించుకుంటున్నాం.

#### ఆల్కలాయిడ్‌లు

ఇవి నత్రజనియుత ఉపఉత్పన్నాలు మరియు విషపూరితమైనవి. మొక్కల వివిధ భాగాలలో ఇవి నిల్వ చేయబడతాయి.


నల్లమందు


సర్పగంధి


కాఫి


పొగాకు


ఉమ్మెత్త

పటం-12: ఆల్కాలాయిడ్లు

మొక్కలోని సాధారణ ఆల్కలాయిడ్‌లు, మొక్కలోని ఏ భాగాల్లో ఉత్పత్తి చేయబడతాయి, వాటి ఉపయోగాలు కింది పట్టికలో పరిశీలించండి.

పట్టిక-5

| ఆల్కలాయిడ్ | మొక్క పేరు | మొక్కలోని భాగం | ఉపయోగం |
|---|---|---|---|
| క్వినైన్ | సింకోనా అఫిసినాలిస్ (సింకోనా) | బెరడు | మలేరియా నివారణ |
| నికోటిన్ | నికోటియానా టొబాకమ్ (పొగాకు) | ఆకులు | క్రిమిసంహారిణి, ఉత్తేజకారిణి |
| మార్ఫిన్, కొకైన్ | పెపావర్ సోమ్నిఫెరమ్ (నల్లమందు) | ఫలం | నొప్పినివారిణి |
| రిసర్పిన్ | రావుల్ఫియా సర్పంటైనా (సర్పగంధి) | వేరు | పాముకాటుకు మందు, అధిక రక్తపోటు నివారణ |
| కెఫెన్ | కాఫియా అరాబికా (కాఫిమొక్క) | విత్తనాలు | నాడీవ్యవస్థ ఉత్తేజ కారకం |
| నింబిన్ | అజాడిరక్ట ఇండికా (వేప) | విత్తనాలు, బెరడు, ఆకులు | యాంటిసెప్టిక్ |
| స్కోపోలమైన్ | దతుర స్ట్రామోనియం (ఉమ్మెత్త) | పండ్లు, పువ్వు | మత్తుమందు |
| పైరిత్రాయిడ్స్ | క్రైసాంథిమమ్ (చామంతి) | పుష్పాలు | కీటకనాశనులు |

- *మనకు హాని కలుగజేసే ఆల్కలాయిడ్‌లను చెప్పండి?*

**టానిన్‌లు:** టానిన్‌లు కర్బన సంయోగపదార్థాలు. ఇవి మొక్కల వివిధ భాగాలలో నిల్వచేయబడి ఉంటాయి. ముదురు గోధుమవర్ణం కలిగి ఉంటాయి. టానిన్‌లు టానింగ్ లేదా తోళ్ళను పదునుచేయడానికి మరియు మందులలోను ఉపయోగిస్తారు. ఉదా: తుమ్మ, తంగేడు.

**రెజిన్‌లు:** రెజిన్ నాళాలను కలిగి ఉండటం అత్యధిక వివృత బీజాల ప్రత్యేకత. రెసిన్‌లను వార్నిష్‌లలో ఉపయోగిస్తారు. ఉదా: పైనస్


పటం-13(ఎ): తంగేడు


పటం-13(బి): తుమ్మ


పటం-13(సి): పైనస్

**జిగురులు:** వేప, తుమ్మ మొదలైన చెట్ల శాఖలు, కాండంపై గాయాలైనపుడు అవి జిగురు వంటి పదార్థాన్ని స్రవిస్తాయి. జిగురు నీటిని పీల్చుకొని ఉబ్బుతుంది. ఇది మొక్క గాయాన్ని మాన్పుటకు దోహదం చేస్తుంది. ఆర్థికపరంగా చూస్తే జిగురులు చాలా విలువైనవి. వాటిని అతికించుటకు మరియు బైండింగ్ కారకంగా, మందుల తయారీలోను, ఆహార పదార్థాల తయారీలోను ఉపయోగిస్తుంటారు.

**లేటెక్స్:** లేటెక్స్ జిగటగా, తెల్లగా పాల వలె కొన్ని మొక్కలలో ఉండే ద్రవ పదార్థం. ఇది మొక్కలలోని లేటెక్స్ కణాల్లో లేదా లేటెక్స్ నాళాల్లో నిల్వ ఉంటుంది. హీవియా బ్రెజీలియెన్సిస్ (రబ్బరు మొక్క) మొక్క లేటెక్స్ నుండి రబ్బరు తయారుచేస్తారు. జట్రోపా మొక్క నుండి బయోడీజిల్‌ను తయారుచేస్తారు.

- *జట్రోపా మొక్కలలో ఏ భాగాన్ని జీవ ఇంధనం తయారీలో ఉపయోగిస్తారు?*


పటం-14(ఎ): వేప


పటం-14(బి): జట్రోపా


పటం-14(సి): రబ్బరు మొక్క

**మీకు తెలుసా?**

చూయింగ్ గమ్ అనేది నమలడం కోసం తయారుచేయబడిన ఒక రకమైన జిగురు. దీనిని 5000 సంవత్సరాలకు పూర్వమే దీనిని తయారుచేసేవారని చారిత్రక ఆధారాలున్నాయి. ప్రస్తుతం చూయింగ్ గమ్ చికిల్, సపోట మొక్కల యొక్క సహజసిద్ధమైన లేటెక్స్ నుండి తయారుచేస్తున్నారు.

పార్థీనియం వంటి మొక్కల పుప్పొడి రేణువులు మనకు ఎలర్జీని కలుగజేస్తాయి. వాటిలో ఉండే నత్రజనియుత పదార్థాలు చర్మసంబంధమైన ఎలర్జీ, ఆస్తమా కలిగిస్తాయి.

- *వేర్లుకూడా స్రవిస్తాయా?*

బ్రుగ్‌మన్ అనే వృక్ష శాస్త్రవేత్త తన పరిశీలనల్లో భాగంగా మొక్కలు నేలనుండి కొన్ని ద్రవాలను నీటిని పీల్చుకోవటమే కాకుండా కొన్ని స్రావాలను నేలలోనికి స్రవిస్తుంటాయి అని కనుగొన్నాడు. ఇటువంటి సంఘటనలు ఆపిల్ తోటల్లో చూడవచ్చు. ఒకసారి వేసిన ఆపిల్ తోట నాలుగైదు సంవత్సరాల తర్వాత ఎంత ఎరువువేసినప్పటికీ కూడా ఎక్కువ ఫలసాయం రాదు.

- *ఫలసాయం తగ్గడానికి వేర్ల స్రావాలకు ఏమైనా సంబంధం ఉందా?*

మన ఇంట్లోని కుండీ మొక్కల్ని మార్చేటప్పుడు వేర్ల నుండి ప్రత్యేకమైన వాసనలు వస్తుంటాయి. ఎందుకు?

## విసర్జించడం – స్రవించడం

విసర్జన మరియు స్రావం రెండూ ఒక రకమైనవే. రెండింటిలోను వ్యర్థమైన లేదా అవసరంలేని పదార్థాలను తరలించడం లేదా బయటికి పంపించటం జరుగుతుంది. విసర్జన అనేది జీవులలోని వ్యర్థపదార్థాల తొలగింపు కాగా, స్రావం అనేది ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి వ్యర్థ పదార్థాలను కదిలించడం. అందుకే స్రావం క్రియాత్మకమైనది అనీ విసర్జన క్రియాత్మకం కానిదని అంటారు. ఉదాహరణకు మానవునిలో కన్నీళ్ళు, చెమట, మూత్రం, కార్బన్ డై ఆక్సైడ్ మొదలైనవన్నీ విసర్జితాలు. ఎంజైములు, హార్మోన్‌లు, లాలాజలం అనేవి స్రావాలుగా చెప్పుకుంటాం.

మొక్కలు వ్యర్థాలను వేర్లద్వారా చుట్టూ పరిసరాలలోనికి విసర్జిస్తాయి. అదేవిధంగా ఆకులు, బెరడు, పండ్లు రాల్చడం ద్వారా వ్యర్థాలను తొలగించుకుంటాయి. వివిధ రూపాలలో మొక్కలు స్రావాలను విడుదల చేస్తాయి.

ఉదా – లేటెక్స్, రెజిన్స్, జిగురులు మొదలైనవి.



### కీలక పదాలు

**క్రియాటినిన్, నాళద్రవం, బాహ్యరక్త కేశనాళికలు, పోడోసైట్, రక్తకేశనాళికాగుచ్ఛం, సమీపస్థ సంవళితనాళం, దూరస్థ సంవళితనాళం, అభివాహిధమనిక, అపవాహిధమనిక, కేలిసిస్, మూత్రవిసర్జన, యూరోక్రోం, డయలైజర్, హీమోడయాలసిస్, రక్త స్కందనాన్ని నిరోధించే కారకం, ఆల్కలాయిడ్‌లు, జీవ ఇంధనం, హెన్లీశిక్యం.**



### మనం ఏం నేర్చుకున్నాం?

- శరీరంలో జరిగే వివిధ జీవక్రియల వలన అనేక పదార్థాలు ఏర్పడతాయి. హానికలిగించే పదార్థాలను వేరుచేసి బయటకు పంపడాన్నే విసర్జన అంటారు.
- మానవ విసర్జన వ్యవస్థలో ఒకజత మూత్రపిండాలు, ఒకజత మూత్రనాళాలు, మూత్రాశయం, ప్రసేకం ఉంటాయి.
- ప్రతి మూత్రపిండం సుమారు 1.3–1.8 మిలియన్ల మూత్రనాళికలు (Nephron) కలిగి ఉంటుంది. మూత్రనాళికలు మూత్రపిండాల నిర్మాణాత్మక మరియు క్రియాత్మక ప్రమాణాలు.
- మూత్రనాళికలో భౌమన్ గుళిక, రక్తకేశనాళికాగుచ్ఛం, సమీపస్థ సంవళితనాళం, హెన్లీశిక్యం, దూరస్థ సంవళితనాళం మరియు సంగ్రహణనాళం ఉంటాయి.
- మూత్రం ఏర్పడడంలో నాలుగు దశలున్నాయి. 1. గుచ్ఛగాలనం 2. వరణాత్మక పునఃశోషణం 3. నాళికా స్రావం 4. అతిగాఢత గల మూత్రం ఏర్పడడం.
- మన శరీరం నుండి మూత్రపిండాలు నత్రజని వ్యర్థాలను తీసివేస్తాయి. నీటిసమతాస్థితిని నెలకొల్పుతాయి. లవణాల గాఢత, pH మరియు రక్తపీడనాన్ని క్రమబద్ధీకరిస్తాయి.
- డయాలసిస్ యంత్రం ఒక తాత్కాలిక మూత్రపిండం. ఇది శరీరంలో ఏర్పడిన వ్యర్థాలను తొలగిస్తుంది. రెండు మూత్రపిండాలు పూర్తిగా పనిచేయని వ్యక్తులలో మూత్రపిండాల మార్పిడి చేయాలి.
- వేరువేరు జంతువులలో విసర్జకావయవాలు వేరువేరుగా ఉంటాయి. ఉదా: అమీబా–సంకోచరిక్తిక, ప్లాటీహెల్మంథిస్–

జ్వాలాకణాలు, అనెలిడా-వృక్కాలు, ఆర్థ్రోపోడా-మాల్ఫీజియన్ నాళికలు, సరీసృపాలు, పక్షులు, క్షీరదాలు-మూత్రపిండాలు.

- మొక్కల్లో ప్రత్యేక విసర్జకావయవాలు లేవు. మొక్కలు ఆకుల్లో, బెరడులో, పండ్లలో, విత్తనాలల్లో వ్యర్థాలను నిల్వచేసి, పక్వానికి వచ్చాక మొక్కలనుండి విడిపోతాయి.
- మొక్కల్లో జీవక్రియా ఉత్పన్నాలు రెండు రకాలు. 1. ప్రాథమిక జీవక్రియా ఉత్పన్నాలు. ఉదా: ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వులు, 2. ద్వితీయ జీవక్రియా ఉత్పన్నాలు. ఉదా: ఆల్కలాయిడ్లు, జిగుర్లు, టానిన్లు, లెటెక్స్ మరియు రెసిన్లు. ఇవి ఆర్థికంగా ప్రాముఖ్యత కలిగి ఉంటాయి.
- జీవులనుండి వ్యర్థాలను తొలగించడాన్ని, విసర్జన అని, పదార్థాలు ఒకప్రదేశం నుండి మరొక ప్రదేశానికి కదలటాన్ని స్రావం (Secretion) అనిఅంటారు.



## అభ్యసనాన్నిమెరుగుపరచుకుందాం

1. విసర్జన అనగానేమి? మూత్రం ఏర్పడే విధానాన్ని తెల్పండి. (AS1)
2. అమీబాలో విసర్జన ఎలా జరుగుతుంది?(AS1)
3. మానవులలో వివిధ విసర్జకావయవాలు ఏవి? అవి విసర్జించే పదార్థాలు ఏవి?(AS1)
4. దీపక్ "నెఫ్రాన్‌లు, మూత్రపిండాల నిర్మాణాత్మక, క్రియాత్మక ప్రమాణాలు" అని చెప్పాడు. అతన్ని నీవెలా సమర్థిస్తావు?(AS1)
5. మొక్కలు వ్యర్థాలను ఏవిధంగా సర్దుబాటు చేసుకుంటాయి?(AS1)
6. కొందరు వ్యక్తులు డయాలసిస్ ఎందుకు చేయించుకుంటారు? దానిలో ఇమిడి ఉన్న సూత్రం ఏమిటి?(AS1)
7. ద్రవాభిసరణం అనగానేమి? మనశరీరంలో సమతుల్యత ఎలా సాధించబడుతుంది?(AS1)
8. రక్తప్రసరణ, విసర్జక వ్యవస్థలకు ఏమైనా సంబంధం ఉందా? ఉంటే ఏమిటి?(AS1)
9. కారణాలు తెలపండి.(AS1)
   (ఎ) వాసోప్రెసిన్ ఎల్లప్పుడు స్రవించదు.
   (బి) మూత్రం మొదట ఆమ్లయుతంగా ఉండి తరువాత క్షారయుతంగా మారుతుంది.
   (సి) అభివాహిధమని వ్యాసం కంటే అపవాహిధమని వ్యాసం తక్కువగా ఉంటుంది.
   (డి) వేసవిలో మూత్రం చలికాలంకంటే చిక్కగా ఉంటుంది.
10. భేదాలు రాయండి.(AS1)
   (ఎ) సమీపస్థ సంవళితనాళం, దూరస్థ సంవళితనాళం విధులు
   (బి) మూత్రపిండాలు మరియు కృత్రిమ మూత్రపిండాలు
   (సి) విసర్జన మరియు స్రావం
   (డి) ప్రాథమిక మరియు ద్వితీయ జీవక్రియా ఉత్పన్నాలు
11. మానవ శరీరంలో ఒకజత చిక్కుడు గింజ ఆకారంలో ఉండే 'P' అనే అవయవాలు వెన్నెముకకు ఇరువైపులా పృష్ఠశరీర కుడ్యానికి అంటిపెట్టుకుని ఉంటాయి. ఉపయోగపడని ప్రోటీన్లు విచ్ఛిన్నం కావడంవల్ల ఏర్పడే వ్యర్థం 'Q' రక్తం ద్వారా 'R' అనే ధమని ద్వారా 'P' అనే అవయవానికి చేరుతుంది. 'P' లో అసంఖ్యాకంగా ఉండే 'S' అనే వడపోసే నాళికలు రక్తాన్ని వడపోసి మిగిలిన రక్తాన్ని సిర 'T' ద్వారా ప్రసరణ వ్యవస్థలోకి పంపబడుతుంది. వ్యర్థపదార్థాలు 'Q' మరియు ఇతర లవణాలు అధికంగా ఉన్న నీటితో కలిసి పసుపు వర్ణంలో 'U' అనే ద్రవం ఏర్పడుతుంది. ఇది 'P' నుండి సంచిలాంటి నిర్మాణంలో 'V' లోనికి 'W' అనే నాళాల ద్వారా వెళుతుంది. తరువాత

ఈ ద్రవం 'X' అనే ద్వారం ద్వారా బయటకు పోతుంది.(AS1)

(ఎ) అవయవం 'P' ఏమిటి? (బి) వ్యర్థం 'Q' ఏమిటి? (సి) ధమని 'R' పేరేమిటి?

(డి) సిర అనే 'T' పేరేమిటి? (ఇ) వడపోసే సూక్ష్మనాళిక 'S' ను ఏమంటారు?

(ఎఫ్) ద్రవం 'U' పేరేమిటి? (జి) 'V' నిర్మాణాల పేరేమిటి?

(హెచ్) 'W' నాళాల పేరేమిటి? (ఐ) ద్వారం 'X' పేరేమిటి?

12. 'B' అనే విషపూరిత వ్యర్థాలు రక్తంలో చేరికవల్ల రక్తం మలినంగా మారి వ్యక్తి శరీరంలోని అవయవం 'A' చెడిపోయింది. ఆ వ్యక్తి ప్రాణం రక్షించడానికి అతని చేతిలోని ధమని ద్వారా రక్తాన్ని మెలికలు తిరిగిన గొట్టాల ద్వారా పంపించారు. ఈ గొట్టాలు 'E' అనే పదార్థంతో చేయబడ్డాయి. వీటిని ద్రావణం 'F' కలిగిన ట్యాంక్‌లో ఉంచబడ్డాయి. ఈ ద్రావణంలో 'G, H' మరియు 'I' రక్తంతో సమాన నిర్మాణం కలిగిన ఈ మూడు పదార్థాలు ఉన్నాయి. గొట్టాల గుండా రక్తం ప్రవహిస్తున్నపుడు రక్తంలోని వ్యర్థాలు ద్రావణం 'F' లోకి చేరాయి. శుభ్రమైన రక్తం తిరిగి సిర ద్వారా వ్యక్తి రక్తప్రసరణ వ్యవస్థలోకి చేరింది.(AS1)

(ఎ) అవయవం 'A' ఏమిటి? (బి) వ్యర్థపదార్థం 'B' ఏమిటి?

(సి) పదార్థం 'E, ద్రావణం F' ల పేర్లేమిటి? (డి) ద్రావణంలోని 'G', 'H' మరియు 'I' ఏమిటి?

(ఇ) పైన పేర్కొనబడిన విధానం ఏమిటి?

13. ఎప్పటికప్పుడు శరీరంలోని వ్యర్థాలు బయటికి పంపకపోతే ఏమౌతుందో ఊహించండి.(AS2)

14. మీ మూత్రపిండాలు ఎక్కువకాలం ఆరోగ్యంగా ఉంచుకొనుటకు యూరాలజిస్టుని/నెఫ్రాలజిస్టుని ఎటువంటి ప్రశ్నలు అడుగుతావు?(AS2)

15. మీ పరిసరాలలో జిగురునిచ్చే మొక్కలేవి? జిగురుని మొక్కల నుండి సేకరించడానికి ఎటువంటి విధానం అనుసరిస్తావు?(AS3)

16. వివిధ రకాల మొక్కలనుండి లభించే ఆల్కలాయిడ్లకు సంబంధించిన సమాచారాన్ని అంతర్జాలం లేదా గ్రంథాలయం నుండి సేకరించి, నివేదిక తయారుచేయండి. (AS4)

17. మూత్రపిండం నిలువుకోత పటం గీసి, భాగాలు గుర్తించండి.(AS5)

18. వృక్కనాళిక (Nephron) నిర్మాణాన్ని పటం సహాయంతో వివరించండి.(AS5)

19. మానవ విసర్జక వ్యవస్థలో విసర్జన జరిగే మార్గాన్ని బ్లాక్ డయాగ్రమ్ (Block diagram) ద్వారా చూపండి.(AS5)

20. మూత్రపిండంలో విసర్జన జరిగే విధానాన్ని వివరించే పటాన్ని గీయండి.(AS5)

21. మానవుని విసర్జక వ్యవస్థలో అద్భుతంగా భావించిన అంశాలను రాయండి.(AS6)

22. ఈ పాఠంలో 'బ్రెయిన్ డెడ్' వ్యక్తుల గురించి చదివావు కదా! నీవు ఏరకమైన చర్చను చేపడతావు? ఎందుకు?(AS6)

23. అవయవదానం గురించి మనకు అతితక్కువ అవగాహన ఉంది. ప్రజల్లో అవయవదానం పట్ల అవగాహన పెంచడానికి కొన్ని నినాదాలు రాయండి.(AS7)

24. ఈ పాఠం చదివిన తరువాత మూత్రపిండాలు సక్రమంగా పనిచేయడానికి నీవు నీ ఆహారపు అలవాట్లలో ఎటువంటి మార్పులు చేయాలనుకుంటున్నావు?(AS7)

## కింది ఖాళీలను పూరించండి

1. వానపాములోని విసర్జక అవయవాలు ____________________.
2. మూత్రపిండం అడ్డుకోతలోని ముదురు గోధుమవర్ణపు భాగాన్ని ____________________ అంటారు.
3. జీవుల్లోని నీటి ప్రమాణం, అయాన్ల గాఢతను క్రమబద్ధీకరించడాన్ని ________________ అంటారు.
4. నెఫ్రాన్‌లో ఉపయోగకరమైన పదార్థాల పునఃశోషణం ______________________ జరుగుతుంది.

5. జిగురులు మరియు రెజిన్లు మొక్కల యొక్క _______________________ పదార్థాలు.
6. భౌమన్ గుళిక మరియు రక్తకేశనాళికాగుచ్ఛాన్ని కలిపి _______________________ అంటారు.
7. మలేరియా నివారణకు ఉపయోగించే ఆల్కలాయిడ్ _______________________.
8. డయాలసిస్‌లో ఇమిడి ఉన్న సూత్రం _______________________.
9. రబ్బరును హీవియా బ్రెజీలియన్సిస్ మొక్క యొక్క _______________________ నుండి తయారుచేస్తారు.
10. మొట్టమొదట మూత్రపిండ మార్పిడి చేసిన వైద్యుడు _______________________.

## సరైన సమాధానాన్ని గుర్తించండి

11. మానవుని మూత్రపిండంలోని నిర్మాణాత్మక, క్రియాత్మక ప్రమాణం ( )
(ఎ) న్యూరాన్ (బి) నెఫ్రాన్ (సి) నెఫ్రీడియా (డి) జ్వాలాకణం
12. బొద్దింకలో విసర్జకావయవాలు ( )
(ఎ) మాల్ఫీజియన్ నాళికలు (బి) రాఫైడ్స్ (సి) మూత్ర నాళాలు (డి) జ్వాలాకణం
13. మానవ శరీరంలో మూత్రం ప్రయాణించే మార్గం ( )
(ఎ) మూత్ర పిండము, ప్రసేకం, మూత్ర నాళాలు, మూత్రాశయం
(బి) మూత్ర పిండం, మూత్ర నాళాలు, మూత్రాశయం, ప్రసేకం
(సి) మూత్ర పిండం, మూత్రాశయం, మూత్ర నాళాలు, ప్రసేకం
(డి) మూత్ర పిండం, ప్రసేకం, మూత్రాశయం, మూత్ర నాళాలు
14. మాల్ఫీజియన్ నాళికలు ఏ జీవిలో విసర్జకావయవాలు ( )
(ఎ)వానపాము (బి) ఈగ (సి) బద్దెపురుగు (డి) కోడి
15. మానవ మూత్రంలోని ప్రధాన వ్యర్థం ఏది? ( )
(ఎ) యూరియా (బి) సోడియం (సి) నీరు (డి) క్రియాటినిన్
16. ఏజీవిలో ప్రత్యేక విసర్జకావయవాలు ఉండవు. ( )
(ఎ) పక్షులు (బి) అమీబా (సి) స్పంజికలు (డి) ఎ మరియు బి
17. ఈ కింది వానిలో ఏ హార్మోన్ మూత్రవిసర్జనతో ప్రత్యక్ష సంబంధం ఉంది. ( )
(ఎ) ఎడ్రినలిన్ (బి) వాసోప్రెసిన్ (సి) టెస్టోస్టిరాన్ (డి) ఈస్ట్రోజన్
18. మూత్రం పసుపురంగులో ఉండుటకు కారణం ఏమిటి? ( )
(ఎ) యూరోక్రోం (బి) బైలిరూబిన్ (సి) బైలివర్డిన్ (డి) క్లోరైడ్స్
19. మూత్రం ఏర్పడే దశల క్రమం ( )
(ఎ) గుచ్ఛగాలనం → వరణాత్మక పునఃశోషణం → నాళికాస్రావం
(బి) వరణాత్మక పునఃశోషణం → నాళికాస్రావం → గుచ్ఛగాలనం
(సి) నాళికాస్రావం → గుచ్ఛగాలనం → వరణాత్మక పునఃశోషణం
(డి) వరణాత్మక పునఃశోషణం → అతి గాఢత గల మూత్రం ఏర్పడడం → నాళికాస్రావం
20. మూత్ర పిండం బాహ్యప్రాంతంలో ఉండే నెఫ్రాన్ భాగం ( )
(ఎ) హెన్లీశిక్యం (బి) సమీపస్థ సంవళితనాళం (సి) దూరస్థ సంవళితనాళం (డి) భౌమన్ గుళిక
21. ఆహారం తిన్నతరువాత మూత్రవిసర్జన చేయాలన్న భావన ఎందుకు కలుగుతుంది? ( )
(ఎ) మూత్రాశయంపై జీర్ణాశయ పీడనం (బి) ఘనపదార్థాలు ద్రవపదార్థాలుగా మారడం
(సి) ఆహారంలోని నీటిపరిమాణం (డి) స్ఫింక్టర్ కండరాల కదలిక

- లైంగిక వ్యాధులు వ్యాప్తి చెందే విధానాలు మరియు వాటి గురించిన యదార్థాలను ప్రతి ఒక్కరు తెలుసుకోవాల్సిన ఆవశ్యకత కలదు.
- ఎయిడ్స్ వ్యాధికి చికిత్స లేదు. కావున ఎయిడ్స్ రాకుండా నైతిక జీవనం గడపడం సరైన మార్గం.
- ప్రస్తుతం కుటుంబ నియంత్రణకు అనేక గర్భనిరోధక మార్గాలు అందుబాటులో ఉన్నాయి.
- ఆరోగ్యవంతమైన సమాజ నిర్మాణం మనలో ప్రతి ఒక్కరి బాధ్యత.
- శిశు జననం కన్నా ముందుగానే లింగనిర్ధారణ పరీక్ష చేయడం చట్టరీత్యా నేరం. భ్రూణహత్యలను ఆపడం అవసరం.



## అభ్యసనాన్ని మెరుగుపరచుకుందాం

1. చేప మరియు కప్పలాంటి జీవులు ప్రతిసారీ అసంఖ్యాకమైన అండాలను విడుదల చేయడానికి గల కారణాలేమిటి?(AS1)
2. బాహ్య ఫలదీకరణం అంటే ఏమిటో వివరించండి. ఉదాహరణలు రాయండి.(AS1)
3. కిందివానిలో మధ్యగల భేదాలను రాయండి.(AS1)
   ఎ) కేశరావళి – అండకోశం   బి) సమ విభజన – క్షయకరణ విభజన
4. మొక్కల్లోని ఫలదీకరణ ప్రక్రియను గురించి వివరించండి.(AS1)
5. అలైంగిక ప్రత్యుత్పత్తి విధానాలను గురించి తగిన ఉదాహరణలతో వివరించండి.(AS1)
6. లైంగిక ప్రత్యుత్పత్తి ఏవిధంగా అలైంగిక ప్రత్యుత్పత్తితో విభేదిస్తుంది? మూడు కారణాలు తెల్పండి.(AS1)
7. శుక్రకణాలు వాని విధులు నిర్వర్తించడానికై ఏవిధమైన అనుకూలనాలను పొంది ఉన్నాయి?(AS1)
8. ఫలదీకరణ చెందిన అండాన్ని గర్భాశయంలో నిలుపుకోవడం కోసం ఋతుస్రావచక్రం పనిచేస్తూ మరియు పునరావృతమవుతూ ఉంటుంది. సాధారణంగా ఋతుచక్రం మొదలై, పూర్తవుటకు ఎంత సమయం తీసుకుంటుంది?(AS1)
9. గర్భాశయంలో పెరుగుతున్న పిండానికి పోషణ అవసరం. పిండానికి పోషకాలు ఎలా అందించబడతాయి?(AS1)
10. గర్భస్థ శిశువు ఏయే పదార్థాలను తల్లి రక్తం నుండి గ్రహిస్తుంది?(AS1)
11. గర్భాశయంలోని ఉమ్మనీటి కోశం (amniotic sac) యొక్క విధి ఏమిటి?(AS1)
12. లైంగిక ప్రత్యుత్పత్తి యొక్క లాభాలేమిటి?(AS1)
13. జీవజాతుల యొక్క జనాభాలో నిలకడ/ శాశ్వతంగా నిలుచుటకోసమై ప్రత్యుత్పత్తి ఎలా సహకరిస్తుంది?(AS1)
14. సమవిభజన మరియు క్షయకరణ విభజనల మధ్య భేదాలను రాయండి.(AS1)
15. ఋతుస్రావ సమయంలో గర్భాశయ గోడల్లో జరిగే మార్పులేమిటి?(AS1)
16. 'ఏకకణ జీవులన్నీ అనుకూల పరిస్థితులలో సమవిభజన చెందుతాయి'
    పై వ్యాఖ్యను సమర్థిస్తారా?(AS2)
17. విక్కీ వాళ్ళ నాన్న – రంగురంగుల పూలు మరియు పెద్దవైన ఫలాలు గల ఒక మొక్కను పెంచాలనుకున్నాడు. మీరు అతనికి సూచించే పద్ధతి ఏమిటి? ఎందుకు?(AS3)
18. ఉల్లి మొక్కనొకదాన్ని వేర్లతో సహా పెకిలించి, వేరు కొన అడ్డు ఛేదనాలను తీసుకోండి. వాటిని ఏదేని రంగుతో రంజనం చేసి సూక్ష్మదర్శినిని కింద పరిశీలించండి. కణవిభజన దశల బొమ్మలను గీసి, అవి ఏ దశకు చెందినవో గుర్తించండి.(AS3)
19. మీకు దగ్గరలోని గ్రామాన్ని సందర్శించి, అక్కడి రైతులు చెరకు, చామంతి, మొదలైన పూలమొక్కలు, బంగాళదుంపలు, దొండకాయలు మొదలైన కూరగాయలు మొదలైన వాటిని ఎలా పండిస్తున్నారో అడిగి తెలుసుకోండి. మీరు సేకరించిన సమాచారంతో తగిన నివేదిక తయారుచేసి, తరగతిలో ప్రదర్శించండి.(AS4)

20. ఆర్థిక ప్రాముఖ్యత గల మొక్కల పెంపకాన్ని మీ జిల్లా మరియు రాష్ట్రాలలో ఏవిధంగా చేపడుతున్నారో తగిన సమాచారాన్ని మీ పాఠశాల గ్రంథాలయం మరియు ఇంటర్నెట్‌ల నుండి సేకరించండి. దాని ఆధారంగా ఒక నివేదిక (గ్రాఫ్) తయారుచేయండి.(AS3)
21. సమవిభజనలోని వివిధ దశలతో కూడిన కణచక్రం గురించి ఒక ఫ్లోచార్టును తయారుచేయండి.(AS5)
22. పురుష మరియు స్త్రీ ప్రత్యుత్పత్తి వ్యవస్థల చిత్రాలను గీసి పేర్లు రాయండి.(AS5)
23. ప్రక్క పటంలో చూపిన మొక్క భాగం ఏమిటో గుర్తించండి. దానిపై వ్యాఖ్య రాయండి.(AS5)




24. మొక్కలలో జరిగే లైంగిక ప్రత్యుత్పత్తిని ఫ్లోచార్టు రూపంలో తెలియజేయండి.(AS5)
25. మొక్కలలో ఫలదీకరణను వివరించడానికి చక్కని చిత్రాన్ని గీసి పేర్లు రాయండి. పరాగరేణువు గురించి కొన్ని అంశాలను రాయండి.(AS5)
26. ఒకవేళ జీవులలో క్షయకరణ విభజన జరగలేదనుకోండి. వాని ఫలితాలు ఏవిధంగా ఉంటాయి?(AS6)
27. జీవం శాశ్వతత్వానికి తోడ్పడుతున్న కణవిభజనను నీవు ఏవిధంగా అభినందిస్తావు?(AS6)
28. లైంగిక వ్యాధులు వ్యాపించకుండా తీసుకోవాల్సిన జాగ్రత్తలను గురించి మీ అభిప్రాయాలను రాయండి.(AS7)
29. బాల్య వివాహాలు, భ్రూణ హత్యలపై సెమినార్ నిర్వహించండి.

## సరైన సమాధానాన్ని గుర్తించండి

1. అండాలను ఉత్పత్తి చేసే స్త్రీ ప్రత్యుత్పత్తి వ్యవస్థలోని భాగమేది? ( )
ఎ) స్త్రీ బీజకోశం బి) ఎపిడిడిమిస్ సి) గర్భాశయ ముఖద్వారం డి) ఫాలోపియన్ నాళం
2. శుక్రకణం-అండంతో కలిసే ప్రక్రియను ఏమంటారు? ( )
ఎ) ముక్కలవడం బి) కిణ్వనం సి) ఫలదీకరణం డి) సంలీనం
3. పురుష ప్రత్యుత్పత్తి వ్యవస్థలోని ఏ భాగం శుక్రకణాలను ఉత్పత్తి చేస్తుంది? ( )
ఎ) వాస్ డిఫరెన్స్ బి) ఎపిడెడిమిస్ సి) శుక్రోత్పాదక నాళికలు డి) స్క్రోటమ్
4. శుక్రకణం, అండం యొక్క పొరలను ఎలా ఛేదిస్తుంది? కిందివానిలో సరైనదానిని ఎన్నుకోండి. ( )
ఎ) అండ కవచంలోని రంధ్రాన్ని చీల్చడం ద్వారా బి) అండ కవచాన్ని రసాయనాలతో కరిగించడం ద్వారా
సి) అండ కవచాన్ని కొరకడం ద్వారా డి) అండకవచంలోని ఖాళీలను నొక్కడం ద్వారా
5. అండం, శుక్రకణాలకన్నా పెద్దదిగా ఉంటుంది. ఎందుకు? సరైనదానిని ఎన్నుకోండి. ( )
ఎ) అండం ఎక్కువ కణాలకు కలిగి ఉంటుంది
బి) ఫలదీకరణ అనంతరం పెరుగుదలకు కావల్సిన పోషక పదార్థాలను కలిగి ఉంటుంది.
సి) మందమైన కణకవచాలను కలిగి ఉంటుంది డి) పెద్ద కేంద్రకాన్ని కలిగి ఉంటుంది.
6. కిందివానిలో గర్భస్థ శిశువు పెరుగుదలపై ప్రభావాన్ని చూపునవేవి? సరైనదానిని ఎన్నుకోండి. ( )
ఎ) సిగరెట్ పొగలోని రసాయనాలు బి) ఆల్కహాల్ సి) మందులు డి) పైవన్నీ
7. మానవ జీవిత చక్రంలోని దశలను సూచించుటకు కిందివానిలో ఏది సరైనది? ( )
ఎ) శిశుదశ - బాల్యదశ - కౌమారదశ - వయోజనదశ
బి) బాల్యదశ - శిశుదశ - వయోజనదశ - కౌమారదశ
సి) కౌమారదశ - శిశుదశ - వయోజనదశ - బాల్యదశ డి) పైవేవీ కావు



## అనుబంధం


డా. పోటు నర్సింహారావు

డాక్టర్ పోటు నరసింహారావు మన దేశం గర్వించదగిన ప్రముఖ కణశాస్త్రవేత్త. ఈయన మన రాష్ట్రంలోని గుంటూరు జిల్లాలోని ముప్పాళ్ళ గ్రామంలో నిరుపేద కుటుంబంలో జన్మించారు. ఆయనకు వ్యవసాయం అంటే ఎంతో మక్కువ. ఆయన న్యూఢిల్లీ లోని ఐ.ఎ.ఆర్.ఐ నుండి వ్యవసాయంలో యం.యస్ పట్టా పొందారు. తరువాత పరిశోధనల కోసం అమెరికా వెళ్ళారు. అక్కడ పొగాకు మొక్కలపై కణజీవశాస్త్రంలో ప్రయోగాలు చేశారు. తన ప్రయోగాలలో భాగంగా 1952 సం॥లో మానవ శరీరంలో ఏర్పడిన కణితి నుండి 'హీలా కణాల శ్రేణిని' వేరుచేశాడు. 1963 సం॥లో తన పరిశోధనలలో పి.హెచ్.డి పొందాడు. తరువాత తన పరిశోధనలను సైటోజనిటిక్స్ నుండి కాన్సర్ కణాలపై ప్రయోగాల వైపుకు మళ్ళించాడు. ఆయన కణ కదలికల (Cell kinematics) పై విస్తృతమైన ప్రయోగాలు చేశాడు. అతడు సమవిభజనకు కారణమయ్యే కారకాన్ని (Triggering factor) గుర్తించడంలో కృషి చేశాడు.


హీలా కణం

మానవ కణం అది సాధారణకణమైనా లేదా కాన్సర్ కణమైనా పెరుగుదల మాధ్యమంలో ఉంచినప్పుడు 20 నుండి 24 గంటలలోపున విభజన చెందుతుందని గుర్తించాడు. నిజానికి సమవిభజన 40 నుండి 60 నిమిషాల్లో పూర్తవుతుంది. రెండు కణవిభజనల మధ్యగల విరామాన్ని అంతర్దశ (Interface) అంటారు. దీనిలో జి1, యస్, జి2 అనే ప్రావస్థలుంటాయి.

కణచక్రంలోని వివిధ దశలను తెలుసుకోడానికి పోటు నరసింహారావు మరియు జాన్సన్‌లు కణ సంలీన ప్రక్రియలను ఉపయోగించి రెండు కణ విభజనల మధ్యగల విరామాన్ని, అంతర్దశా ప్రావస్థలను పరిశీలించారు. కణచక్రంలో జరిగే ఈ కణవిభజనలు రసాయన శ్రేణీ సంకేతాల ఆధీనంలో క్రమానుగతంగా, ఒకే దిశలో జరుగుతాయని గుర్తించారు. ఆయన పరిశోధనలు కణవిభజనలపై పరిశోధనలు జరుపుతున్న ఎందరో శాస్త్రవేత్తలకు దిక్సూచిలా నిలిచాయి. మన తెలుగువాడైన ఈ శాస్త్రవేత్తతో మాట్లాడాలనుకుంటే poturao@yahoo.com మెయిల్ ఐడిలో లాగిన్ అవ్వండి.

**మీ హిందీ పుస్తకంలో ఉన్న " మా ముఝే ఆనే దో" గేయం చదవండి.**

**దాని గురించి మీ తరగతిలో చర్చించండి.**

**రాష్ట్రీయ కిశోర్ స్వాస్త్య కార్యక్రమం (RKSK)కు సంబంధించిన సమాచారాన్ని సేకరించండి.**



పాఠం

7

# జీవక్రియలలో సమన్వయం

మానవ శరీరం ఓ అద్భుత యంత్రం. చూడటానికి ఎంతో సాధారణంగా కనిపించినా ఎంతో సంక్లిష్ట నిర్మాణాన్ని కలిగి ఉంటుంది. మీ శరీరంలో ఉండే అద్భుతమైన సంక్లిష్టతను మీరు ఎప్పుడైనా ఊహించారా? జీవులలోని వివిధ జీవక్రియలైన శ్వాసక్రియ, జీర్ణక్రియ, రక్తప్రసరణ, విసర్జన, నాడీ వ్యవస్థను నిర్వహించే అవయవాలు శరీరంలోని నిర్దిష్ట ప్రదేశాలలో అమరి ఉండి వాటికి నిర్దేశించిన పనులను నిర్వహిస్తాయి. ఇంతవరకు మనం శరీరంలో జరిగే వివిధ జీవక్రియల గురించి విడివిడిగా చదువుకున్నాం. నియంత్రణ-సమన్వయం అధ్యాయంలో మాత్రం శరీరంలో జరిగే కొన్ని క్రియలు ఎలా నియంత్రిత పద్ధతుల్లో సమన్వయం చేసుకుంటూ జరుగుతాయో నేర్చుకున్నాం. మనం అర్థం చేసుకోడానికి వీలుగా ఈ జీవక్రియలను విడివిడిగా పరిశీలిస్తామే తప్ప ఏ జీవక్రియ కూడా ఇతర క్రియలతో సంబంధం లేకుండా ఒంటరిగా పనిచేయలేదు. ఒకదానితో ఒకటి అనేక రకాలుగా సంబంధాలను ఏర్పరుచుకుని సమన్వయంతో పనిచేస్తాయి. ఈ అధ్యాయంలో జీవక్రియలలో జీర్ణక్రియను ఉదాహరణగా తీసుకొని వివిధ వ్యవస్థల మధ్య సంబంధాలు ఎంత సంక్లిష్టంగా ఉంటాయో మరియు శరీరంలో ఈ జీవక్రియలు అత్యంత అద్భుతంగా ఎలా సమన్వయం చేసుకుంటాయో తెలుసుకుందాం. జీర్ణక్రియలో పాలుపంచుకునే ఆహారనాళంలోని భాగాలను, ఆహార నాళంలో వివిధ దశలలో ఆహారం ఎలా జీర్ణం అవుతుందనే విషయాలను ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకుందాం.

- *నోరు నుండి పాయువు వరకు వ్యాపించి ఉన్న ఆహారనాళంలో ఆహారం ఏ ఏ భాగాల గుండా ప్రయాణిస్తుందో రాయండి.*
- *జీర్ణాశయంలో ఆహారాన్ని విచ్ఛిన్నం చేయడంలో ఏ జీవక్రియ తోడ్పడుతుంది?*
- *జీవక్రియలలోని ఏ ఒక్క జీవక్రియ అయినా పనిచేయడంలో విఫలమైతే మన శరీరంపై ఎలాంటి ప్రభావం చూపుతుంది?*

శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచడంలో జీవక్రియలన్నీ ఒకదానిపై మరొకటి పరస్పరం ఆధారపడి ఉంటాయి.

ఈ భావాన్ని అర్థం చేసుకోవడానికి జీర్ణక్రియను ఉదాహరణగా తీసుకొని ఇది వివిధ వ్యవస్థలతో ఎలా సమన్వయం కలిగి ఉంటుందో విశ్లేషిద్దాం. జీర్ణవ్యవస్థలో ఆకలివేయడం మొదలుకొని ఆహార వినియోగం (శక్తిగా మారడం) వరకు శరీరంలో జరిగే క్రియల అనుసంధానాన్ని వివరంగా నేర్చుకుందాం.

## ఆకలి వేయడం

- *మనకు ఆహారం అవసరం అని ఎలా తెలుస్తుంది?*

### కృత్యం-1

కింది పట్టికను పరిశీలించండి. మీ దృష్టిలో ఆకలి వేయడానికి గల కారణాలను (✓) తో గుర్తించండి. మీ స్నేహితులతో చర్చించండి.

**పట్టిక-1**

| వాసన | రుచి | దృశ్యం | అలసట నీరసం | ఆహార అవసరం | ఆహార ఆలోచన |
|---|---|---|---|---|---|
| | | | | | |
| | | | | | |

- *ఏ ఏ కారకాలు ఆకలిని ఉత్తేజపరుస్తాయి?*
- *ఆకలవుతోందని తెలిసేలా చేసే ఉద్దీపనల వలన ఫలితమేమిటి?*
- *మనకు ఆకలి కలుగుతోందని తెలియజేయడానికి ఏ వ్యవస్థ సంకేతాలను పంపుతుంది?*

ఆకలి వేస్తోందని తెలియడానికి ఒక ప్రధాన కారణం రక్తప్రసరణ వ్యవస్థలో దాగిఉంది. రక్తంలో అనేక రకాల పదార్థాలు ఎంతెంత స్థాయిల్లో ఉండాలనేది జీర్ణవ్యవస్థపై ఆధారపడి ఉంటుంది. వాటిలో గ్లూకోజ్ ప్రధానమైనది. రక్తంలో గ్లూకోజ్ స్థాయిలు తగ్గిపోతే వెంటనే మనకు ఆకలి వేస్తున్నట్లుగా అనిపిస్తుంది. అలాగే జీర్ణాశయం ఖాళీ అయినప్పుడు అందులో స్రవించబడే ప్రోటీన్ శ్రేణులతో కూడిన 'గ్రీలిన్' అనే హార్మోన్ స్రవిస్తుంది. జీర్ణాశయ గోడల్లోని కొన్ని కణాలు 'గ్రీలిన్' (Ghrelin) ను స్రవిస్తాయి. జీర్ణకోశంలో ఈ హార్మోన్ స్రవించడం వల్ల ఆకలి సంకేతాలు ఉత్పత్తి అవుతాయి. జీర్ణకోశం నుండి మెదడుకు ఆకలి సంకేతాలు చేరగానే ఆకలి కోరికలు జీర్ణాశయంలో మొదలవుతాయి. ముందు మెదడులోని (ద్వారగోర్థం) మరియు వేగస్ నాడి (10వ కపాలనాడి) ఈ సంకేతాలను చేరవేయడంలో కీలకపాత్ర పోషిస్తాయి. 'ఆకలి కోరికలు' దాదాపు 30-45నిమిషాల వరకు కొనసాగుతాయి. గ్రీలిన్ స్థాయి పెరిగినపుడు ఆకలి ప్రచోదనాలతోపాటూ ఆహారం తినాలనే ఉద్దీపన భావన కలుగుతుంది.

- *కేంద్ర లేదా పరిధీయ నాడీ వ్యవస్థలలో ఏ భాగాలు ఆకలి ప్రచోదనాలను నియంత్రిస్తాయి?*
- *ఎలాంటి నియంత్రణలు ఆకలి ప్రచోదనాలపై ప్రభావం చూపుతాయి? అవి హార్మోన్ల సంబంధమైనవా లేదా నాడీ సంబంధమైనవా లేదా రెండూనా?*

- *ఆకలి ప్రచోదనాలను ఉత్పత్తి చేసే క్రియలో పాలుపంచుకొనే ఏవైనా నాలుగు వ్యవస్థలను సూచించండి?*

మనకు కడుపు నిండుగా ఉండి, ఇంక ఎలాంటి ఆహారం అవసరం లేదు అనిపించినపుడు 'లెప్టిన్' (leptin) అనే మరో హార్మోన్ స్రవించబడి ఆకలిని అణచివేస్తుంది.

సాధారణంగా ప్రతిరోజూ మనం ఒక నిర్దిష్టమైన వేళలోనే ఆహారం తీసుకుంటాం. ప్రతిరోజు ఆ సమయానికే మనకు ఆకలవుతుంది. ఇలాంటి పరిస్థితి పాఠశాల భోజన విరామానికి ముందు పీరియడ్‌లో మీరు అనుభవించే ఉంటారు. ఆకలి కోరికలకు మరియు లంచ్ బెల్ మధ్య సంబంధాన్ని మీరు గుర్తించే ఉంటారు కదూ!

## ఆకలి ప్రచోదనాల ప్రభావం

నోటిలో జరిగే జీర్ణక్రియలో వివిధ అవయవ వ్యవస్థలు పాల్గొంటాయి. ఈ అవయవాలు మరియు అవయవ వ్యవస్థలు పాలుపంచుకునే విధానం, నిర్వహించే పనులు మొదలైన విషయాల గురించి తెలుసుకుందాం.

ఆకలి వేసినట్లనిపించే భావన మనల్ని ఆహారం తీసుకునేందుకు ప్రేరేపిస్తుంది. అయితే ఆకలిగా ఉన్నప్పటికీ ఆహారం పాడైపోయినట్లుగా ఉంటే నోటిలోకి తీసుకోక ముందే దానిని తినవద్దనుకుంటాం. ఇలాంటి అనుభవాలను మీరు ఇదివరకే పొంది ఉంటారు కదూ!

- చెడిపోయిన ఆహారాన్ని గుర్తించడంలో ప్రధానపాత్ర పోషించే భాగమేది?
- రుచికరమైన భోజనం చేస్తున్నప్పుడు అందులోని సువాసన ఆకలిని పెంచుతుందని భావిస్తున్నారా?

## రుచి మరియు వాసన పరస్పర సంబంధం

రుచి, వాసన రెండూ ఒకదాని నుండి మరొకటి వేరుచేయలేనంతగా పెనవేసుకుని ఉంటాయి. ఈ అవినాభావ సంబంధం ద్వారానే వివిధ ఆహార పదార్థాల రుచులు ఎలా ఉంటాయో వాసనల ద్వారా పసిగట్టగలుగుతున్నాం. అయితే తీవ్రమైన జలుబు, దగ్గుతో బాధపడుతున్నప్పుడు మన ఘ్రాణేంద్రియం సరిగా పనిచేయదు. అపుడు వివిధ ఆహార పదార్థాల రుచులను సరిగా గుర్తించలేము.

వాస్తవానికి ఆహారం యొక్క రుచిలో ఎలాంటి మార్పు ఉండదు. కానీ ఆహారం యొక్క వాసన గుర్తించడం జలుబు వల్ల ప్రభావితమవుతుంది. అంటే వాసన, రుచి రెండూ గ్రహించగలిగితేనే ఆహారపు రుచిని గుర్తించగలుగుతామన్నమాట.

రుచులను తెలుసుకోవడం అంటే ఆహారపదార్థంలోని రసాయన భేదాలను బట్టి అది తియ్యగా, ఉప్పగా, చేదుగా, పుల్లగా లేదా ఉమామి (జపనీయుల వంటకపురుచి) రుచులుగా గుర్తిస్తాం. రుచి మరియు వాసనలను గుర్తించే జ్ఞానేంద్రియాల పరస్పర చర్యల వల్లనే మనం తీసుకొనే ఆహారంపట్ల మన దృక్పథం ప్రభావితమవుతుంది.

కింది కృత్యం ద్వారా రుచి ఘ్రాణేంద్రియం ద్వారా ఎలా ప్రభావితం అవుతుందో తెలుసుకుందాం.

## కృత్యం-2

### జీలకర్ర, సోంపు, ఆలుగడ్డ మరియు ఆపిల్‌ను నమలడం

ముందుగా వేళ్ళతో ముక్కు మూసుకోండి కొంచెం జీలకర్రను నోటిలో వేసుకొని కాసేపు నమలండి. తరవాత కొన్ని సోంపు గింజలు నమలండి. వాటి రుచిని గుర్తించగలిగారా? రుచిని గుర్తించడానికి ఎంత సమయం తీసుకుంది? తరవాత నోటిని శుభ్రంగా కడిగి ఒక చిన్న ఆపిల్ ముక్కను నమలండి. తరువాత ఆలుగడ్డ ముక్కల్ని తీసుకొని నమలండి. (అయితే నమిలేటపుడు ముక్కును మూసి ఉంచడం మాత్రం మరిచిపోవద్దు.)

- *నీవు పరిశీలించిన అంశాలేమిటి?*



పటం-1: నాలుక చూషకాలు

ఆహారపదార్థం యొక్క రుచి మనకు తెలియాలంటే ఆ పదార్థం లాలాజలంలో కరగాల్సిందే, అప్పుడుగాని మనకు రుచి తెలియదు. మరోవిధంగా చెప్పాలంటే ఆహారపదార్థాల రుచులు ఆ పదార్థం ద్రవ రూపంలో ఉన్నపుడే సులభంగా తెలుసుకోగలం. నాలుకపై వివిధ రకాల రుచి మొగ్గలు వివిధ రకాల రుచులు గుర్తించుటకు ఉపకరిస్తాయని 9వ తరగతిలో నేర్చుకున్నారు కదా! ఒకసారి గుర్తుకు తెచ్చుకుందాం. పటాన్ని పరిశీలించండి. కరిగిన ఆహారం నాలుకపైన ఉండే గిన్నెల్లాంటి రుచి మొగ్గలకు తగలగానే రుచి సంకేతాలు మెదడును చేరుతాయి. అక్కడ విశ్లేషించబడిన తరవాతనే మనకు ఆ ఆహారపదార్థం యొక్క రుచి తెలుస్తుంది.

- *రెండు పదార్థాల రుచులు విడివిడిగా గుర్తించగలిగారా? లేదా రెండింటి రుచి ఒకేలా ఉందా? కారణమేమిటి?*

ముక్కులోని శ్లేష్మస్తరం ఓ పలుచని నీటిపొర కలిగి ఉంటుంది. మనం వాసన చూసినపుడు గాలిలో తేలియాడే వాసన పదార్థ అణువులు ఈ పొరలో కరుగుతాయి. ముక్కు మరియు నాలుకపై గల రసాయన గ్రాహకాలు లేదా ఘ్రాణ గ్రాహికలు (olfactory receptors) సంకేతాలను నాడీ ప్రచోదనాల రూపంలో మెదడుకు పంపుతాయి. మెదడు ఈ సంకేతాలను విశ్లేషించి వాసన మరియు రుచిని గుర్తిస్తుంది.

- *ఆహార పదార్థాలను నోటిలో వేసుకున్నప్పుడు ఏమవుతుంది?*
- *రుచిని తెలుసుకోడానికి ఉపయోగపడే నోటి భాగాలేవి?*

ఈ భాగాలు ఇంకేం పనులు నిర్వహిస్తాయో తెలుసుకుందాం.

## కృత్యం-3

చిటికెడు ఇంగువ లేదా వెల్లుల్లి తీసుకొని చేతిరుమాలు లేదా టిష్యూ పేపర్‌పై రుద్దండి. కళ్ళు మూసుకొని వాసన చూడండి. మీ స్నేహితుల సహాయంతో వివిధ ఆహార పదార్థాలను రుచి చూడండి.

- *ఆపిల్ కన్నా అల్లం వాసన ఘాటుగా ఉంటుందా? ఘాటైన వాసనలు రుచి స్పందనలపై ప్రభావం చూపిస్తాయని మీరు భావిస్తున్నారా?*
- *మీరు ఎన్ని రకాల ఆహారపదార్థాలను సరిగ్గా గుర్తించగలిగారు?*
- *వాసన మరియు రుచికి ఏదైనా సంబంధం ఉందని గ్రహించారా? అవి ఏమిటో రాయండి.*
- *కేవలం చూడడం ద్వారా ఆహారం రుచిగా ఉందని చెప్పగలరా?*

కొన్నిసార్లు కేవలం చింతకాయ, నిమ్మకాయ, మామిడికాయ మొదలైన పేర్లు వినగానే నోటిలో నీళ్ళు ఊరుతాయి. ఇప్పుడు మనం కృత్యాల ఫలితాల సారాంశాన్ని మీ జవాబుల సహాయంతో విశ్లేషిద్దాం. సాధారణంగా మనం కళ్ళకు ఆకర్షణీయంగా, ముక్కుకు సువాసనగా ఉన్నాయనుకున్న తర్వాతనే ఆహార పదార్థాలను రుచి చూస్తాం. అందుకే మనం తినేటప్పుడు మనకు తెలియకుండా మన కళ్ళు, ముక్కు మరియు నాలుక ఏ ఏ ఆహార పదార్థాలను తినవచ్చో ఎంపికచేసుకుంటాయి.

ఇవాన్ పావ్‌లోవ్ అనే రష్యన్ శాస్త్రవేత్త దీనిపై కొన్ని ప్రయోగాలు చేసి ఆహారం గురించి ఆలోచన వచ్చిన వెంటనే మన నోటిలో నీరూరుతుందని కనుగొన్నాడు. (నిబంధిత ఉద్దీపన-ప్రతిస్పందన) మీరు పావ్‌లోవ్ జంతువుల ప్రవర్తనపై జరిపిన ప్రయోగాల గురించి 9వ తరగతిలో చర్చించారు కదా!

- *రుచిపై ప్రభావం చూపే మరేవైనా ఇతర ఉద్దీపనలు ఉన్నాయా?*
- *బాగా వేడిగా ఉన్న పాలు లేదా టీ తాగినపుడు రుచి స్పందన ఏమవుతుంది?*

కొన్ని పదార్థాలు వేడిగా ఉన్నప్పుడు, కొన్ని పదార్థాలు చల్లగా ఉన్నప్పుడు రుచికరంగా ఉండడాన్ని మీరు గుర్తించే ఉంటారు కదా!

- *ఏ ఉష్ణోగ్రత వద్ద ఉన్నప్పుడు పదార్థాలు రుచికరంగా ఉంటాయని మీరు భావిస్తున్నారు?*

## రుచి నాలుకకు మరియు అంగిలికి సంబంధించిన విషయం

*ఇప్పుడు మనం రుచిని తెలుసుకోడంలో నోటిలో వేరువేరు భాగాలు ఎలా ఉపయోగపడుతాయో తెలుసుకోడానికి కింది కృత్యం చేద్దాం.*

### కృత్యం-4

### నాలుకమీద చక్కెర గుళికలు

కొంచెం చక్కెరను నాలుకపైన వేసుకోండి. మీ నోటిని తెరిచే ఉంచండి. మీ నాలుక అంగిలిని తాకకూడదు. స్టాప్‌వాచ్‌ను ఉపయోగించి మీరు నాలుకపై ఉంచిన చక్కెర గుళికల రుచి ఎంతసేపటికి తెలుసుకోగలిగారో గుర్తించి సమయాన్ని నమోదు చేయండి.

ఇప్పుడు అదే ప్రయోగాన్ని నాలుకతో అంగిలిని నొక్కిపెట్టి చేయండి. చక్కెర గుళికల రుచి, నాలుకపై ఉంచినప్పటి నుండి సమయాన్ని నమోదు చేయండి. తరువాత ఒక చుక్క చక్కెర ద్రావణాన్ని డ్రాపర్ ఉపయోగించి నాలుకపై వేయండి.

- *నాలుక పొడిగా ఉన్నపుడు రుచి తెలుస్తుందా?*
- *ఏ విధానం త్వరగా రుచిని గ్రహించడంలో తోడ్పడింది? ఎందుకు?*

పై కృత్యాన్ని బట్టి తెలిసిందేమిటంటే నాలుకను అంగిలికి నొక్కిపెట్టినపుడే మనం ఆహారపదార్థాల రుచిని సులభంగా గుర్తించగలుగుతాం. నాలుక ఒక జ్ఞానేంద్రియమనీ దానిపైన రుచి మొగ్గలు ఉన్నాయని మనకందరికీ తెలుసు. ఈ రుచి మొగ్గలు చిన్న గుళికలను కలిగి పైన తెరుచుకొని ఉంటాయి. వాటిలో రుచిని తెలిపే జ్ఞాన కణాలు ఉంటాయి. ఏదైనా ఆహారపదార్థం నాలుకపై ఉంచినపుడు అది నాలుక ద్వారా స్రవించే లాలాజలంలో కరిగిపోతుంది. నాలుక అంగిలిని నొక్కినప్పుడు ఆహారపదార్థం రుచి మొగ్గ యొక్క ద్వారాన్ని నొక్కి రుచి కణాలను చేరి రుచి సంకేతాలను ఉద్వేగపరుస్తుంది. ఈ సమాచారం మెదడుకు చేరగానే మెదడు రుచిని గుర్తిస్తుంది. సాధారణంగా మనం ఆహారాన్ని నములుతూనే నాలుకను అంగిలికి ఒత్తుతూ లొట్టలు వేస్తుంటాం. తద్వారా రుచిని అనుభవిస్తాం.




పటం-2: నాలుక మరియు అంగిలి

కింది ఫ్లోచార్టు రుచి జ్ఞానానికి సంబంధించి ఎలాంటి మార్గాన్ని నిర్దేశిస్తుంది?




- *నోటిలో లాలాజల గ్రంథులు పనిచేయకపోతే ఏం జరుగుతుంది?*
- *రుచి గ్రాహకాలు పనిచేయకపోతే మనం తీసుకునే ఆహారంపై దాని ప్రభావం ఎలా ఉంటుంది?*

## నోరు ఒక నమిలే యంత్రం

ఒకవేళ నోటిలో కొన్ని దంతాలు ఊడిపోయాయి అనుకోండి. అపుడు ఆహారం నమలడానికి అనువుగా ఉంటుందా?

### కృత్యం-5

వెనిగర్‌లో ఉంచిన చాక్‌పీస్ ప్రయోగం ద్వారా మనం ఆహారాన్ని ఎందుకు నమలాలి? ఆహారం ఎలా విచ్ఛిన్నమవుతుందో తెలుసుకుందాం.

ఒక చాక్‌పీస్ ముక్కను రెండు ముక్కలుగా చేయండి. ఒక ముక్కను చాలా చిన్నచిన్న ముక్కలుగా చేయండి. మరొక ముక్కను అలాగే ఉంచండి. రెండు బీకర్లు తీసుకోండి. లేదా రెండు మినరల్ వాటర్ బాటిళ్ళు తీసుకొని, పై భాగాన్ని కత్తిరించండి. ఇప్పుడు కింద మిగిలిన భాగాలను బీకర్లుగా ఉపయోగించుకోవచ్చు.

రెండు బీకర్లను సగం వరకు వెనిగర్‌తో నింపండి. ఒక దానిలో చిన్నచిన్న ముక్కలుగా పొడిచేసిన చాక్‌పీస్‌ను, మరొక దానిలో మిగిలిన చాక్‌పీస్‌ను వేయండి. మీ అమరికను కదపకుండా ఉంచండి. అరగంట తరువాత బీకర్లను పరిశీలించండి.

ఏ బీకరులోని చాక్‌పీస్ త్వరగా కరిగింది? ముక్కలుచేసిన చాక్‌పీస్ భాగమా లేదా పూర్తిగా ఉన్న చాక్‌పీస్ భాగమా?

పై ప్రయోగం ఆహారాన్ని యాంత్రికంగా ముక్కలు చేయవలసిన అవసరాన్ని తెలుపుతుంది. అందుకే నోట్లోనే ఆహారం చిన్న చిన్న ముక్కలుగా చేయబడాలి. దీని వలన ఆహారపు ఉపరితలం వైశాల్యం పెరిగి జీర్ణక్రియకు సహాయపడే పదార్థాలతో చర్య జరపడానికి తోడ్పడుతుంది.

- నోట్లో యాంత్రికంగా ముక్కలు చేసే ప్రక్రియ ఎలా జరుగుతుంది?
- నోటిలోని ఏ భాగాలు ఇందులో తోడ్పడుతాయి?
- ఏయే వ్యవస్థలు ఈ ప్రక్రియలో భాగమవుతాయి?

ఆహారాన్ని నమలడంలో దంతాలు ఎంతో ఉపయోగపడతాయని మీకు తెలుసు. నోటిలో ఉండే వివిధ రకాల దంతాలు జీర్ణక్రియలో ఎలా తోడ్పడతాయో తెలుసుకుందాం.

## కృత్యం-6

దవడలో దంతాల అమరికను తెలిపే నమూనా లేదా పటాన్ని లేదా మీ స్నేహితుని నోటిలో గమనించండి. దంతాలన్నీ ఆకారం మరియు పరిమాణంలో ఒకేలా ఉన్నాయా? వాటి ఆకారానికి నిర్వహించే పనికి ఏదైనా సంబంధం ఉందా? దంత సూత్రం, దంతాల అమరిక విధానాన్ని వివరిస్తుంది. ఇచ్చిన పటం ఆధారంగా చర్వణకాలు ఏ పనులు నిర్వహిస్తాయో ఆలోచించండి. మీరు కింది తరగతులలో కుంతకాలు పదునైన అంచులు కలిగి ఉంటాయని రదనికలు కూసుగా ఉంటాయని చర్వణకాలు, అగ్ర చర్వణకాలు చదునుగా ఉంటాయని నేర్చుకున్నారు కదా!




పటం-3: దంతాల అమరిక

- కుంతకాలు ఏవిధంగా ఉపయోగపడతాయని మీరు భావిస్తున్నారు?
- ఆహారాన్ని మెత్తగా నూరడానికి పనికివచ్చే దంతాలు ఏవి?
- ఆహారాన్ని చీల్చడానికి పనికివచ్చే దంతాలు ఏవి?
- మీ దంత సూత్రాన్ని రాయండి.

పటం ఆధారంగా కింది పట్టికను పూరించండి.

**పట్టిక-2**

| దంతం రకం పేరు | దంతాల సంఖ్య | ఆకారం | విధులు |
|---|---|---|---|
| | | | |
| | | | |
| | | | |
| | | | |

నోటిలో ఉండే వలయాకారపు కండరాలు ఆహారాన్ని నోటి కుహరంలో నెట్టడంలోనూ మరియు నోటిలో చుట్టూ కదిలించడంలోనూ సహాయపడతాయి. ఆహారాన్ని నేరుగా మింగడం సాధ్యంకాదు. కాబట్టి దంతాలు ఆహారాన్ని విసిరి, నమిలి, చిన్న ముక్కలుగా విచ్ఛిన్నం చేస్తాయి. ఈ విధానాన్ని నమలడం ద్వారా చూర్ణం చేయడం (Mastication) అంటారు. ఈ పనికోసం దవడలోని ఉపరితల కండరాలు ఆహారాన్ని దంతాల కిందికి నెట్టి కొరకడం మరియు నమలడం క్రియలను నిర్వహిస్తాయి. దవడలోని అంతర కండరాలు ఆహారం నమిలేటప్పుడు దవడను పైకి, కిందకు, ముందుకు, వెనుకు కదిలించడంలో తోడ్పడుతాయి. ఆహారం నమిలేటప్పుడు కింది దవడ మాత్రమే పైకి, కిందకు కదలడం మీరు గమనించే ఉంటారు.

దంతాలు ఆహారాన్ని నమలడం, విసరడంలో తోడ్పడితే నాలుక కదలికలు ఆహారాన్ని లాలాజలంతో కలుపుతూ నోటి కుహరంలో సమంగా విస్తరించడంలో తోడ్పడుతుంది. నోటి కండరాలు ఆహారాన్ని ఆస్యకుహరంలోకి నెట్టడానికి సహాయపడతాయి. 5వ కపాలనాడి దవడలోని అంతర కండరాల కదలికలను నియంత్రిస్తుంది.

- *నోటిలో ఆహారం ఉన్నప్పుడు లాలాజలం స్రవించే స్థాయి పెరుగుతుందా?*
- *లాలాజలం లేకుండా ఆహారాన్ని నమిలే ప్రక్రియ జరుగుతుందా?*
- *లాలాజలం నిర్వహించే ఇతర విధులు ఏవైనా ఉన్నాయా?*

లాలాజలం యొక్క పాత్రను తెలుసుకుందాం.

## కృత్యం-7

### పిండిపై లాలాజలం యొక్క చర్య

ఒక పరీక్షనాళికను తీసుకొని సగం వరకు నీటితో నింపండి. దానికి చిటికెడు పిండి కలపండి. పిండి నీటిలో బాగా కలిసేవరకు పరీక్షనాళికను కదిలించండి. కొన్ని చుక్కల పిండి మిశ్రమాన్ని ఒక వాచ్‌గ్లాస్‌లో తీసుకోండి. కొన్ని చుక్కల టింక్చర్ అయోడిన్ కలిపి పిండి పదార్థ పరీక్ష చేయండి. దానిలో ఏర్పడే నీలి-నలుపురంగు పిండి పదార్థాన్ని ధృవపరుస్తుంది. ఇప్పుడు ఈ మిశ్రమాన్ని రెండు సమాన భాగాలుగా చేయండి. రెండు పరీక్షనాళికల్లో ద్రావణం సమానంగా ఉండేలా జాగ్రత్త తీసుకోండి. ఒక పరీక్షనాళికలో ఒక టీ స్పూను లాలాజలం కలపండి. రెండవ పరీక్షనాళికలో ఏమీ కలపకుండా ఉంచండి. 45 నిముషాలు తరవాత ఒక చుక్క సజల టింక్చర్ అయోడిన్ ద్రావణం పరీక్షనాళికల్లో కలపండి.

- ద్రావణంలో ఏవైనా మార్పులు గమనించారా? ఈ మార్పు ఎందుకు జరిగింది?
- నోటిలో ఆహారం తీసుకున్నప్పుడు కూడా ఇదే ప్రక్రియ కొనసాగుతుందా?

స్వయంచోదిత నాడీవ్యవస్థ చర్య వలన లాలాజలగ్రంథులు లాలాజలాన్ని స్రవిస్తాయి. ఇది ఆహారాన్ని తేమగా చేసి నమిలి మింగడానికి అనుకూలంగా తయారుచేస్తుంది. అపుడు ఆహారం జిగురు ముద్దలా మారుతుంది. దీనిని బోలస్ (Bolus) అంటారు. నాలుక సహాయంతో మింగడం వలన ఇది ఆహారవాహికలోనికి చేరుతుంది. లాలాజలంలో ఉండే

'లాలాజల ఎమైలేజ్' అనే ఎంజైమ్ పెద్దపెద్ద పిండిపదార్థ అణువులను చిన్నచిన్న అణువులుగా మారుస్తుంది. సాధారణంగా చక్కెరలుగా మారుస్తుంది. మింగే క్రియాయంత్రాంగం కూడా నాడీ సమన్వయంతో పనిచేస్తుంది. మెదడు కాండం దగ్గరలోని మజ్జాముఖంలో ఈ నియంత్రణ కేంద్రం ఉంటుంది. దంతాల, నాలుక సహాయంతో ఆహారాన్ని నమిలి చూర్ణం చేయడం వల్ల ఆహార పదార్థాల పరిమాణం మింగడానికి అనువుగా మారుతుంది.

- *ఆహార పదార్థపు ఉపరితల పరిమాణం పెరగడం వల్ల లాభం ఏమిటి?*
- *ఆహారాన్ని నమలకుండా మింగితే ఏం జరుగుతుంది?*
- *లాలాజల ఎమైలేజ్ ఆహారం పై చర్య జరుపడానికి మాధ్యమ స్వభావం ఎలా ఉండాలి?*
- *నోటిలో pH మారుతూ ఉంటుందని నీవు అభిప్రాయపడుతున్నావా?*

## కృత్యం-8

### గంట విరామంలో నోటిలోని pH ను పరీక్షించుట

మీ రసాయనశాస్త్ర ఉపాధ్యాయుడిని అడిగి ఒక pH కాగితాన్ని రంగుపట్టికతో సహా తీసుకోండి (పటం-4ను చూడండి). ఒక చిన్న pH పేపర్ ముక్కను తీసుకొని నాలుకపై తాకించండి. దానిపైన ఏర్పడిన రంగును రంగుపట్టికలో జతచేసి చూడండి. pH విలువను గుర్తించండి. మధ్యాహ్న భోజనం తరవాత pH పేపరును నాలుక మీద ఉంచి పరీక్షించండి. మీ పరిశీలనలను నమోదు చేయండి. మీ పరిశీలనలను మీ స్నేహితుని పరిశీలనలతో పోల్చి చూడండి. కనీసం నాలుగు pH రీడింగులను గుర్తించండి.

- నోటిలోని సాధారణ స్థాయి pH విలువ ఎంత? ఇది ఆమ్లయుతమా? క్షారయుతమా?
- ఏమైనా తిన్నతరువాత pH లో మార్పులు గమనించారా? ఆ మార్పు ఎలా వచ్చింది?
- ఎలాంటి pH లో 'లాలాజల ఎమైలేజ్' బాగా చర్య జరపగలదు?
- వివిధ రకాల ఆహారాలను తీసుకున్నప్పుడు నోటిలోని pH ఎలాంటి పాత్ర పోషిస్తుంది.

వివిధ రకాల ఆహారపదార్థాలను తినే సమయంలో pH విలువను పరీక్షించండి. నమిలి మింగిన తరువాత కూడా పరీక్షించండి. మీ పరిశీలనలను నమోదు చేసుకోడానికి కావలసిన పట్టికను మీరే తయారుచేసుకోండి. అన్ని రకాల పదార్థాలు ఒకేసారి తినలేరు కదా! కాబట్టి పట్టిక పూరించడంలో తొందరపడవద్దు. తగినంత సమయాన్ని తీసుకోండి. (pH విలువ 7 కన్నా ఎక్కువైతే క్షారం, pH విలువ 7 కన్నా తక్కువైతే ఆమ్లం, pH విలువ 7 ఉంటే తటస్థం అని గుర్తించాలి.)

పై పరీక్షలను బట్టి స్రవించబడిన లాలాజలం ఆహారాన్ని క్షార మాధ్యమంలోకి మార్చడానికి తోడ్పడుతుంది. లాలాజల ఎమైలేజ్ ఆహారంతో చర్య జరుపుటకు ఈ మాధ్యమం అనుకూలిస్తుంది.

- *నోటిలో జరిగే జీర్ణక్రియలో తోడ్పడే వివిధ వ్యవస్థలేవి?*
- *నోటిలోని జీర్ణ ప్రక్రియ తరవాత ఆహారం ఎక్కడికి వెళుతుంది?*



పటం-4: pH స్కేలు



## మీకు తెలుసా?

పగలు నిద్రించినపుడు సొంగ (లాలాజలం) ఎందుకు కారుతుంది?

నిశాచర జీవుల (Nocturnals) గురించి మీరు వినే ఉంటారు కదా! ఇవి రాత్రివేళలో చురుకుగా ఉంటాయి. అయితే మనం పగటివేళలో చురుకుగా ఉండి, రాత్రివేళలో విశ్రాంతి తీసుకుంటాం. శరీరంలోని వ్యవస్థలన్నీ మనం పని చేస్తున్నప్పుడు చురుకుగా ఉంటాయి. అందుకే మనిషిని దివాచరులు (Diurnal animals) అంటారు. మన జీర్ణ వ్యవస్థ పగటివేళలో చురుకుగా ఉండడం వలన అది ఆహారాన్ని స్వీకరించి జీర్ణక్రియ జరపడానికి సిద్ధంగా ఉంటుంది. అందుకే పగటివేళలో నిద్రిస్తే నోటి ద్వారా స్రవించే లాలాజలం తలదిండును తడుపుతుంది. కానీ రాత్రివేళలో ఇలా జరగదు. సాధారణంగా ఒక రోజులో మనం 1-1.5 లీటర్ల లాలాజలాన్ని ఉత్పత్తి చేస్తాం.

### ఆహారవాహికలో ఆహార ప్రయాణం

నోటిలో నమలబడిన ఆహారం మింగడం ద్వారా నెట్టబడి ఆహారవాహికలోనికి చేరుతుంది.

ఆహారాన్ని మింగటంలో ఏయే వ్యవస్థలు కలిసి పనిచేస్తాయి. కింది రేఖాపటం ఆహారవాహిక యొక్క నిర్మాణాత్మక, క్రియాత్మక లక్షణాలను వివరిస్తుంది. పటాన్ని పరిశీలించి ప్రశ్నలకు జవాబులు ఇవ్వండి.




- *ఈ సమాచార రేఖాచిత్రం ఆహారవాహిక గురించి ఏమి తెలియజేస్తోంది?*
- *ఆహారవాహిక ఏవిధమైన నిర్మాణాన్ని కలిగి ఉంటుంది?*
- *ఆహారవాహికలో ఆహారం ప్రయాణించడానికి శ్లేష్మస్తరం ఎలా ఉపయోగపడుతుంది?*

## కృత్యం-9



పటం-5: సైకిల్ ట్యూబ్‌లో బంగాళదుంప

### ఆహారవాహికలో ఆహారం (food bolus) ఎలా ప్రయాణిస్తుందో తెలిపే నమూనాను పరిశీలించుట

ఒక పాత సైకిల్ ట్యూబ్ ముక్కను తీసుకోండి. గొట్టం లోపలి భాగాన్ని నూనెతో పూత పూయండి. అలాగే రెండు బంగాళదుంపల్ని తీసుకొని శుభ్రంగా కడిగి పొడిగా తుడిచి నూనెతో పూత పూయండి. తరువాత బంగాళదుంపలను సైకిలు ట్యూబ్‌లో ప్రవేశపెట్టండి.

గొట్టాన్ని నొక్కుతూ బంగాళదుంపను గొట్టంలో కదిలే లాగా చేయండి. బంగాళాదుంపలు గొట్టంలో కదులుతున్న విధానాన్ని జాగ్రత్తగా పరిశీలించండి.

- *గొట్టంగుండా బంగాళాదుంపలు కదలడానికి ఎలా నొక్కాలి? నూనె ఎలా పనిచేస్తుంది?*
- *ఆహార వాహికలో ఉండే కండరాలు కూడా ఆహారాన్ని కిందికి నెట్టడానికి ఇదేవిధంగా పనిచేస్తాయా?*
- *బంగాళాదుంపలు గొట్టంగుండా కదలడానికి నూనె ఎలా సహాయపడింది.*

## ఆహార వాహికలో పెరిస్టాలిటిక్ చలనం

పటాన్ని పరిశీలించండి. ఆహార వాహికలో ఆహారం స్థానాన్ని, ఆహార వాహిక గోడలలో జరిగే చలనాన్ని పరిశీలించండి.

- *ఆహారపుముద్ద స్థానంలో మార్పు ఎలా సంభవించింది?*
- *మీరు ఇంతకుముందు చేసిన బంగాళదుంపలు కదిలే ప్రయోగానికి ఈ పటానికి ఎమైనా పోలికలను మీరు గమనించారా? అవి ఏమిటి?*




పటం-6: ఆహారపు ముద్ద పెరిస్టాలిక్ చలనం

ఆహారనాళపు గోడలు జారుడు గుణంగల జిగురు పదార్థాన్ని స్రవిస్తాయి. దీనిని 'శ్లేష్మం' (Mucus) అంటారు. శ్లేష్మం చమురులా పనిచేస్తూ ఆహారవాహిక గోడలకు హాని జరగకుండా కాపాడుతుంది. దీనివలన ఆహార బోలస్ నూనెపూసిన బంగాళదుంపల్లా ఆహారవాహికలో సులభంగా కదులుతూ కిందికి జారుతుంది. దీనికి తోడుగా ఆహార బోలస్‌లోని లాలాజలం సులభంగా దానిని జీర్ణాశయంలోకి చేరవేయడంలో ఉపయోగపడుతుంది.

ఆహారవాహిక గోడలు రెండు రకాలైన మెత్తని నునుపు కండరాలను కలిగి ఉంటాయి. లోపలి పొరలో వలయాకార కండరాలు, వెలుపలి పొరలో స్తంభాకార కండరాలు ఉంటాయి. వలయాకార కండరాలు సంకోచించినపుడు ఆహారపు ముద్దకు వెనుక ఉండే ఆహార వాహిక భాగం ముడుచుకుని ఆహార ముద్దను కిందికి జరిగేలా వత్తిడి కలిగిస్తుంది.

స్తంభాకార కండరాల సంకోచం వలన ఆహారవాహికలోని బోలస్ ముందుభాగం పొడవు తగ్గి గొట్టం వెడల్పవుతుంది. బోలస్ ముందుకు కదులుతుంది. ఇలా కండరాల సంకోచ వ్యాకోచ కదలికల వలన ఒక తరంగంలాంటి చలనం ఏర్పడి ఆహార బోలస్‌ను జీర్ణాశయంలోనికి నెడుతుంది. ఈ ప్రక్రియను 'పెరిస్టాల్సిస్' (Peristalsis) అంటారు. ఇది అనియంత్రితమైనది, మరియు అనియంత్రిత నాడీ వ్యవస్థ ఆధీనంలో నియంత్రించబడుతుంది.

- *ఆహారవాహికలో ఆహార బోలస్ సులభంగా కదలడానికి సహాయపడేదేమిటి?*
- *సాధారణంగా ఆహారాన్ని నమలకుండా మింగకూడదని లేదా తొందరపడి త్వరత్వరగా తినవద్దని సలహాలిస్తుంటారు. ఎందుకని? ఆలోచించండి.*

### జీర్ణాశయం ఒక రుబ్బురోలు వంటిది

ఆహారనాళం మాదిరిగా జీర్ణాశయం ఒక గొట్టంలా కాకుండా సంచిలా ఎందుకు నిర్మితమై ఉంది?

- *జీర్ణాశయంలో ఈ ప్రక్రియలు ఎలా జరుగుతాయి?*

నోటికుహరంలో ఆహారం ఉన్నప్పుడు బుగ్గలో నాలుకలోని జ్ఞాన నాడులు ఉత్తేజితమవుతాయి. నాడీ ప్రచోదనాల రూపంలో సంకేతాలను మెదడుకు చేరవేస్తాయి. ఈ సమాచారాన్ని మెదడు విశ్లేషిస్తుంది. మెదడు నుండి ప్రసారమైన సమాచారం చాలక నాడుల ద్వారా జీర్ణాశయపు గోడలను చేరతాయి. జఠరగ్రంథులు ఉత్తేజితమై జఠరరసాన్ని స్రవిస్తాయి.

ఆహారం జీర్ణాశయాన్ని చేరుకునేసరికి జీర్ణాశయపు గోడలు హైడ్రోక్లోరిక్ ఆమ్లంవంటి బలమైన ఆమ్లాలు, ఇతర జీర్ణరసాలను స్రవిస్తుంది. ఆకలైనపుడు కూడా ఇలాగే జరుగుతుంది. ఒక్కొక్కసారి వాంతులు అయిన తరువాత గొంతంతా మంటగా ఉన్నట్లు అనిపించడం మీకు అనుభవమయ్యే ఉంటుంది. ఈ మంటకు కారణం ఏమిటని మీరు భావిస్తున్నారు? ఈ ఉత్తేజితస్థితి నాడీ వ్యవస్థ వలననే ఏర్పడుతుంది. జీర్ణాశయ కండరాలలో కలిగే సంకోచ సడలికలు ఆహారాన్ని ఆమ్లాలు మరియు ఇతర జీర్ణరసాలతో కలిపి చిలుకుతాయి. ఈ జీర్ణరసాలు ఆహారాన్ని మెత్తని జావలాంటి ద్రవంలా మారుస్తాయి. దీనినే కైమ్ (chyme) అంటారు. కొన్ని పెద్ద ప్రోటీన్ అణువులు కూడా ఇక్కడ జీర్ణమై సరళ పదార్థాలుగా మారుతాయి.

- జీర్ణాశయపు కండరాలు చర్య జరిపేలా ఉత్తేజపరిచే అంశం ఏమిటి?
- కలుపుట మరియు చిలుకుట ప్రక్రియలను జీర్ణాశయం ఎందుకు నిర్వహిస్తుంది?

జీర్ణాశయంలో జీర్ణక్రియ ముగింపు దశకు చేరుకునేసరికి జీర్ణాశయ గోడల సంకోచాలు తగ్గుముఖం పడతాయి. దీనికి గల కారణం ఏమిటి? రక్తంలో ఏ పదార్థం జీర్ణాశయం సంకోచం చెందడాన్ని నియంత్రిస్తుంది. ఫలితంగా జీర్ణాశయం చిన్నప్రేగులోకి తెరుచుకునే భాగంలో గల సంవరిణీ కండరాన్ని (pyloric spincter) సంకోచం చెందిస్తుంది. అందువల్ల ఆంత్రమూలం లోపలికి దారి ఏర్పడి అసంపూర్ణంగా జీర్ణమైన ఆహారం కొద్దికొద్ది మోతాదుల్లో ఆంత్రమూలంలోకి విడుదలవుతుంది.




పటం-7: జీర్ణాశయంలో పెరిస్టాల్టిక్ చలనం

- అసంపూర్ణంగా జీర్ణమైన ఆహారం స్వల్ప మోతాదుల్లో జీర్ణాశయం నుండి ఆంత్రమూలంలోకి ఎందుకు చేరుతుంది?

పెరిస్టాల్టిక్ క్రియలో ఆహారం ఉన్న ప్రదేశానికి వెనుక ఉండే కండరం సంకోచిస్తుంది. అందువల్ల ఆహారం ముందున్న కండరం సడలుతుంది. ఈ క్రియ వలన ఆహారంపై ఒత్తిడి ఏర్పడి జీర్ణనాళం ద్వారా ముందుకు నెట్టబడుతుంది. కండరాలలో తరంగాల్లా ఏర్పడే సంకోచం దాన్ని అనుసరిస్తూ ఏర్పడే సడలికలు ఆహారాన్ని ముందుకు కదిలించడంలో తోడ్పడతాయి.

- పెరిస్టాల్‌సిస్ చర్య జరగడంలో ఏయే భాగాలు ఇమిడి ఉంటాయి?
- పెరిస్టాల్‌సిస్ ఏ దిశలో జరుగుతుంది? (ఆహారనాళంలోని ఏ చివర నుండి మొదలవుతుంది?)
- పెరిస్టాల్‌సిస్ అపసవ్యదిశలో జరిగితే ఏమి జరుగుతుంది?

వాంతులయ్యేటప్పుడు అసంపూర్ణంగా జీర్ణమై క్రైమ్ రూపంలో ఉన్న ఆహారం ఆహారనాళంలో వెనుకకు నెట్టబడడాన్ని మీరు గమనించే ఉంటారు. పటం– 7 లో ఇలాంటి వ్యతిరేక దిశలో జరిగే పెరిస్టాలిటిక్ చలన దిశను గుర్తించండి.

చెట్టుకింద లేదా ఎక్కడైనా నెమరువేసే ఆవు లేదా గేదెను గమనించారా? వాటి మెడ మరియు గొంతు భాగాన్ని జాగ్రత్తగా పరిశీలించండి. గొంతు నుండి నోటి వరకు ఏదో కదులుతున్నట్లు చూడవచ్చును. దాని తరవాత ఆవు లేదా గేదె నమలడం మొదలుపెడుతుంది. దీనినే నెమరువేయడం అంటారు. ఇందులో ఏం జరుగుతుందో చెప్పగలరా? ఆహారపు ముద్ద (బోలస్) జంతువు జీర్ణాశయం సమీప భాగం నుండి నోటి వరకు వెనుకకు కదులుతోందన్నమాట. అంటే ఇది వ్యతిరేక దిశలో జరుగుతున్న పెరిస్టాల్‌సిస్ చలనం. ఆవు, గేదె వంటి నెమరువేసే జంతువుల్లో ఈ క్రియ సర్వ సాధారణం. ఎందుకంటే గబాగబా నమిలిమింగిన ఆహారాన్ని నిలువ చేసుకోడానికి వాటి జీర్ణాశయంలో అదనపు తిత్తి వంటి నిర్మాణం ఉంటుంది. కానీ మానవుల్లో ఈ క్రియ ఆహారనాళానికి సరిపడని, వ్యర్థపదార్థాలను బయటకు పంపే రక్షణ ప్రతిచర్యగా ఉపయోగపడుతుంది.

జీర్ణక్రియ నోటిలో మొదలవుతుందని మనకు తెలుసు. ఆహారనాళం గుండా ఆహారం ప్రయాణిస్తున్నప్పుడు జీర్ణక్రియ జరిగే ప్రతి దశలో కొంత సమయం తీసుకుంటుంది. జీర్ణ వ్యవస్థలో ఆహారచలనం ఒకేవిధంగానూ, సమాన కాలవ్యవధులలోనూ జరగదు.

కాలవ్యవధి పట్టికను పరిశీలిద్దాం.

**పట్టిక-3**

| శాతం | జీర్ణాశయం ఖాళీ కావడం | చిన్నప్రేగు ఖాళీ కావడం |
|---|---|---|
| 50% | 2 1/2 నుండి 3 గంటలు | 2 1/2 గంటలు |
| మొత్తం 100% | 4 నుండి 5 గంటలు | 30 నుండి 40 గంటలు |

(ఇది కేవలం సగటు మాత్రమే. పదార్థాల కదలికలలో వ్యక్తికి వ్యక్తికి ఎంతో తేడా ఉంటుంది. ఇది తీసుకునే ఆహారం, సమయాన్ని బట్టి మారుతుంటుంది.)

మన జీర్ణాశయం నిర్దిష్ట పరిమాణం గల సంచి వంటిది కాదు. సాగే గుణం గల ఒక తిత్తిలాంటి నిర్మాణం. మనం తీసుకునే ఆహారాన్నిబట్టి జీర్ణాశయ పరిమాణం పెరుగుతుంది.

అలాగే ఆహారపదార్థ పరిమాణాన్ని బట్టి జీర్ణరసాలు స్రవిస్తాయి. తీసుకొనే ఆహార పరిమాణంతో సంబంధం లేకుండా ఎల్లప్పుడూ ఒకే పరిమాణంలో జీర్ణరసాలు స్రవిస్తే అవి జీర్ణాశయ గోడలను నాశనం చేయవచ్చును.

జీర్ణక్రియలో జీర్ణాశయం బలమైన ఆమ్లాలు స్రవిస్తుందని మనకు తెలుసు. జీర్ణాశయపు గోడల నుండి స్రవించబడే హైడ్రోక్లోరిక్ ఆమ్లం మన శరీరంలోని గట్టి ఎముకలను సైతం జీర్ణం చేయగలిగినంత బలంగా ఉంటుంది. మరి జీర్ణాశయం స్వంత ఆమ్లాల స్రావాల బారినుండి తనను తాను ఎలా రక్షించుకుంటుంది? దీనిని అర్థం చేసుకోవడానికి కింది కృత్యం చేద్దాం.



## ప్రయోగశాల కృత్యం

### ఆమ్లం మరియు పత్ర ప్రయోగం

మీ బడి తోట నుండి రెండు ఆకుపచ్చని పత్రాలు సేకరించండి. ఒక పత్రానికి పెట్రోలియం జెల్లీ లేదా వాజ్‌లీన్ పూయండి. మరొకదాన్ని అలాగే వదిలేయండి. 1 లేదా 2 చుక్కల బలహీన ఆమ్లాన్ని రెండు పత్రాలపై వేయండి. అరగంట తరవాత పత్రాలను పరిశీలించండి. మీ పరిశీలనలను మీ నోటుబుక్‌లో రాయండి.

- *పత్రాలలో ఎలాంటి మార్పులు గమనించారు?*
- *ఏ పత్రంలో మార్పులు గమనించారు? ఏ పత్రంలో మార్పు జరగలేదు కారణాలేమిటి?*
- *ఆమ్ల ప్రభావం నుంచి ఆకును రక్షించినదేమిటి?*

జీర్ణాశయంలోని గ్రంథులు బలమైన ఆమ్లాలు స్రవించినప్పటికీ జీర్ణాశయపు గోడల్లోని కొన్ని గ్రంథులు శ్లేష్మ పదార్థాన్ని స్రవిస్తాయి. ఇది జీర్ణాశయపు గోడలపై ఒక పలుచనైన పొరలా ఏర్పడుతుంది. ఇది ఆమ్ల ప్రభావం నుండి జీర్ణాశయాన్ని రక్షిస్తుంది. పెట్రోలియం జెల్లీ చేసే పనిని జీర్ణాశయపు గోడలలోని శ్లేష్మం (mucus) చేసే పనితో పోల్చవచ్చు. శ్లేష్మస్తరం ఉండడం వల్లనే జీర్ణాశయం స్వంత ఆమ్లాల స్రావాల వలన ఎలాంటి హాని జరగకుండా రక్షణ పొందుతోంది.

### జీర్ణాశయం నుండి ప్రేవులలో ఆహార ప్రయాణం

ఆహారం జీర్ణాశయం నుండి చిన్నప్రేవుల్లోకి ప్రవేశించినపుడు అది రసం వంటి మిశ్రమంలా ఉంటుంది. చిన్నప్రేవుల్లోకి ప్రవేశించినపుడు ఆహారానికి గల ఆమ్ల స్వభావం గల సెక్రిటిన్ (Secretin) మరియు కొలిసిస్టోకైనిన్ (Cholecystokinin) అనే హార్మోన్లను స్రవింపజేస్తుంది. ఈ హార్మోన్లు క్లోమం, కాలేయం మరియు చిన్న ప్రేవు గోడలోని జీర్ణరసాలను ఉత్తేజపరచి క్లోమరసం, పైత్యరసం మరియు ఆంత్రరసాలను స్రవింపజేస్తాయి.

- *చిన్నప్రేవు ఎందుకు పొడవుగా మెలికలు తిరిగి చుట్టలా ఉంటుంది?*
- *చిన్నప్రేవులలో శోషణ ఎలా జరుగుతుంది?*

చిన్న ప్రేగుల లోపలి తలంలో ఉండే వేళ్ళవంటి నిర్మాణాలు ఆహారంలోని పోషక పదార్థాలను ప్రత్యేకమైన పద్ధతిలో ఎంపిక చేసుకుని శోషిస్తాయి. చిన్నప్రేగుల గోడలు ఎల్లప్పుడూ

చిన్న పరిమాణంలో ఉండే అణువులనే గ్రహిస్తాయి. పెద్ద అణువులు మిగిలిపోతాయి. 9వ తరగతిలో మీరు ప్లాస్మాపొర గుండా పదార్థాల కదలిక గురించి చదివారు కదా! ఆ విషయాలను చిన్న ప్రేవులలో జరిగే శోషణతో పోల్చిచూడండి.

## కృత్యం-10



### పేపర్ గొట్టం మరియు మడిచిన కాగితాలు

10×20 సెం.మీ. కొలతలు గల ఒక చార్టు పేపరును తీసుకోండి. దానిని మడిచి రెండు చివరలు అంటించి గొట్టంలా చేయండి. ఇప్పుడూ 20×20 సెం.మీ. కొలతలుగల మరొక చార్టు పేపరు తీసుకోండి. దానిని కూడా పైన చెప్పినట్టుగా గొట్టంలా తయారుచేయండి. దానిని మొదటి గొట్టంలో దూర్చండి. దూర్చగలిగారా? ఇప్పుడు 20×20 సెం.మీ. కొలతలు గల మరొక పేపరును తీసుకోండి. దానిని పటంలో చూపినట్లు వీలైనన్ని మడతలు మడవండి. రెండు చివరలను అంటించి గొట్టంలా చేయండి. మీ మడతల గొట్టం తయారైందన్నమాట. దానిని మొదటి గొట్టంలో దూర్చండి. దూర్చగలిగారా?





పటం-8: కాగితపు గొట్టం

- *రెండు గొట్టాలకు ఉపయోగించిన కాగితాల వైశాల్యాన్ని పోల్చి చూడండి. వైశాల్యంలో తేడా కనిపించిందా? ఒకవేళ పెరిగినట్లు గమనిస్తే కారణాలు తెలుసుకోండి.*

చిన్నప్రేవుల గోడల లోపలి తలంలో వేల సంఖ్యలో వేళ్ళ వంటి నిర్మాణాలు ఉంటాయి. వీటిని ఆంత్రచూషకాలు (Villi) అంటారు. ఈ వేళ్ళ వంటి నిర్మాణాలకు కాగితపు మడతలకు గల సంబంధమేంటి?

చిన్న ప్రేవుల్లోని లోపలి తలంలో ఉండే ఆంత్రచూషకాలు అనే నిర్మాణాలు చిన్నప్రేవుల లోపలి గోడల ఉపరితల వైశాల్యాన్ని పెంచుతాయి. తద్వార ఈ రకమైన మడతలలో ఆహారం ఎక్కువ సేపు ఉండి శరీరంలోకి గ్రహింపబడే సామర్థ్యం పెరుగుతుంది.

- *ఇక్కడ జరిగే చర్యలలో ఏయే వ్యవస్థలు కలిసి పనిచేస్తున్నాయని మీరు భావిస్తున్నారు?*
- *ఆ వ్యవస్థలు జీర్ణమండలమంతా కలిసే పనిచేస్తున్నాయని భావిస్తున్నారా? ఎందుకు? ఎందుకు కాదు?*

ఆహారనాళం శరీరంలో ఉండే అంతర అవయవాలన్నింటికన్నా ఒక ప్రత్యేకమైన నిర్మాణాన్ని కలిగి ఉంటుంది. ఎందుకంటే బాహ్య ప్రపంచం నుండి మనం తీసుకునే ఆహారం వలన కలిగే వైవిధ్యమైన భౌతిక రసాయన ఉద్దీపనలు దీనిని తీవ్రంగా ప్రభావితం చేస్తుంటాయి. దీని మూలంగా కండర నిర్మాణాలను, నాడీ నిర్మాణాలను సమన్వయ పరుచుకుంటూ జరిగే అనేక కదలికలకు నిలయంగా ప్రేవులు అభివృద్ధి చెందాయి. జీర్ణక్రియ, శోషణ, విసర్జన క్రియలలో తగిన పాళ్ళలో జీర్ణరసాలను కలపడం, ఆహార పదార్థాలను ఆహారవాహికలో కదిలించడంలో ఈ స్వభావం వ్యక్తమవుతుంది.




పటం-9: చిన్నప్రేవులో ఆంత్రచూషకం

జీర్ణనాళంలోని నాడీ వ్యవస్థ నాడీ కణాలతో కూడిన ఎంతో సంక్లిష్టమైన నాడీ వలయాన్ని కలిగి ఉంటుంది. శాస్త్రవేత్తలు ఈ వ్యవస్థను రెండవ మెదడుగా పిలుస్తారు. శరీరంలోని రోగనిరోధక ప్రతిస్పందనలను రెండవ మెదడు ఎలా పనిచేయిస్తోందనే అంశంపై చాలా పరిశోధనలు జరుగుతున్నాయి. వ్యాధి నిరోధక వ్యవస్థ 70% వరకు ఆహారనాళంలో చేరే వ్యాధి కారకాలను సంహరించి బయటకు పంపే చర్యలపై కేంద్రీకరించబడి ఉంటుంది.

జీర్ణవ్యవస్థలోని ప్రేవుల్లో కోట్ల సంఖ్యలో ఉండే బ్యాక్టీరియాలు జీర్ణమండలంలోని నాడీ వ్యవస్థలోని కణాలతో ఎలా అనుసంధానం చేసుకోగలుగుతున్నాయో శాస్త్రవేత్తలు తమ పరిశోధనల ద్వారా తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నారు. లోతుగా ఆలోచిస్తే జీర్ణనాళంలోని నాడీకణజాల సముదాయం కేవలం జీర్ణక్రియ జరపడం లేదా అప్పుడప్పుడు ఆకలి కోరికల సంకేతాలు పంపడం వరకే పరిమితం కాకుండా ముఖ్యమైన సమాచారాన్ని పంపే 'న్యూరోట్రాన్స్ మీటర్స్'తో నిక్షిప్తమై ఉంటుందని తెలుస్తుంది. శరీరంలో దిగువ భాగంలో ఉంటూ రెండవ మెదడుగా పిలవబడే జీర్ణమండలంలోని నాడీవ్యవస్థ కపాలంలోని పెద్ద మెదడుతో సంధించబడి ఉంటుంది. ఇది కొంతవరకు మన మానసిక స్థాయిని నిర్ణయించడంతోపాటు శరీరంలోని కొన్ని వ్యాధులను నిర్ణయించడంలో కీలక పాత్ర వహిస్తుంది. మానసిక ఒత్తిడికి లోనైపుడు విరేచనాలు కావడం లాంటి పరిస్థితులు మీరు అనుభవించే ఉంటారు.

- *ఇది మనకు ఏమి తెలుపుతుంది?*

రెండవ మెదడు ప్రభావం ఎంతగానో ఉన్నప్పటికీ ఇది తెలివితేటలు, ఆలోచించడం లేదా నిర్ణయాలు తీసుకోవడం వంటి పనులను నిర్వహించలేదు. ఆహారవాహిక నుండి పాయువు వరకు దాదాపు 9 మీ. పొడవు కలిగి జీర్ణనాడీ వ్యవస్థగా (Enteric Nervous System) పిలువబడే రెండవ మెదడులోని అనేక నాడులు పొరల రూపంలో జీర్ణనాళపు గోడలలో ఇమిడి ఉంటాయి.

దాదాపు 100 మిలియన్ల నాడీ కణాలు ఈ రెండవ మెదడులో ఇమిడి ఉంటాయి. ఇది వెన్నుపాము లేదా పరధీయ నాడీ వ్యవస్థలోని నాడీ కణాల సంఖ్యను మించి ఉంటుంది. జీర్ణనాడీ వ్యవస్థలోని ఈ మహా నాడీ కణాల సముదాయ జీర్ణ వ్యవస్థ యొక్క అంతర ప్రపంచం, అందులో గల పదార్థాల గురించి తెలుసుకోడానికి, అనుభూతి చెందడానికి తోడ్పడుతుంది. ఆహారాన్ని చిన్నచిన్న రేణువులుగా విచ్ఛిన్నం చేయడం, పోషకాలను గ్రహించడం మరియు వ్యర్థాలను విసర్జించడం లాంటి జీవక్రియలను ఉత్తేజ పరచడం మరియు సమన్వయం చేయడానికి అనేక రసాయనిక పద్ధతులు, యాంత్రిక మిశ్రణీకరణ విధానాలు, లయబద్ధమైన కండర సంకోచాలు ఒకదానివెంట ఒకటిగా జీర్ణక్రియా చర్యలన్నీ జరుగుతూ ఉంటాయి.

రెండవ మెదడు తనదైన స్వీయ ప్రతిస్పందనలను, జ్ఞానేంద్రియ శక్తిని కలిగి ఉండడంవల్ల జీర్ణవ్యవస్థకు సంబంధించిన ఎన్నో పనుల నిర్వహణను మెదడుతో సంబంధం లేకుండా స్వతంత్రంగా నియంత్రిస్తుంది.

జీర్ణ వ్యవస్థలో పదార్థాలు సజావుగా లోనికి రావడానికి, బయటకు వెళ్ళడానికి వీలుగా ఈ వ్యవస్థ ఇంత సంక్లిష్టతతో ఏర్పడి ఉండవచ్చునని శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

- *ఆహార నాళం నుండి బయటకు ఏమి కదులుతుంది?*
- *వ్యర్థాల విసర్జన యొక్క రెండు ప్రధాన మార్గదర్శకాలు పైన చూపబడ్డాయి. రెండింటిలో కేవలం ప్రేవుల ద్వారా జరిగే ప్రక్రియ ఏది?*




శోషణంకాని పదార్థాలు శరీరం నుండి బయటకు పంపించబడడానికై పెద్దప్రేగును చేరుతాయి. ఈ ప్రక్రియ ఎలా జరుగుతుంది?

గుప్పెడు మిగిలిపోయిన తడి టీ పొడిని ఒక అద్దుడు కాగితంలో తీసుకొని ఒక ముద్దలా చేయండి. తరవాత దానిని సున్నితంగా ఒత్తి తెరిచి చూడండి. ఏం గమనించారు? అద్దుడు కాగితం టీ పొడిలోని నీటిని పీల్చుకుంది కదా!

అవసరమైన, వ్యర్థ పదార్థాలు పెద్ద ప్రేగును చేరినపుడు దానిలోని నీటిని పెద్దప్రేగు గోడలు శోషిస్తాయి. పెరిస్టాల్‌టిక్ తరంగాలు వ్యర్థపదార్థాలను పెద్దప్రేగు నుండి పురీషనాళంలోకి కదిలిస్తాయి. పెద్ద ప్రేగులోని కొలాన్ ఎడమ భాగం మలాన్ని నిలువ చేసే ట్యాంక్‌లా పనిచేస్తుంది. నీటిని పునఃశోషణం చేస్తుంది. మిగిలిన వ్యర్థాలు పెద్దప్రేగులోని చివరి భాగమైన పురీషనాళంలో నిలువ చేయబడతాయి. దుర్గంధంతో కూడిన ఈ పసుపు రంగులోని వ్యర్థాన్నే సాధారణంగా 'మలం' (Faecal matter) అంటాం. తదుపరి ఇది శరీరం నుండి పాయువు (Anus) ద్వారా బయటకు విసర్జింపబడుతుంది.

- *మల విసర్జనాన్ని శరీరంలోని ఏ భాగం నియంత్రిస్తుంది?*
- *ఈ చర్య నియంత్రితమా? అనియంత్రితమా? ఎందుకు?*

పెద్దప్రేవు చివరి భాగంలో ఉండే రెండు కండర పొరలు పాయువు యొక్క సంవరిణీ కండరాలుగా (Anal sphincter)గా ఏర్పడతాయి. లోపలి సంవరిణీ కండరం అనియంత్రితంగాను బాహ్య సంవరిణీ కండరం నియంత్రితంగా పనిచేస్తుంది. ఇవి మలవిసర్జన మార్గాన్ని నియంత్రిస్తాయి.



పటం-10: పాయువు సంవరిణీ కండరం

- *ఆహారనాళంలో ఇంకా ఎక్కడైనా సంవరిణీ కండరాలు ఉన్నాయా? ఎక్కడ?*
- *ఒకవేళ వ్యక్తి తన శరీరానికి కావాల్సిన పరిమాణం కన్నా ఎక్కువ ద్రవాలను తీసుకున్నాడనుకుందాం. అపుడు ఎక్కువగా ఉన్న ద్రవం శరీరం నుండి ఏవిధంగా తొలగించబడుతుంది?*

ఇంతవరకు మనం వివిధ వ్యవస్థలు ఉమ్మడిగా పనిచేస్తూ జీర్ణక్రియ ప్రక్రియలో తోడ్పడటం చూశాం.

- *ఈ ప్రక్రియ సజావుగా సాగడానికి కావాల్సిన శక్తి ఎక్కడ నుండి సమకూరుస్తుంది?*
- *ప్రేవుల నుండి రక్తంలోకి చేరిన జీర్ణమైన ఆహార పదార్థాలు ఏమవుతాయి?*

ఆహారం నుండి శక్తిని పొందాలంటే అది ఆక్సీకరణం చెందాలి. ఇందుకోసం శ్వాసక్రియ జరగాలి. ఈ ప్రక్రియలో ఆహారం నుండి శక్తి ఎలా విడుదలవుతుంది?

ఉచ్ఛ్వాస క్రియలో ఆక్సిజన్ వాయుగోణుల గోడల ద్వారా రక్తంలోకి చేరుతుంది. ఇక్కడ నుంచి ఎర్ర రక్తకణాల్లోకి ప్రవేశించి శరీరంలోని అన్ని కణాలకు సరఫరా చేయబడుతుంది. అదే సమయంలో రక్తంలోని కార్బన్ డై ఆక్సైడ్ ఊపిరితిత్తులలోని వాయుగోణులలోనికి చేరుతుంది. నిశ్వాస క్రియలో అది బయటకు పంపబడుతుంది. కణాల్లోని పోషకాలు ఆక్సీకరణం చెంది శక్తి విడుదలవుతుంది.

- *ఇలా విడుదలైన శక్తి కణాలలో ఎక్కడ నిలవ ఉంటుంది?*
- *మన శరీరంలో ఎక్కువగా ఉన్న లవణాలను బయటకు పంపే వ్యవస్థ ఏది?*
- *శరీరం నుండి లవణాలు ఏ మార్గం ద్వారా బయటకు వస్తాయి?*

శ్వాసక్రియలో ఉచ్ఛ్వాస, నిచ్ఛ్వాస క్రియల ద్వారా గాలిని శ్వాసిస్తుంటాం. అనియంత్రితంగా జరిగే ఈ చర్యలను స్వయంచోదిత నాడీ వ్యవస్థలోని 'మజ్జాముఖం' నియంత్రిస్తుంది. శ్వాసక్రియ జరిగేటపుడు ఉదరవితానం కదలికల ద్వారా ఉరఃపంజరాన్ని కదిలించి ఊపిరితిత్తులలో సంకోచ, వ్యాకోచాలు కలిగిస్తుంది. అధిక ఆక్సిజన్ కలిగిన గాలి ఊపిరితిత్తుల ద్వారా రక్తంలోకి చేరుతుంది. ఆక్సిజన్ కణజాలాలకు రక్తం ద్వారా రవాణా చేయబడుతుంది. సంక్లిష్టమైన ఈ జీర్ణక్రియా విధానంలో అనేక రకాల అవయవాలు, అవయవ వ్యవస్థలు సమన్వయంతో పనిచేస్తాయి. జీర్ణక్రియ నోటినుండి పాయువు వరకు వ్యాపించి ఉన్న ఆహారనాళంలో జీర్ణక్రియ జరుగుతున్నప్పటికీ దీనికి శ్వాసవ్యవస్థ, రక్త ప్రసరణ వ్యవస్థ, నాడీ వ్యవస్థలతో సమన్వయం ఎంతో అవసరం. లేకపోతే ఆహారం ఆక్సీకరణం చెందడం పదార్థాల రవాణా, శక్తి ఉత్పాదకత మొదలైన ప్రక్రియలు చోటుచేసుకోలేవు. అలా జరగనట్లయితే ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్న జీవ వ్యవస్థలన్నీ నిలిచిపోతాయి.





## కీలక పదాలు

**గ్రీలిన్, లెప్టిన్, రుచి గ్రాహకాలు, రసాయన గ్రాహకాలు, రుచిమొగ్గలు, ఆహార బోలస్, పెరిస్టాలసిస్, కైమ్, సంవరిణీ కండరం, సూక్ష్మచూషకాలు, మజ్జాముఖం, మెదడు కాండం, నాడీవ్యవస్థ.**



## మనం ఏం నేర్చుకున్నాం?

- ఆహారం సరిగా జీర్ణమై శోషణ జరిగి శక్తిని విడుదలచేసే ప్రక్రియలకు మనం తీసుకున్న ఆహారం చిన్నచిన్న రేణువుల రూపంలోకి విడగొట్టబడాలి.
- మానవ జీర్ణ వ్యవస్థలో కండర మరియు నాడీ వ్యవస్థలు రెండూ పాల్గొంటాయి.

- జీర్ణ వ్యవస్థలోని ప్రత్యేక నాడీ వ్యవస్థలో 100 మిలియన్ల నాడీ కణాలు ఉంటాయి. ఇవి కండర సంకోచాలు, రక్త ప్రసరణ, జీర్ణక్రియ మరియు పోషకాల శోషణ, ఆహారనాళంలోని ఇతర క్రియలను సమన్వయపరుస్తాయి.
- జీర్ణాశయంలో స్రవించబడే గ్రీలిన్ అనే హార్మోన్ ఆకలి కోరికల ప్రచోదనాలను కలిగిస్తుంది. లెప్టిన్ అనే మరో హార్మోన్ ఆకలిని అణచివేస్తుంది.
- నాలుకను అంగిలికి, నొక్కడం వలన సులభంగా రుచిని గుర్తుపట్టగలం.
- రుచి, వాసన దగ్గర సంబంధం కలిగి ఉంటాయి. ముక్కు మరియు నాలుకపైనున్న రసాయన గ్రాహకాలు సంకేతాలను నాడీ ప్రచోదనాల రూపంలో మెదడుకు చేరవేస్తాయి. తద్వారా వాసన, రుచిని గుర్తించగలుగుతాం.
- స్రవించబడిన లాలాజలం క్షార మాధ్యమాన్ని కలిగి ఉండి పిండిపదార్థాల జీర్ణక్రియలో తోడ్పడుతుంది. స్వయంచోదిత నాడీ వ్యవస్థ నియంత్రణలో లాలాజల గ్రంథుల నుండి విడుదలైన లాలాజలం ఆహారాన్ని తేమగా చేయడం వలన నమలడం, మింగడం సులభమవుతుంది. నోటిలో స్రవించే ఆమ్లాలు హానికర బాక్టీరియానుండి నోటిని కాపాడతాయి.
- నోటి కుహరంలో గల కండరయుత భాగమే నాలుక. ఇది రుచి తెలుసుకునే అవయవం మాత్రమే కాకుండా నోటి కుహరంలో ఆహారాన్ని కదిలించడం, కలుపడం, మింగడం వంటి పనులను కూడా నిర్వహిస్తుంది.
- మింగే ప్రక్రియకు సంబంధించిన సమన్వయం మెదడు కాండంలోని చర్యా కేంద్రం ఆధీనంలో ఉంటుంది.
- జీర్ణనాళం యొక్క కండరాల సంకోచ సడలికల వలన తరంగాల్లాంటి చలనం ఏర్పడి ఆహారాన్ని ముందుకు నెట్టే క్రియను 'పెరిస్టాలసిస్' అంటాం. ఈ కండర తరంగం జీర్ణనాళం అంతటా ప్రయాణిస్తుంది.
- అనియంత్రితంగా జరిగే ఈ 'పెరిస్టాలసిస్'ను స్వయంచోదిత నాడీ వ్యవస్థ మరియు జీర్ణ నాడీ వ్యవస్థ నియంత్రిస్తాయి.
- జీర్ణాశయపు కండర సంకోచాల మూలంగా జీర్ణాశయంలోని ఆహారం చిలుకబడి ఏర్పడే అర్థఘన పదార్థమే కైమ్.
- ఆంత్రమూలంలో 'కైమ్' ప్రవేశాన్ని నియంత్రించే కండరాన్ని పైలోరిక్ లేదా సంవరిణీ కండరం అంటాం.
- బలమైన ఆమ్లమైన HCl జీర్ణాశయంలోని pHను ఆమ్లయుతంగా ఉంచుతూ ప్రోటీన్లను జీర్ణం చేసే ఎంజైమ్ చర్యలకు తోడ్పడుతుంది.
- జీర్ణాశయంలోని జీర్ణరసాలు ఆహారాన్ని జీర్ణం చేసి మెత్తని మిశ్రమంగా మారుస్తాయి. దానినే కైమ్ అంటారు.
- జీర్ణాశయం స్రవించే ఆమ్లాల వలన దానికి హాని జరగకుండా జీర్ణాశయ గోడల్లోని శ్లేష్మస్తరం రక్షిస్తుంది.
- ఆహారాన్ని కొరకడానికి, నమలడానికి దవడను పైకి, కిందకు, వెనుకకు, ముందుకు కదిపి ఆహారాన్ని విసరడంలో దవడ ఉపరితల కండరాలు మరియు దవడ అంతర భాగంలోని కండరాలు తోడ్పడుతాయి.
- చిన్నప్రేవులోని ఆంత్రచూషకాలు ఉపరితల వైశాల్యాన్ని పెంచి పోషకాలను గ్రహించడంలో తోడ్పడుతుంది.
- జీర్ణ వ్యవస్థలోని ప్రత్యేక నాడీ వ్యవస్థను సాంకేతికంగా జీర్ణాంతర నాడీ వ్యవస్థ అంటారు. దీనిని రెండవ మెదడు అని కూడా పిలుస్తారు.
- పెద్ద ప్రేవు నుండి వ్యర్థాలను మలం రూపంలో పాయువు నుండి బయటకు పంపడాన్ని పాయువు వద్దనున్న బాహ్య పాయువు సంవరిణీ కండరం మరియు అంతర పాయువు సంవరిణీ కండరం నియంత్రిస్తాయి.
- ఆహారపదార్థాల ఆక్సీకరణ, రవాణా మరియు వినియోగం కొరకు జీర్ణక్రియ, శ్వాసక్రియ, రక్తప్రసరణ వంటి జీవ క్రియల మధ్య సమన్వయం అవసరం. ఆయా ప్రక్రియలు సరిగా నిర్వర్తించడానికి కండర మరియు నాడీ నియంత్రణలు తోడ్పడతాయి.



## అభ్యసనాన్ని మెరుగుపరచుకుందాం

1. ఆకలి కోరిక అంటే ఏమిటి?(AS1)
2. మనం తిన్న ఆహారాన్ని జీర్ణం చేయడానికి శరీరంలోని ఏయే వ్యవస్థలు తోడ్పడతాయి?(AS1)

3. ఆహార పదార్థాల వాసన ఆకలిని పెంచుతుందని రఫి అన్నాడు. అతని వ్యాఖ్య సరైనదేనా? ఎలా?(AS1)
4. పెరిస్టాలసిస్ మరియు సంవరిణీ కండరాల గురించి రాయండి.(AS1)
5. కింద ఇచ్చిన జీర్ణవ్యవస్థలోని భాగాన్ని పరిశీలించండి. ఇది ఏమిటి? ఇది నిర్వర్తించే పనులను రాయండి.(AS1)


ప్రశ్న-5

6. కింది వానికి తగిన కారణాలు తెలపండి.(AS1)
   (ఎ) నాలుకతో అంగిలిని నొక్కిపట్టుట ద్వారా రుచిని త్వరగా తెలుసుకోగలం.
   (బి) ఆహార పదార్థాలు వేడిగా ఉన్నప్పుడు రుచి తెలియదు.
   (సి) రక్తంలో గ్లూకోజ్ స్థాయి తగ్గినపుడు మనకు ఆకలి వేస్తుంది.
   (డి) చిన్నప్రేగు చుట్టుకొని ఉన్న పైపు మాదిరిగా ఉంటుంది.
7. కింది వాని మధ్యలో ఉండే భేదాలను రాయండి.(AS1)
   (ఎ) బోలస్-కైమ్ (బి) చిన్నప్రేగు-పెద్దప్రేగు (సి) మాస్టికేషన్-రుమినేషన్ (డి) మెదడు-రెండవ మెదడు
8. మీ నోరు ఒక నమిలే యంత్రం. అని ఎలా చెప్పగలవు?(AS1)
9. మాస్టికేషన్ అంటే ఏమిటి? అందుకు తోడ్పడే వివిధ రకాల దంతాలను గురించి వివరించండి.(AS1)
10. ఆహారపదార్థాలు నోటి నుండి ఆహారవాహిక ద్వారా జీర్ణాశయాన్ని చేరే మార్గంలో కండర వ్యవస్థ నియంత్రణ ఏ విధంగా పనిచేస్తుంది?(AS1)
11. చిన్నప్రేగు చుట్టుకొని అనేక ముడుతలుగా ఉండటానికి గల కారణమేదైనా ఉందా? జీర్ణక్రియకు అదేవిధంగా తోడ్పడుతుంది?(AS1)
12. కింది భాగాలలో పెరిస్టాలిసిస్ విధులను తెలుపండి.(AS1)
    (ఎ) ఆహారవాహిక (బి) జీర్ణాశయం (సి) చిన్నప్రేగు (డి) పెద్దప్రేగు
13. జీర్ణనాడీ వ్యవస్థను రెండవ మెదడుగా పరిగణించడం ఎంతవరకు సమంజసం?(AS1)
14. ఆహారపదార్థాలను చూసినవెంటనే రాజేష్ ఆకలిగా ఉందన్నాడు. షీలా తనకు ఆకలిగా లేదన్నది. దేనివలన రాజేష్‌కు ఆకలివేయడం. షీలాకు ఆకలి వేయకపోడం జరిగింది?(AS2)
15. రుచి మరియు వాసన ఏవిధంగా సంబంధం కలిగి ఉన్నాయి?(AS2)
16. ఆహారపదార్థాల చలనంలో మీకు పరిశీలించిన కండర సంవరణీలు ఏమిటి? వాటి గురించి క్లుప్తంగా వివరించండి.(AS1)
17. లాలాజల గ్రంథుల నాళాలు మూసుకొనిపోతే ఏమవుతుంది?(AS2)
18. జీర్ణక్రియలో ఇమిడి ఉన్న నాడుల సమన్వయాన్ని అర్థం చేసుకోవడానికి ఒక ప్రశ్నావళిని తయారుచేయండి.(AS2)
19. చిన్నప్రేవుల ఆకారం, పొడవు ఆహారనాళం మాదిరిగానే ఉంటే ఏం జరుగుతుంది?(AS2)
20. లాలాజలం యొక్క చర్యను అర్థం చేసుకోడానికి పిండిపై ఎలాంటి ప్రయోగం చేశారు? ప్రయోగ పద్ధతిని మరియు పరికరాలను గురించి వివరించండి.(AS3)
21. రుచిని గుర్తించుటలో అంగిలి యొక్క పాత్రను నిర్ధారించేలా ఒక చిన్న ప్రయోగాన్ని సూచించండి.(AS3)
22. మీ పాఠశాల గ్రంథాలయం నుండి ఆకలికి సంబంధించిన సమాచారాన్ని మరియు చిత్రాలను సేకరించి ఒక నివేదిక తయారుచేయండి.(AS4)
23. ఆహారపదార్థాల నుండి రుచి సంవేదన మెదడుకు చేరే క్రమాన్ని బ్లాక్ చిత్రం గీసి చూపండి.(AS5)
24. ఆహారవాహికలో పెరిస్టాలిక్ కదలికలను చూపే చిత్రం గీసి, భాగాలను గుర్తించండి. ఆహారవాహిక లోపలి తలంలోని శ్లేష్మస్తరం యొక్క ఆవశ్యకతను వివరించండి.(AS5)

25. చిన్నప్రేగులోని ఆంత్ర చూషకాల నిర్మాణాన్ని తెలిపే చిత్రం గీయండి. జీర్ణవ్యవస్థ, రక్తప్రసరణవ్యవస్థలలో గల సహసంబంధాన్ని వివరించండి.(AS5)
26. ఆహారపదార్థాల వాసన లేదా వాటిని చూసినవెంటనే ఆకలి ప్రేరేపించబడుతుంది. దీనిని సూచించే చిత్రాన్ని గీయండి.(AS5)
27. నోటి నుండి జీర్ణాశయం వరకు ఆహారపదార్థాల కదలికలను చూపే పటాన్ని గీయండి. ఆహార కదలికలకు ఏ ఏ నాడులు, కండరాలు తోడ్పడతాయి.(AS5)
28. పావ్‌లోవ్ ప్రయోగాన్ని ప్రతిబింబించేలా ఒక కార్టూన్‌ని గీసి, దానికి సరిపోయేలా ఒక నినాదాన్ని రాయండి.(AS6)
29. విసిరే యంత్రమైన జీర్ణాశయాన్ని మీరు ఎలా అభినందిస్తారు? ఈ ప్రక్రియ ఎలా సమన్వయం చేయబడుతుంది.(AS6)
30. ఎంతో వైవిధ్యంతో కూడిన జీవ ప్రక్రియలను గురించిన మీ భావాలతో ఒక కవితను రాయండి.(AS7)
31. ప్రస్తుత పాఠ్యాంశాన్ని దృష్టిలో పెట్టుకొని, ఆహారం తీసుకొనే సమయంలో అలవాటు చేసుకోవాల్సిన ఏ రెండు అంశాలను గురించి మీ మిత్రునికి సలహా ఇస్తారు?(AS7)

## కింది ఖాళీలను పూరించండి

1. మన దంతాల అమరిక నిష్పత్తి 2 : 1 : 2 : 3 అయితే దీనిలో 1 దేనిని సూచిస్తుందంటే ________________.
2. మాంసకృత్తుల దీర్ఘ శృంఖలాలు జీర్ణవ్యవస్థ ________________ భాగంలో విచ్ఛిన్నం చేయబడతాయి.
3. జీర్ణక్రియంలో స్రవించబడే బలమైన ఆమ్లం ________________.
4. ________________ లో ఉండే ఘ్రాణగ్రాహికలు మెదడుకు సమాచారాన్ని చేరవేస్తాయి.
5. లాలాజలం యొక్క pH స్వభావం ________________.
6. కింది పేరా చదవండి. సరైన పదాలతో ఖాళీలు పూరించండి.

(1) ________________ హార్మోన్ స్థాయిలో హెచ్చుతగ్గుల ఫలితంగా ఆకలిలో భేదాలు మరియు ఆహార పదార్థాల వినియోగం ఆధారపడి ఉంటాయి. జీర్ణాశయం నిండి ఉన్న భావన ఉంటే మరి ఆహారం తీసుకోవాలని అనిపించదు. మరొక హార్మోన్ (2) ________________ స్రవించబడితే ఆకలిని తగ్గించివేస్తుంది. మనం ఆహారాన్ని తీసుకొన్నప్పుడు నోటిలో చక్కగా నమలటం జరుగుతుంది. దీనికొరకు (3) ________________ కండరాలు నమిలే ప్రక్రియకు తోడ్పడుతాయి. అయితే (4) ________________ దవడల కండరాలు, దవడలు పైకి, కిందకు ముందుకు, వెనకకు కదలడానికి లేదా నమలడానికి (entric nervous system) తోడ్పడతాయి. (5) ________________ నాడులు దవడల కండరాల కదలికలను నియంత్రిస్తాయి.

(6) ________________ నాడీవ్యవస్థ కారణంగా లాలాజలం ఉత్పత్తికావటం, లాలాజలంతో ఆహారాన్ని కలపటం, నమలడం మరియు సులువుగా మింగడం జరుగుతాయి. లాలాజలంలోని (7) ________________ పిండిపదార్థాలను చక్కెరలుగా మార్చును. దాని ఫలితంగా ఆహారాన్ని నమలడం మరియు మింగడం వలన ఆహారవాహిక చేరటం (8) ________________ మరియు (9) ________________ వలన నియంత్రించబడతాయి. నాలుక రుచిగ్రాహకం కనుక రుచిన గ్రహించుటలో (10) ________________ నాడి ముఖ్యమైనది.

1. లెప్టిన్, గ్రీలిన్, గాస్ట్రిన్, సిక్రిటిన్
2. గ్రీలిన్, లెప్టిన్, సెక్రిటిన్, గాస్ట్రిన్
3. అంతర్గత కండరాలు ఉపరితల కండరాలు, వలయ కండరాలు, నిలువు కండరాలు
4. ఉపరితల కండరాలు, అంతర్గత కండరాలు, మెడ కండరాలు, పొడవైన కండరాలు

5. 5వ కపాల నాడి, 2వ కపాల నాడి, 5వ ముఖ నాడి, వెన్ను నాడి
6. కేంద్రనాడీ వ్యవస్థ, ఉపరితల నాడీవ్యవస్థ, స్వతంత్ర నాడీ వ్యవస్థ
7. లైపేజ్, సుక్రేజ్, గాలక్టేజ్, అమైలేజ్
8. మెడుల్లా అబ్లాంగేటా, సెరిబ్రమ్, 8వ వెన్నునాడీ, కపాల నాడీ, 7వ కపాల నాడీ
9. మెదడు కాండం, మెడుల్లా అబ్లాంగేటా, మధ్యమెదడు, ఫాన్స్ వెరోలి.
10. 6వ కపాలనాడీ, 5వ కపాల నాడీ, 10వ కపాలనాడీ, దృక్‌నాడీ

## సరైన సమాధానాన్ని గుర్తించండి

7. కింది ఏ సందర్భంలో అతిత్వరగా రుచి చూడగలుగుతావు. ( )
   (ఎ) నాలుకపై చక్కెర వేసుకొన్నపుడు (బి) నాలుకపై చక్కెర ద్రావణాన్ని పోసినపుడు
   (సి) నాలుకలో అంగిలి నొక్కిపట్టినపుడు (డి) నమలకుండా, కదపకుండా వెంటనే మింగినపుడు
8. పెరిస్టాలిసిస్ చలనం ఎందుకంటే ( )
   (ఎ) నిలువు కండరాల సంకోచం వలన (బి) వలయం కండరాల సంకోచం వలన
   (సి) స్వయంచోదిత నాడీవ్యవస్థ నియంత్రణ వలన (డి) జీర్ణరసాల ప్రభావం వలన
9. జీర్ణాశయం, ఆంత్రమూలంలోనికి తెరచుకునే చోట ఉండే సంవరిణీ కండరం ( )
   (ఎ) కార్డియాక్ (బి) పైలోరిక్ (సి) ఆనల్ (డి) గాస్ట్రిక్
10. ఆంత్రచూషకాలలోని ఏ భాగం ద్వారా గ్లూకోజ్ మరియు అమైనో ఆమ్లాల శోషణ జరుగును ( )
    (ఎ) ఎపిథీలియల్ కణాలు (బి) రక్త కేశనాళికలు (సి) శోషరస నాళాలు (డి) పైవన్నీ
11. ఆకలి సూచనలకు నియంత్రించే మెదడులోని భాగం ( )
    (ఎ) మెడుల్లా (బి) డై ఎన్‌సెఫలాన్ (సి) సెరిబ్రమ్ (డి) మధ్య మెదడు
12. మానవులు "అంతర్గత దహన యంత్రం" వంటివారు. ఎందుకంటే ( )
    (ఎ) ఆహార పదార్థాలు జీర్ణమై శక్తి విడుదలవుతుంది (బి) శ్వాసక్రియ ద్వారా $CO_2$ వెలువరిస్తారు
    (సి) జీర్ణక్రియ చివరి దశలో వ్యర్థాలను విసర్జిస్తారు (డి) శక్తివంతమైన జీర్ణరసాలను స్రవిస్తారు



## అనుబంధం

### మానవ జీర్ణక్రియలో మరిన్ని సత్యాల ఆవిష్కరణకు దారితీసిన చారిత్రాత్మక రుజువు

#### కడుపులో కిటికీ

ఒకరోజు తెల్లవారుజామున మిషిగాన్ ద్వీపకల్పంలోని ఫోర్ట్ మాకినాక్‌లో నివసించే 19 సంవత్సరాల అలెక్స్ సెయింట్ మార్టిన్ అనే సైనికుడికి ప్రమాదవశాత్తు తుపాకి పేలి కడుపులో బుల్లెట్ గాయం అయింది. ఉదరభాగం గోడలను జీర్ణాశయాన్నీ తొలుచుకుంటూ పెద్ద గాయమైంది. తీవ్రమైన రక్తస్రావం జరుగుతోంది. వెంటనే సైనిక వైద్యుడు డా॥ బీమాంట్‌ను చికిత్స కోసం పిలిపించారు. ఆయన గాయాన్ని శుభ్రపరిచి బయటకు వచ్చిన ఊపిరితిత్తులు మరియు జీర్ణాశయ భాగాలను లోపలికి నెట్టి గాయానికి కట్టుకట్టాడు. మార్టిన్ బతకడం చాలా కష్టమని డాక్టర్ భావించాడు. మరుసటి రోజు సెయింట్ మార్టిన్ జీవించి ఉండటాన్ని చూసి డా॥ బీమాంట్ ఆశ్చర్యపోయాడు. తనకున్న వైద్య పరిజ్ఞానం,

నైపుణ్యాన్ని ఉపయోగించి గాయానికి చికిత్స చేస్తూ సాధ్యమైనంతవరకు అతని జీవితకాలాన్ని పెంచే ప్రయత్నం చేశాడు. దాదాపు రెండు సంవత్సరాల చికిత్స అనంతరం గాయం పూర్తిగా మానింది. కానీ అతని జీర్ణాశయం శరీర గోడలతో కలిసిపోవడం వలన ఒక పెద్ద రంధ్రం ఏర్పడింది. గాయాంలోని కొంత భాగం సహజ కవాటాన్ని పోలిన ఒక మూతలా ఏర్పడింది. దీని ద్వారా సెయింట్ మార్టిన్ జీర్ణాశయంలో జరిగే చర్యలను చూడగలిగాడు. డా॥ బీమాంట్ మార్టిన్‌ను ఎడమవైపుకు తిప్పి రంధ్రం గుండా ఐదారు అంగుళాల పొడవుగల గొట్టాన్ని కడుపులోకి పంపి జీర్ణరసాలను సేకరించాడు. దానిలోని అంశాలను గుర్తించే ప్రయత్నం చేశాడు. ఆహారపదార్థానికి దారంకట్టి రంధ్రం గుండా జీర్ణాశయంలోకి వదిలేవాడు. దాన్ని కొంతసేపు కడుపులోనే ఉంచి పాక్షికంగా జీర్ణం అయిన తరువాత దానిపై పరిశోధనలను చేసేవాడు. ఇలా ఎన్నో ప్రయోగాలు చేసి జీర్ణక్రియకు సంబంధించి అనేక కొత్త విషయాలను కనుగొన్నాడు.

అప్పటివరకు జీర్ణాశయం గురించి మనం తిన్న ఆహారాన్ని ఉడికించి వేడిని కలిగిస్తుందనీ యంత్రంలాంటిదని పులియబెట్టె కుండలాంటిదనీ రకరకాలుగా భావించేవారు. డా॥ బీమాంట్ ప్రయోగాలు జీర్ణక్రియ గురించి అప్పటివరకు ఉన్న అభిప్రాయాలన్నింటిని పటాపంచలు చేశాయి. 1882వ సంవత్సరం జూన్ 16వ తేదీన ఆయన తన పరిశోధనల సారాంశాన్ని ప్రకటించాడు. ఇది వైద్యరంగంలో నూతన పరిశోధనలకు నాంది పలికింది.

### డా॥ బీమాంట్ తన పరిశోధనలతో తెలుసుకున్న విషయాలు

- ఆహారం జీర్ణమవుతున్న సమయంలో జీర్ణాశయంలోని ఉష్ణోగ్రతలో ఎలాంటి మార్పు లేకుండా స్థిరంగా ($100^0$ F/ $38^0$ C) ఉంటుంది.
- జఠర రసంలో నీరు కాకుండా అధిక పరిమాణంలో హైడ్రోక్లోరిక్ ఆమ్లం ఉంటుంది.
- జఠరరసం జీర్ణాశయంలో నిలువ చేయబడదు. ఆహారం జీర్ణాశయంలోకి చేరినపుడు మాత్రమే స్రవిస్తుంది.
- ఆహారం జీర్ణాశయంలో చేరగానే జీర్ణక్రియ మొదలవుతుంది.
- ఆహారం నోటిద్వారా తీసుకోకపోయినా జీర్ణాశయంలోకి ఆహారం చేరికతో ఆకలి తీరుతుంది. (రంధ్రం ద్వారా ఆహారాన్ని లోపలికి పంపేవాడు.)

వైద్యరంగంలో జీర్ణక్రియకు సంబంధించి కొత్త విషయాల మొట్టమొదటి ఆవిష్కరణలు అయినప్పటికీ డా॥ బీమాంట్ ప్రయోగాల ఫలితాలు, ఆకలి కావడానికి గల కారణమేమి? జీర్ణనాళంలో జరిగే విషయాలు మెదడుకు ఎలా తెలుస్తుంది? ఏ కారణంతో జీర్ణరసాలు స్రవించబడతాయి? ఆహారం జీర్ణరసాలతో కలిసే విధంగా ఏం సహాయపడుతుంది? జీర్ణప్రక్రియ స్వతహాగా జరుగుతుందా? లేదా నాడీ, కండర వ్యవస్థలు వంటి ఇతర వ్యవస్థలు కూడా పాల్గొంటాయా? లాంటి మరెన్నో కొత్త ప్రశ్నలకు దారి తీసింది. వైద్యరంగంలో నూతన పరిశోధనలకు దోహదపడింది.

### వాంతులు, త్రేన్పులు (Vomiting - Belching)

*ఒకవేళ మనం చెడిపోయిన లేదా శరీరానికి సరిపడని ఆహారపదార్థాలు తిన్నప్పుడు జీర్ణక్రియా యంత్రాంగం దాన్ని గుర్తుపట్టి జీర్ణం చేయడానికి నిరాకరిస్తుంది. అనియంత్రిత నాడీవ్యవస్థ అధీనంలో పనిచేసే జీర్ణాశయ గోడలలో అలజడి ఏర్పడి, జీర్ణంకాని ఆహారంతోపాటు 'కైమ్'ను కూడా బయటకు నెట్టివేస్తుంది. దీనినే మనం వాంతులుగా పరిగణిస్తాం. ఒక్కోసారి హఠాత్తుగా వాంతులు, త్రేన్పులు (belching) వస్తుంటాయి. అప్పుడప్పుడు త్రేన్పులతోపాటు కొంత ద్రవం జీర్ణాశయం నుండి పైకి కదిలి ఆహారవాహిక ద్వారా నోటిలోనికి చేరుతుంది. ఇలా జరిగిన వెంటనే ఛాతీ భాగంలో (ఆహారవాహిక) గొంతులో మంట ఏర్పడుతుంది. జీర్ణాశయం నుండి ఆమ్లాలు పైకి ఉబికి ప్రవహించడం వల్ల ఇలా జరుగుతుంది. జీర్ణాశయ ప్రతిచర్యలకు దీనిని ఒక ఉదాహరణగా చెప్పవచ్చు. ఇలాంటి కండర సంకోచాలు అనియంత్రితంగా స్వయంచోదిత నాడీవ్యవస్థ ఆధీనంలోని పదవ కపాలనాడి ద్వారా నియంత్రించబడతాయి.*

పాఠం

8

# అనువంశికత పరిణామం



మనచుట్టూ ఉన్న విశాల ప్రపంచాన్ని పరిశీలించినట్లయితే లెక్కించలేనన్ని జీవరాశులు కనిపిస్తాయి. ఈ జీవరాశిలో రెండు విషయాలు మనల్ని అత్యంత ఆశ్చర్యానికి గురిచేస్తాయి. ఒకవైపు ప్రాణికోటిలో ఉండే అద్భుతమైన వైవిధ్యం, పరిశీలించిచూస్తే మరోవైపు వాటిమధ్య ఉండే సారూప్యాలు చాలా చిత్రంగా అనిపిస్తాయి. జీవులు ఎలా పరిణామం చెందాయో అర్థం చేసుకోవాలంటే ఈ వైవిధ్యాలను, సారూప్యాలను అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. ఏదైనా ఒక జీవజాతిలో పరిణామం జరిగింది అని అంటే అది కేవలం మార్పును కాకుండా మార్పుకు దారితీసిన అంశాలనుకూడా తెలియజేస్తుంది. అయితే ఈ పరిణామం ఎలా చోటుచేసుకుంటుంది? ఇది నెమ్మదిగా, స్థిరంగా జరుగుతుందా లేక హఠాత్తుగా ఉన్నపళంగా జరుగుతుందా? పరిణామం కొత్త జీవులను లేదా భిన్నమైన వాటిని రూపొందించడానికి మాత్రమే పరిమితమైనదా? 'ప్రత్యుత్పత్తి' పాఠంలో ప్రత్యుత్పత్తి ప్రక్రియ ద్వారా సాధారణంగా పుట్టే జీవులు తల్లిదండ్రుల లక్షణాలను పొందడంతోపాటూ కొన్ని కొత్త లక్షణాలు కూడా పెంపొందుతాయని నేర్చుకున్నాం కదా! తరువాత జరిగే ఇలాంటి కొత్త మార్పులే జీవరాశిలో వచ్చే గుర్తింపదగిన కొత్త లక్షణాలకు దారితీస్తాయి.

- కొత్త లక్షణాలు ఎలా ఉత్పన్నమవుతాయి?
- పరిణామంలో తల్లిదండ్రుల నుండి అవి వారసత్వంగా వస్తాయా?
- పరిణామంలో వీటి పాత్ర ఏమైనా ఉంటుందా?

ఈ పాఠంలో పై విషయాలన్నింటిని చర్చిద్దాం.

## కొత్త లక్షణాలు - వైవిధ్యాలు (New Characters and variations)

ఒక్కసారి మీ కుటుంబం గురించి ఆలోచించండి. మీ అమ్మానాన్నలకు నీకు ఏ ఏ లక్షణాలలో పోలికలున్నాయి? మీరు గమనించిన అంశాలతో పట్టిక రాయండి. కంటిపాప రంగు, జుట్టు ఆకారం, జుట్టురంగు, ముక్కు, ముఖం, చెవి తమ్మె, బొటనవేలి ముద్ర, ఇలా మీరు గుర్తించగలిగినన్ని అంశాలతో జాబితా రూపొందించండి. పట్టికలో ఒకవైపు నీలో ఉన్న లక్షణాలు మరొకవైపు అవి అమ్మను పోలి ఉన్నాయా, నాన్నను పోలి ఉన్నాయా రాయండి.

- ఎన్ని లక్షణాలలో నీవు మీ తల్లిదండ్రులను పోలి ఉన్నావు?
- మీ తల్లిదండ్రుల ఇరువురిలో లేకుండా నీలో మాత్రమే కనిపిస్తున్న పోలికలు ఏవైనా ఉన్నాయా? అవి ఏమిటి?
- అవి ఎక్కడి నుండి వచ్చి ఉంటాయని నీవు భావిస్తున్నావు?

ఈ విషయాల గురించి తెలుసుకోడానికి ఒక కృత్యం చేద్దాం.

## కృత్యం-1

నీలో ఉన్న లక్షణాలను మీ తల్లిదండ్రులు, అన్నలో, చెల్లిలో మరియు అమ్మమ్మ, నానమ్మ, తాతయ్యలతో పోల్చి పట్టికలో రాయండి.

**పట్టిక-1**

| లక్షణం | నాలో ఉన్నది | అమ్మలో ఉన్నది | నాన్నలో ఉన్నది | అన్నలో ఉన్నది | చెల్లిలో ఉన్నది | అమ్మమ్మలో ఉన్నది | నానమ్మలో ఉన్నది | తాతయ్యలో ఉన్నది |
|---|---|---|---|---|---|---|---|---|
| (1) రింగుల జుట్టు | ✓ | × | ✓ | × | × | × | × | × |
| (2) కన్ను రంగు (కనుపాప) | | | | | | | | |

- నీలోనూ, మీ అమ్మలోనూ, మీ అమ్మమ్మలోనూ కనిపించే లక్షణాలు ఏమిటి?
- నీలో, మీ అమ్మమ్మలో కనిపించే లక్షణాలు ఏవి?
- మీ అమ్మమ్మ నుండి ఆ లక్షణాలు నీకు ఎలా సంక్రమించాయని నీవు అనుకుంటున్నావు?
- నీలోనూ, మీ అమ్మలోనూ ఉండి మీ అమ్మమ్మలో కనిపించని లక్షణాలు ఏవైనా ఉన్నాయా?
- మీ అమ్మ ఈ లక్షణాలను ఎక్కడినుండి పొంది ఉంటుందని నీవు అనుకుంటున్నావు?

## కృత్యం-2

మీ తరగతిలో మీ స్నేహితులలో ఎవరైనా ఆరుగురిని ఎంపిక చేసుకోండి. కింది పట్టికలో ఇచ్చిన లక్షణాలను పరిశీలించి రాయండి.

**పట్టిక-2**

| మీ స్నేహితుని పేరు | చర్మం రంగు | చెవి తమ్మెలు (అంటుకుని/ స్వేచ్ఛగా) | బొటనవేలి ముద్ర | నుదురు పొడవు | కనుగుడ్డు రంగు | ఇతర లక్షణాలు |
|---|---|---|---|---|---|---|
| | | | | | | |
| | | | | | | |
| | | | | | | |
| | | | | | | |

- మీలోని లక్షణాలను ఎవరైనా ఒక స్నేహితునితో పోల్చండి. ఎన్ని లక్షణాలు మీలో, మీ స్నేహితునిలో ఒకటిగా ఉన్నట్లు గమనించారు?

- మీలోని లక్షణాలు ఎక్కువగా మీ తల్లిదండ్రులను పోలి ఉంటాయా? మీ స్నేహితులను పోలి ఉంటాయా?
- మీరు మీ తల్లిదండ్రులు, స్నేహితులతో పోల్చుకున్నపుడు ఎవరితో ఎక్కువ భిన్నంగా ఉన్నారు? ఎందుకు?



పటం-1: కంటిపాప రంగు , చెవి తమ్మెలలో వైవిధ్యాలు

దగ్గర సంబంధంగల సమూహాలకు చెందిన జీవుల మధ్యగల లక్షణాలలో ఉండే భేదాలను **వైవిధ్యాలు** అంటారు. ఇలా వచ్చిన కొత్త లక్షణం వైవిధ్యానికి దారితీసి వంశపారంపర్యంగా అందించబడుతుంది.

- *ఈ వైవిధ్యాలన్నీ గుర్తించగలిగేలా ఉంటాయా?*

కొన్ని లక్షణాలు పైకి కనిపించకుండా దాగుకొని మనం గుర్తించలేని విధంగా కూడా ఉంటాయి. (9వ తరగతిలో జీవులలో వైవిధ్యాలు మరియు వర్గీకరణ అనే పాఠంలోని ఒకేరకమైన రెండు మొక్కలు వేప/గరిక (గడ్డిజాతి) పై మీరు చేసిన కృత్యాన్ని గుర్తుతెచ్చుకోండి.)

### కృత్యం-3

బఠాణి లేదా చిక్కుడు కాయలోని విత్తనాలను పరిశీలించండి.

ఒక నిర్ణయానికి రావడానికి (సామాన్యీకరణ కోసం) ఎక్కువ కాయలను, విత్తనాలను పరిశీలించండి.

- *ఒకే రకంగా ఉన్న రెండు విత్తనాలను గమనించగలిగారా?*
- *ఇవి వేరుగా ఉండడానికి కారణమేమి? (విత్తనాలు అండాలనుండి ఏర్పడతాయని మీరు ప్రత్యుత్పత్తి పాఠంలో నేర్చుకున్నారు)*
- *వైవిధ్యాలు ఎందువల్ల ముఖ్యమైనవిగా భావించాలి? ఒక జీవికి లేదా జనాభాకు వైవిధ్యాలు ఏవిధంగా ఉపయోగం కలిగిస్తాయి?*

### మెండల్ అతని ప్రయోగాలు :

శతాబ్దాలుగా వైవిధ్యాలను గురించి, ప్రకృతిలో వాటి పాత్రను గురించి ఎందరో జీవ శాస్త్రవేత్తలు అధ్యయనం చేస్తూనే ఉన్నారు. ముఖ్యంగా 19వ శతాబ్దం మొదట్లో శాస్త్రవేత్తలు ఎంతో శ్రమించారు. వారి కృషి ఫలితంగానే వైవిధ్యాలు ఎలా చోటుచేసుకుంటున్నాయి అవి తరువాతి తరాలకు ఎలా అందించబడుతున్నాయనేది మనం తెలుసుకోగలిగాం. 19వ శతాబ్దంలోనే ఈ విషయంలో ఎన్నో ప్రయోగాత్మక ఋజువులను అందించిన గొప్ప శాస్త్రవేత్త గ్రిగర్ జోహాన్ మెండల్. ఈయనను జన్యుశాస్త్ర పితగా పేర్కొంటారు. అతని కృషి గురించి అధ్యయనం చేద్దాం.

వైవిధ్యాలు ఎలా ఏర్పడతాయి? అవి ఏవిధంగా తరువాతి తరాలకు అందించబడతాయని తెలుసుకోవడం కోసం1857వ సంవత్సరంలో గ్రిగర్ జోహాన్ మెండల్ పరిశోధనలు ప్రారంభించారు. మెండల్ ఆస్ట్రియా దేశానికి చెందిన మత గురువు. ఈయన తన ప్రయోగాలను చేయడానికి ప్రయోగశాలనో లేదా విశ్వవిద్యాలయాన్నో ఎన్నుకోలేదు. తన చర్చి తోటలోనే తన ప్రయోగాలను చేస్తుండేవాడు. ఏడు సంవత్సరాలు కృషి చేసి తన సుదీర్ఘ ప్రయోగాల సమాచారాన్ని, పరిశోధనా సారాన్ని క్షుణ్ణంగా వివరిస్తూ వ్యాసంగా రాసి ప్రచురించాడు.


పటం-2: గ్రిగర్ జోహాన్ మెండల్

## బఠాణి మొక్కను ఎంపిక చేయుటకు గల కారణాలు :

మెండల్ అనేక మొక్కలను పరిశీలించిన తరువాత బఠానీ మొక్కలు ప్రయోగాలకు చాలా అనుకూలమని నిర్ధారణకు వచ్చాడు. బఠాణీ మొక్కలో క్రింది ప్రయోజనాలు ఉండటం వలన ప్రయోగాలు నిర్వహించుటకు అత్యంత అనుకూలమని నిర్ధారణకు వచ్చాడు.

1. స్పష్టమైన లక్షణాలు కలిగి ఉండడం
2. ద్విలింగ పుష్పాలు కలిగి ఉండడం
3. ఆత్మపరాగ సంపర్కం జరపడం
4. సంకరీకరణానికి అనువుగా ఉండడం
5. బఠానీ ఏక వార్షిక మొక్క

బఠానీ మొక్కలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఒక మొక్క ఎన్నో లక్షణాలలో మిగతావాటికన్నా వేరుగా ఉండటాన్ని మెండల్ గుర్తించాడు. ఉదాహరణకు కొన్ని మొక్కలు పొడవుగా ఉంటే,

**పట్టిక - 3 : బఠాణీ మొక్కలలో మెండల్ అధ్యయనం చేసిన 7 జతల పరస్పర వ్యతిరేక లక్షణాలు**

| వ.సం. | లక్షణం | వివరణ |
|---|---|---|
| 1. | పుష్పం రంగు | పుష్పాలు లేత ఊదా రంగులోగాని, తెలుపు రంగులో గాని ఉంటాయి. |
| 2. | పుష్పం ఉండే స్థానం | పుష్పాలు గ్రీవస్థం లేదా శిఖరస్థంగా ఉంటాయి. గ్రీవస్థమైతే కాండం పొడవున గ్రీవాలలో శిఖరస్థమైతే శాఖలు చివర గుత్తులుగా ఉంటాయి. |
| 3. | విత్తనం రంగు | పసుపు లేదా ఆకుపచ్చగా ఉంటాయి. |
| 4. | విత్తనం ఆకారం | గుండ్రంగా లేదా ముడతలు కలిగి ఉంటాయి. |
| 5. | కాయ ఆకారం | పూర్తిగా ఏర్పడిన కాయ నిండుగా, నునుపుగా లేదా నొక్కులు కలిగి ఉంటుంది. |
| 6. | కాయ రంగు | అపరిపక్వ ఫలాలు పసుపు లేదా ఆకుపచ్చరంగులో ఉంటాయి. పరిపక్వ ఫలాలు పసుపు రంగులో ఉంటాయి. |
| 7. | కాండం పొడవు | ఒకే విధమైన వాతావరణంలో పెంచినపుడు కొన్ని మొక్కల కాండం పొడవుగా (సుమారు 6 నుండి 7 అడుగులు) కొన్ని మొక్కల కాండం పొట్టిగా (సుమారు ముప్పావు నుండి ఒకటిన్నర అడుగులు) ఉంటుంది. |

## పట్టిక-3: మెండల్ బఠానీ మొక్కల (ఏక సంకరణం)లో ఎంపిక చేసుకొన్న ప్రధాన లక్షణాలు

| లక్షణం | బహిర్గత లక్షణాంశం | అంతర్గత లక్షణాంశం | F2 తరం | నిష్పత్తి |
|---|---|---|---|---|
| పుష్పం రంగు | ఊదా | తెలుపు | 705 : 224 | 3.15 : 1 |
| పుష్పం ఉన్న స్థానం | గ్రీవస్థం | శిఖరస్థం | 651 : 207 | 3.14 : 1 |
| విత్తనం రంగు | పసుపు | ఆకుపచ్చ | 6022 : 2001 | 3.01 : 1 |
| విత్తనం ఆకారం | గుండ్రని | ముడతలు | 5474 : 1850 | 2.96 : 1 |
| కాయ ఆకారం | చదును | ముడతలు పడిన | 882 : 299 | 2.95 : 1 |
| కాయ రంగు | ఆకుపచ్చ | పసుపు | 428 :152 | 2.82 : 1 |
| కాండం పొడవు | పొడవు | పొట్టి | 787 : 277 | 2.84 : 1 |

కొన్ని పొట్టిగా, కొన్ని గుండ్రటి, పసుపు రంగు విత్తనాలను కలిగి ఉంటే, మరికొన్ని ముడతలు పడి, ఆకుపచ్చగా ఉండే విత్తనాలను కలిగి ఉంటాయి. మెండల్ 7 జతల వ్యతిరేక లక్షణాలు గల బఠానీ మొక్కలను తన అధ్యయనం కోసం ఎన్నుకున్నాడు. పట్టిక-3ను పరిశీలించండి.



**మీకు తెలుసా?**



బఠానీ ఏకవార్షిక మొక్క. ఇది తన జీవిత చక్రాన్ని ఒక సంవత్సరంలో పూర్తిచేస్తుంది. ప్రపంచంలో అనేక ప్రాంతాలలో బఠానీ సులభంగా పెరగగలుగుతుంది. క్రీ.పూ. 2000 సంIIలో ఆఫ్ఘనిస్తాన్‌లో బఠానీ ఉన్నట్లుగా చారిత్రక ఆధారాలున్నాయి. క్రీ.పూ. 2250-1750 కాలంలో హరప్ప ప్రస్తుత పాకిస్తాన్ వాయవ్య భారతదేశ ప్రాంతంలో బఠానీని పండించినట్లుగా రుజువులున్నాయి. అలాగే గంగానదీ పరివాహక ప్రాంతంలోని దక్షిణ భారతదేశంలోని బఠానీ పంట పండించేవారు. దీనిలో విటమిన్ 'ఎ, సి, ఇ, కె మరియు బికాంప్లెక్స్'లు, Ca, Fe, Mg, Mn, P, S మరియు Zn లవణాలు కూడా ఉన్నాయి.

జీవుల విశిష్ట లక్షణాలు (Characters), లక్షణాంశాలు (Traits)గా బహిర్గతం అవుతాయని, ఎల్లప్పుడూ ఒక లక్షణానికి కారణమైన ఒక జత కారకాలను (Factors) కలిగి ఉంటాయని మెండల్ పరికల్పన చేశాడు. అలాగే ప్రత్యేకతలను కలిగించే లక్షణాంశాలు ఒకేరకంగా కలిగిన జీవులు వాని జనాభాలో ఇంకా చాలా ఉంటాయని కూడా మెండల్ భావించాడు. ప్రస్తుతం ఆయా లక్షణాంశాలను చూపే బఠానీ మొక్కల జనకతరంలోనూ అదే లక్షణాలు తప్పక ఉండి ఉంటాయని మెండల్ ఊహించాడు. విత్తనాలు లక్షణాంశాలను తప్పనిసరిగా వాటి జనకతరం నుండి పొంది ఉండవచ్చు.

జనక మొక్కలు తమ లక్షణాంశాలను విత్తనాలకు ఏవిధంగా అందజేస్తాయి? పొడవైన మొక్కలు ఎల్లప్పుడూ పొడవు మొక్కలనే ఉత్పత్తి చేస్తాయా? మెండల్ ఎన్నెన్నో ప్రయోగాలను చేసి పైవిధమైన ప్రశ్నలకు సమాధానాలను స్వయంగా తెలుసుకోడానికి కృషి చేశాడు.




**మెండల్ అనుసరించిన పద్ధతి :**

- మెండల్ వివిధ రకాల మొక్కలను సేకరించి వాటి విత్తనాలతో ఎక్కువ సంఖ్యలో మొక్కలను పెంచాడు.
- మెండల్ తాను ఎంపిక చేసిన మొక్కలలో మొదటగా ఆత్మపరాగసంపర్కం జరగనిచ్చాడు.

- అనేకసార్లు ఆత్మపరాగసంపర్కం జరిపిన తర్వాత వచ్చిన విత్తనాల నుండి తయారైన మొక్కలను ఆయన శుద్ధమైన రకాలుగా పేర్కొన్నాడు.
- ఆ విధంగా మెండల్ శుద్ధరకాలను ప్రయోగాలకు ఎన్నుకొని మొక్కలు ఎదిగి పుష్పించిన తరవాత బొమ్మలో చూపిన విధంగా వాటిలో పరపరాగసంపర్కం చేపట్టేవాడు.




శుద్ధ పసుపు రంగు విత్తనాలు గల మొక్కను శుద్ధ ఆకుపచ్చ రంగు విత్తనాలు కల్గిన మొక్కతో పరపరాగ సంపర్కం జరిపినప్పుడు ఈ క్రింది ఫలితాలు వచ్చాయి.

**F1 తరం (first filial /F1-generation) మొదటి సంతతితరం :** ఈ తరంలో మొక్కలన్నీ పసుపు రంగు విత్తనాలనే కలిగి ఉన్నాయి. వీటిలో ఆత్మపరాగ సంపర్కం జరిగినప్పుడు ఈ క్రింది ఫలితాలు వచ్చాయి.

**F2 తరం (రెండవ తరం) (second filial / F2-generation):** ఈ తరంలో దాదాపు 75 శాతం పసుపు విత్తనాలు గల మొక్కలు మరియు 25 శాతం ఆకుపచ్చ విత్తనాలు గల మొక్కలు ఏర్పడ్డాయి. అనగా ఇవి 3 : 1 నిష్పత్తిలో ఉన్నాయి.

పై ఫలితాల ఆధారంగా మెండల్ ఈ క్రింది అంశాలను గమనించాడు :

1. రెండవ తరం (F2) తరంలో 25% మొక్కలు పసుపు రంగు విత్తనాలను ఉత్పత్తి చేసినాయి (సమయుగ్మజపు బహిర్గత) లక్షణం కేవలం ఆత్మపరాగ సంపర్కం జరిపినపుడు పసుపు రంగు వచ్చింది.
2. రెండవ తరంలో 50% మొక్కలు విషమయుగ్మజానికి బహిర్గత లక్షణం కల్గి ఉండి ఆత్మపరాగ సంపర్కం జరిపినప్పుడు పసుపు ఆకుపచ్చ విత్తనాలు కల్గిన మొక్కలను 3:1 నిష్పత్తిలో ఉత్పత్తి చేశాయి.
3. రెండవ తరంలో 25% మొక్కలు ఆకుపచ్చ రంగు విత్తనాలు కల్గి, ఆత్మపరాగ సంపర్కం జరిపినప్పుడు కేవలం ఆకుపచ్చ రంగు విత్తనాలు కల్గిన మొక్కలను ఉత్పత్తి చేశాయి. (సమయుగ్మజ అంతర్గత)

పై విధమైన పరిశీలనల నుండి మెండల్ కొన్ని అంశాలను పరికల్పన చేశాడు.




**మొదటి పరికల్పన:** ప్రతి బఠానీ మొక్క ప్రతి ప్రత్యేక లక్షణాంశానికి రెండు కారకాలను కలిగి ఉంటుంది. ఇలా లక్షణాన్ని కలిగించడానికి కారణమైన దానిని కారకం (factor) అంటారు. మెండల్ అతి జాగ్రత్తగా శుద్ధజాతులను మాత్రమే ప్రయోగాల కోసం ఎన్నుకున్నాడు. మన ఉదాహరణలో తీసుకొన్న పసుపు, ఆకుపచ్చ బఠానీలు శుద్ధమైన జనకతరం (parental generation). పసుపురంగు లక్షణాన్ని కలిగించే రెండు కారకాలూ ఒకే రకానికి చెందినవై ఉంటాయన్నమాట. అంటే శుద్ధజాతి (జనకతరం) పసుపురంగు విత్తనాలనుత్పత్తి చేస్తుందంటే దానిలో రెండు కారకాలూ ఒకే రకానికి చెందినవిగా ఉంటాయి. వాటినే 'YY' అని పిలుద్దాం.

మరొక శుద్ధజాతి (జనకతరం) ఆకుపచ్చ రంగు విత్తనాలనుత్పత్తి చేస్తుందంటే దానిలో గల రెండు కారకాలూ ఒకే రకానికి చెందినవై ఉంటాయి. వాటిని 'yy' గా సూచిద్దాం.

YY మరియు yy లో ఒకే విధమైన కారకాలు ఉండటం వలన వీటిని సమయుగ్మజాలు అంటారు. Yy కారకాలు కల్పినప్పుడు (Yy) దానిని విషమయుగ్మజం అంటారు.

**రెండవ పరికల్పన:** ప్రత్యుత్పత్తి ఫలితంగా సంతతిలోని రెండు కారకాలు ఒక్కో జనకుని నుండి ఒక్కొక్కటి పొందుతాయి.

**మూడవ పరికల్పన:** సంతతికి లభించిన రెండు విభిన్న కారకాలలో ఒక కారకం మాత్రమే బహిర్గతమవుతుంది. మరో రకం అంతర్గతంగా ఉండిపోతుంది. అంటే Y (పసుపు రంగుకు కారణమైన కారకం) బహిర్గత కారకం అయితే, Yy అనే రెండు కారకాలున్నప్పటికీ Y కారకం ఆధిక్యత వలన పసుపు రంగు మాత్రమే బహిర్గతమవుతుంది. అందువల్ల ఆ బఠానీ మొక్క విత్తనాలు పసుపు రంగులోనే ఉంటాయి.



జనక తరం పరాగ సంపర్కం

F1 తరంలో బయటికి వ్యక్తమయ్యే లక్షణాన్ని బహిర్గత లక్షణాంశం (dominant trait) అనీ, పైకి కనిపించని లక్షణాన్ని అంతర్గత లక్షణాంశం (recessive trait) అని అంటారు.

రెండవ పరికల్పన ప్రకారం- పరపరాగ సంపర్కం జరిగిన తరవాత సంతతి ఒక శుద్ధజాతి జనకతరం నుండి ఒక కారకం (Y) మరియు మరో శుద్ధజాతి జనకతరం నుండి మరో కారకాన్ని (y) పొందుతుంది. అంటే సంతతిలోని అన్ని మొక్కలు రెండు రకాల కారకాలను (Yy) కలిగి ఉంటాయి. మూడవ పరికల్పన ప్రకారం అన్ని మొక్కలు పసుపు రంగు విత్తనాలనే ఇస్తాయి. (Y) కారకం యొక్క ఆధిక్యత ఎక్కువగా ఉంటుంది.



| ♀ \ ♂ | y | y |
|---|---|---|
| Y | Yy | Yy |
| Y | Yy | Yy |

Yy ............... (yellow)

Yy ............... (Yellow)

Yy ............... (yellow)

Yy ............... (Yellow)

బఠానీ మొక్కలన్నీ పసుపు రకానికి చెందినవి. F1 తరంలో వ్యక్తమయ్యే లక్షణం బహిర్గత లక్షణం. వ్యక్తం కానిది అంతర్గత లక్షణంగా గుర్తిస్తారు.

## F1 తరంలో స్వపరాగ సంపర్కం

F1 తరంలో లభించిన మొక్కల్లో (Yy కారకాలు గలవి) స్వపరాగ సంపర్కం జరుపగా ఏర్పడిన కొత్త మొక్కల్లో Y మరియు y కారకాలు ఏ రకంగానైనా కలిసిపోవచ్చు. అవి YY, Yy, yY, yy కావచ్చు. అన్నీ సమాన నిష్పత్తిలో ఉంటాయి.



| ♀ ♂ | Y | y |
|---|---|---|
| Y | YY | Yy |
| y | yY | yy |

కొత్తగా ఏర్పడిన విత్తనాలు కుప్పలో దాదాపు YY, Yy, yY, yy కారకాలతో ఉన్న బఠానీలు సమాన సంఖ్యలో ఉంటాయి. Y కారకాన్ని కలిగినవన్నీ పసుపు రంగు విత్తనాలనిస్తాయి. అయితే yy కారకాలున్నవి మాత్రమే ఆకుపచ్చరంగు విత్తనాలనిస్తాయి.

1. YY కారకాలను కలిగి ఉన్న మొక్కలు దాదాపు 25% ఉంటాయి. అవన్నీ పసుపు రకానివే.
2. yy కారకాలను కలిగి ఉన్న మొక్కలు దాదాపు 25% ఉంటాయి. అవన్నీ ఆకుపచ్చనివే.
3. yY కారకాలను కలిగివి దాదాపు 25%, Yy కారకాలను కలిగినవి దాదాపు 25% ఉంటాయి. ఇవన్నీ పసుపురంగు విత్తనాలనే ఏర్పరుస్తాయి.

F1 తరంలో అన్ని విత్తనాలు పసుపు రంగులోనే ఉన్నా వాటిని నాటితే వచ్చే తరవాతి తరంలో కొన్ని ఆకుపచ్చ రంగు విత్తనాలను ఏర్పరుస్తాయి. అంటే విత్తనాల పైపై లక్షణాలనుబట్టి వాటి అంతర్గత లక్షణాలను మనం అంచనా వేయలేమని అర్థమవుతోంది కదూ!

## దృశ్యరూపం (Phenotype)

F1 తరంలో అన్ని విత్తనాలు పసుపురంగులోనే ఉంటాయి. వాటిని నాటితే 75% పసుపు విత్తనాలను ఇవ్వగా, 25% మొక్కలు ఆకుపచ్చ మొక్కలను ఉత్పత్తి చేస్తాయి. కనుక, బయటకు కనిపించే లక్షణాన్ని 'దృశ్యరూపం'గాను, ఆ నిష్పత్తిని దృశ్యరూప నిష్పత్తిగాను పిలుస్తారు. దృశ్యరూప నిష్పత్తి 3:1.

## జన్యురూపం (Genetype)

F2 తరంలో 75% పసుపురంగు విత్తనాలనిచ్చే మొక్కల్లో 25% శుద్ధ పసుపురంగు మొక్కలు లేదా (YY) రకానికి చెందినవి. వీనినే సమయుగ్మజాలు (homogygous) అంటారు. ఇవన్నీ ఒకేరకమైన లక్షణాలు కలిగి ఉన్నాయి. మిగతా 50% పసుపు విత్తనాలు (Yy, yY) రకానికి చెందినవి. వీటిని విషమయుగ్మజాలు (Heterogygous) అంటారు. మిగిలిన 25% ఆకుపచ్చ విత్తనాలనిచ్చే మొక్కలు (yy) శుద్ధజాతికి చెందినవి. ఇవి కూడా సమయుగ్మజాలే. బఠానీ మొక్కలు ప్రదర్శించే స్వరూప స్వభావాలను, సంభావ్యతా క్రమాన్ని Yy అక్షరాలతో సూచిస్తున్నాం. జీవి యొక్క జన్యు సంఘటనంను 'జన్యురూపం' అని అంటారు. ఈ జన్యురూప నిష్పత్తి 1:2:1 (25:50:25).

F2 తరం మొక్కలను స్వపరాగ సంపర్కం చేయగా

1. YY కారకాలను కలిగిన బఠానీ మొక్కల మధ్య స్వపరాగ సంపర్కం చేస్తే పసుపు (YY) రంగు విత్తనాలున్న మొక్కలు మాత్రమే వస్తాయి. ఈ మొక్కలు నూటికి నూరు శాతం పసుపురంగు విత్తనాలనే ఇస్తాయని ప్రయోగాల ఫలితంగా నిరూపించబడ్డాయి.



| ♀ \ ♂ | Y | Y |
|---|---|---|
| Y | YY | YY |
| Y | YY | YY |

1



| ♀ \ ♂ | Y | y |
|---|---|---|
| Y | YY | Yy |
| y | yY | yy |

2



| ♀ \ ♂ | y | y |
|---|---|---|
| y | yy | yy |
| y | yy | yy |

3

2. Yy లేదా yY కారకాలను కలిగిన మొక్కల మధ్య స్వపరాగ సంపర్కం జరిపిస్తే 75% పసుపు మరియు 25% ఆకుపచ్చ రంగు విత్తనాలను ఇస్తాయి. అంటే 3 : 1 నిష్పత్తిలో మొక్కలను ఇస్తాయి.
3. yy కారకాలు ఉన్న మొక్కలు మాత్రం కేవలం ఆకుపచ్చ రంగు విత్తనాలను మాత్రమే ఇస్తాయి.

పకృతిలో వివిధ ధర్మాలకు బాధ్యత వహించే కారకాలు అనేకం ఉంటాయి.

**ద్విసంకరణం**

- ఒకటి కన్నా ఎక్కువ కారకాలు ఉంటాయనే మన పరికల్పనను పరీక్షిద్దామా?

దీనిని మెండల్ ప్రయోగంతో ఎలా జతపరచవచ్చు? రెండు జతల ప్రముఖమైన లక్షణాలను దృష్టిలోఉంచుకుని ఈ ప్రయోగాన్ని చేయాలి.

1. బఠానీగింజల రంగు – పసుపు లేదా ఆకుపచ్చ (Y, y లచే సూచిద్దాం)
2. బఠానీగింజల ఆకారం – గుండ్రం లేదా ముడతలు (R, r లచే సూచిద్దాం)

పసుపు మరియు గుండ్రని లక్షణాలు బహిర్గత లక్షణాలని మనకు తెలుసు. ఇప్పుడు రెండు రకాల శుద్ధ సమయుగ్మజ మొక్కల విత్తనాలను తీసుకుందాం. ఒకటి గుండ్రని, పసుపు రకానికి, రెండవది ముడతలు మరియు ఆకుపచ్చ రకానికి చెందినది.




ఫలితంగా ఏర్పడిన సంతతి మొత్తం గుండ్రని, పసుపు విత్తనాలే. ప్రతీదీ Yy Rr కారకాలను కలిగి ఉంటాయి.

ఎందుకంటే పసుపు (Y) మరియు గుండ్రని (R) రెండూ బహిర్గత లక్షణాలు కాబట్టి F1 తరం లేదా మొదటి తరం మొత్తం గుండ్రని, పసుపు విత్తనాలే వస్తాయి.

వీటిని ఆత్మపరాగ సంపర్కం చెందించినపుడు పసుపు, గుండ్రని (Yy Rr లేదా YYRR) విత్తనాలు, కొన్ని ఆకుపచ్చ మరియు గుండ్రని (yy RR లేదా Yyrr), మరికొన్ని ఆకుపచ్చని ముడతలు గల (yyrr), పసుపు ముడతలు గల (Yyrr లేదా YYrr) విత్తనాలు ఏర్పడ్డాయి.

### మెండల్ సూత్రాలు

F1 తరం లేదా సంతతిలో ఏదేని ఒక లక్షణం మాత్రమే బయటకు కనిపించడం మనం చూశాం. పసుపు, ఆకుపచ్చ విత్తనాలలో సంకరణ ప్రయోగం చేస్తే అన్నీ పసుపు విత్తనాలే వచ్చాయి. ఇలా ఎందుకు జరిగింది? ఒక లక్షణానికి కారణమైన రెండు కారకాలు (సమయుగ్మజాలు) ఉన్నా, వాటిలో ఒకటి మాత్రమే సంతతిలో బహిర్గతమవుతుందని మరొకటి అంతర్గతంగా ఉండిపోతుందని మెండల్ విశదీకరించాడు. దీనినే **బహిర్గతత్వ సూత్రం** (Law of Dominance) అంటారు.

పృథక్కరణ సూత్రం ప్రకారం ఏ లక్షణానికైనా రెండు కారకాలు లేదా యుగ్మవికల్పకాలలో ఒక్కొక్కటి ఒక్కో జనకుడి నుండి సంతతికి లభిస్తాయి. ఈ సంతతిలో సంయోగబీజాలు ఏర్పడినపుడు జనకుల నుండి లభించిన యుగ్మవికల్పాలు విడిపోయి యాధృచ్ఛికంగా ఒక్కో సంయోగబీజంలోకి ఒక్కో వికల్పం చేరుతుంది. ఈ విధంగా జనకుల నుండి లభించిన యుగ్మవికల్పాలు విడిపోయి వేర్వేరు సంయోగబీజాలలోకి చేరడాన్ని **పృథక్కరణ సూత్రం** (Law of Segregation) అంటారు.

రెండు వేరువేరు లక్షణాలున్నపుడు అవి తరువాత తరానికి ఎలా చేరుతాయనే విషయాన్ని వివరించడానికి మెండల్ **స్వతంత్ర్య వ్యూహన సిద్ధాంతం**ను (Law of independent asortment) ప్రతిపాదించాడు. దీనిని గురించి మీరు పై తరగతులలో నేర్చుకుంటారు. ప్రాథమిక అవగాహన కోసం అనుబంధంలో చూడండి.

ఒకతరం నుండి మరొకతరానికి వ్యాప్తిచెందే లక్షణాలను అనువంశిక లక్షణాలంటారు. మెండల్ బఠాని మొక్కలపై చేసిన ప్రయోగాలద్వారా ఇవి ఎలా వ్యాప్తి చెందుతాయో మనం గమనించాం.

### కృత్యం-4

మెండల్ అనువంశికతా సూత్రాలను సులభంగా అర్థం చేసుకోడానికి ఒక కృత్యం చేద్దాం.

**కావాల్సిన పరికరాలు**

ఎ) 3 సెం.మీ. పొడవు మరియు 1 సెం.మీ. వెడల్పు గల చార్టు ముక్కలు 4

బి) 2 సెం.మీ. పొడవు మరియు 1 సెం.మీ. వెడల్పు గల చార్టు ముక్కలు 4

సి) ఎరుపు గుండీలు - 4

డి) తెల్ల గుండీలు - 4

ఈ) చార్టు, స్కేలు, స్కెచ్‌పెన్, పెన్సిల్.

| ♀ ♂ | BAG 'A' | |
|---|---|---|
| BAG | 1 | 2 |
| | 3 | 4 |

**పద్ధతి:** 2×2 గడులుండేలా చార్టుపై గీసి పటంలో చూపిన విధంగా అంకెలు, గుర్తులను రాయండి.

**ఆట-1: ఏకసంకరణం (సంకరణ జనకులతో ప్రారంభం**

మీరు తయారుచేసిన 4 పొడవు 4 పొట్టిగా ఉండే చార్టు ముక్కల్నీ తీసుకోండి. జతలుగా ఏర్పరచేటపుడు ప్రతిజతలో పొట్టివిగానీ, పొడవువిగానీ, లేదా రెండూగానీ ఉంటాయి.

ఇపుడు రెండు సంచులు తీసుకోండి. ప్రతిసంచిలో 4 కాగితం పట్టీలు ఉండేలా రెండు సంచులలో వేయండి. ప్రతి సంచిలో 2 పొడవు, 2 పొట్టి పట్టీలు ఉంటాయన్నమాట.

'A' సంచిని పురుషబీజకణంగానూ 'B' సంచిని స్త్రీబీజకణంగానూ భావించండి. ఇపుడు 'A' సంచిలోనుండి చేతికి అందిన ఒక పట్టీని తీసుకుని గళ్ళచదరంలో 1వ గడిలో ఉంచండి. అలాగే 'B' సంచిలోనుండి కూడా చేతికి అందిన ఒక కాగితం పట్టీని తీసుకుని 1వ గడిలో ఉంచండి. మీ సంచుల్లో కాగితం పట్టీలు అయిపోయేదాకా ప్రతి గడిలో రెండు చొప్పున ఉంచుతూ ఆడండి. మీ సంచి ఖాళీ అయ్యేసరికి ప్రతి గడిలో రెండేసి కాగితం పట్టీలు ఉంటాయన్నమాట. వాటిని గమనించినట్లయితే రెండూ పొడవు, రెండూ పొట్టి, ఒకటి పొడవు, ఒకటి పొడవు ఒకటి పొట్టి జతలు కనిపిస్తాయి. ఈ కృత్యాన్ని పలుమార్లు నిర్వహించండి. ఫలితాల ఆధారంగా క్రింది ప్రశ్నలకు సమాధానాలివ్వండి.

- *రెండూ పొడవు పట్టీల జతలు ఎన్ని ఉన్నాయి?*
- *రెండూ పొట్టి పట్టీల జతల సంఖ్య ఎంత?*
- *ఒకటిపొట్టి, ఒకటి పొడవు కలిగిన జతలు ఎన్ని ఉన్నాయి?*
- *ప్రతిరకం ఎంతశాతంగా ఉన్నాయి? వాటి నిష్పత్తి ఎంత?*
- *ఈ ఆటద్వారా మీరు ఏమి గమనించారు?*

ఇదే ఆటను 4 ఎరుపు, 4 తెలుపు గుండీలను ఉపయోగించి ఆడండి. వచ్చిన ఫలితాలను మొదటి ఆటతో పోల్చి చూడండి. ఇదేవిధంగా అనుబంధంలో ఉన్న ఆటను కూడా ఆడండి. ఏమి గమనించారో మీ తరగతిలో చర్చించండి

## జనకుల నుండి సంతతికి

అతడు తాతగారి మాదిరిగా ఉన్నాడు. ఆ అమ్మాయి అచ్చు మేనత్త పోలిక అని అనడం మనం వింటూనే ఉంటాం. తల్లిదండ్రుల నుండి పిల్లలకు లక్షణాలు లేదా గుణాలు అనువంశికంగా అందించబడతాయి.

తల్లిదండ్రుల నుండి పిల్లలకు సంక్రమించే ఇలాంటి లక్షణాలనే మనం 'అనువంశిక లక్షణాలు' లేదా 'అనువంశిక గుణాలు' (Inherited traits) అని అంటారు. అలాగే విత్తనాల రంగు, విత్తన కవచం, కాండం పొడవు మొదలగునవి కూడా అనువంశిక లక్షణాలేనని మెండల్ అభిప్రాయం.

విభిన్న లక్షణాలు తల్లిదండ్రుల నుండి సంతతి పొందే ప్రక్రియనే 'అనువంశికత' (Heredity) అంటారు. ఇలాగే ఈ అనువంశికత వలన ఒక తరం నుండి మరో తరానికి లక్షణాలు అందించడాన్ని 'వంశపారంపర్యం' (Inheritance) అని అంటారు.

## లక్షణాలు ఎలా బహిర్గతమవుతాయి?

ప్రతి గుణం లేదా లక్షణం ఒక జత కారకాలు లేదా యుగ్మవికల్పకాలు అంటే, ఒకే లక్షణానికి చెందిన భిన్న కారకాల ద్వారా బహిర్గతమవుతాయని మెండల్ పరికల్పన చేశాడు.

ప్రస్తుతం ఆ కారకాలనే 'జన్యువులు' (Genes) అని అంటున్నాము. జన్యువు అనేది ప్రతి కణ కేంద్రకంలో ఉండే ఒక కేంద్రకామ్లం DNA యొక్క ఒక భాగం. ఇది ఒక లక్షణం లేదా గుణాన్ని బహిర్గతపరచడాన్ని నియంత్రించే అంశం. వైరస్‌లలో లక్షణాలను RNA నియంత్రిస్తుంది.

### మీకు తెలుసా?

1950లలో రోసలెండ్ ఫ్రాంక్లిక్, ఫ్రాన్సిస్ క్రిక్, జేమ్స్ వాట్సన్ మరియు మారిస్ విల్కిన్స్‌లు DNA నిర్మాణం పై పరిశోధనలు పని చేశారు. DNA అణువు సర్పిలంగా ఉండే మెట్ల మాదిరిగా ఉంటుందని గుర్తించారు. ఈ ఆకారాన్నే ద్వికుండలి (Double helix) అని అంటారు. ఇది ఏకాంతరంగా అమర్చబడిన చక్కెరలు మరియు ఫాస్ఫేట్లతో నిర్మితమై ఉంటుంది. దీనిలో అడినిన్, గ్వానిన్, థైమిన్ మరియు సైటోసిన్ అనే నత్రజని క్షారాలు మెట్లవలె అమరి ఉంటాయి. ఫ్రాంక్లిన్ మరియు మారిస్ విల్కిన్స్‌లు కూడా DNA 1962లో వాట్సన్, క్రిక్ మరియు విల్కిన్స్‌లకు సంయుక్తంగా నోబెల్ ప్రైజ్ బహుకరింపబడింది. (ఆ సమయానికి రోసలెండ్ చనిపోవటం వలన ఆమె పేరు చేర్చలేదు) DNA యొక్క రసాయనిక స్వభావం జీవులలో లక్షణాలను నిర్ధారిస్తుంది. జుట్టు, చర్మపు రంగు మొదలైనవి ఇలాంటి లక్షణాలకు ఉదాహరణలు. DNA యొక్క రసాయనిక నిర్మాణంలో ఏ చిన్న మార్పు కలిగినా అది సంతతి యొక్క లక్షణాలలో మార్పుకు కారణమవుతుంది. ఆ మార్పులే వైవిధ్యాలకు దారితీస్తాయి.


విల్కిన్స్


ఫ్రాంక్లిన్


క్రిక్


వాట్సన్

### మానవులలో లింగ నిర్ధారణ

మనలో లక్షణాలు వంశపారంపర్యంగా వచ్చినట్లుగానే పుట్టే శిశువు యొక్క లింగనిర్ధారణలో కూడా వంశపారంపర్య కారకాలుంటాయి. నిజానికి శిశువు లింగనిర్ధారణలో కారణమెవరో తెలుసుకుందాం. ప్రతి మానవ కణంలో 23 జతల (46) క్రోమోజోమ్-లుంటాయి. వానిలో 22 జతలను శారీరక క్రోమోజోమ్‌లు (Autosomes) అనీ, మిగిలిన ఒక జతను లైంగిక క్రోమోజోములు (Allosomes or sex chromosomes) అనీ అంటారు. లైంగిక క్రోమోజోమ్‌లు రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి (X) కాగా, రెండవది (Y). ఈ రెండు క్రోమోజోమ్‌లు లింగ నిర్ధారణ చేస్తాయి. ఆడవారిలో రెండూ XX క్రోమోజోమ్‌లుంటాయి. మగవారిలో XY క్రోమోజోమ్‌లుంటాయి. స్త్రీ సంయోగబీజాలలో (అండం) లో ఒకే ఒక X క్రోమోజోమ్ మాత్రమే ఉంటుంది. పురుష సంయోగబీజంలో (శుక్రకణాల్లో) రెండు రకాలుంటాయి. X క్రోమోజోమ్ కలిగినవి, Y క్రోమోజోమ్‌ను కలిగినవి. Y క్రోమోజోమ్ ఉన్న శుక్రకణం, X క్రోమోజోమ్ ఉన్న అండంతో కలిస్తే ఫలదీకరణ జరిగి XY క్రోమోజోమ్‌లతో ఏర్పడిన శిశువు అబ్బాయి అవుతాడు.

- X క్రోమోజోమ్ ఉన్న శుక్రకణం X క్రోమోజోమ్ ఉన్న అండంతో కలిసి ఫలదీకరణ జరిగితే ఏమి జరుగుతుంది?
- శిశువు లింగ నిర్ధారణ చేసేది అమ్మానాన్నలలో ఎవరు?
- ఆడపిల్ల పుట్టిందని స్త్రీని నిందించడం సరైనదేనా?
- లింగం అనేది ఒక లక్షణమా? గుణమా? దీనికి మెండల్ ప్రతిపాదించిన బహిర్గతత్వ సూత్రం వర్తిస్తుందా?
- మనలో ఉన్న లక్షణాలన్నీ మన తల్లిదండ్రులను పోలి ఉంటాయా?




### మీకు తెలుసా?

**లైంగిక క్రోమోజోమ్‌ల ఆవిష్కరణ**

వాల్టర్ సట్టన్ మరియు థామస్ హంట్ మోర్గాన్‌లు 1956వ సంవత్సరంలో చిన్న పండ్ల ఈగ (డ్రాసోఫిలా మెలనోగాస్టర్) గురించి కొలంబియా యూనివర్సిటీలో అధ్యయనం చేశారు. డ్రాసోఫిలాలో లింగ సహలగ్నత లక్షణాలను కనుగొనేటప్పుడు లక్షణాలకు కారణమయ్యే జన్యువులు క్రోమోజోమ్ లలో ఉన్నట్లు నిర్ధారించబడినది. డ్రాసోఫిలాలోని వంశపారంపర్యత గురించి వాళ్ళు పూర్తిగా అధ్యయనం చేశారు.




పటం-4

## పరిణామం (Evolution)

జీవులు ప్రత్యుత్పత్తి జరిపేటప్పుడు వైవిధ్యాలు (variations) ఏర్పడుతుంటాయి. ఒక జనాభాలో లైంగిక ప్రత్యుత్పత్తి, DNA అనువాదం మరియు ప్రతికృతిలో జరిగే ఏవైనా తప్పులు లేదా మార్పులు వైవిధ్యాలకు దారితీస్తాయి. అవే వాటి సంతతికి కూడా అందించబడతాయి.

ఒక జీవి జనాభాలో పరిసరాలకు అనుగుణంగా ఏవిధమైన వైవిధ్యాలు చోటు చేసుకుంటాయి? వాని ఫలితాలేమిటి? అన్న అంశాలను ఒక కాల్పనిక సన్నివేశం ఆధారంగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నిద్దాం.

## కృత్యం-5

### రెక్కల పురుగు జనాభాలో వైవిధ్యం

కింది చిత్రంలో రెక్కపురుగుల జనాభాలో వైవిధ్యం మరియు దాని ప్రభావాన్ని చూద్దాం.

మొదటి చిత్రంలో చూపినట్లు 12 రెక్క పురుగులను ఒక సమూహంగా ఊహించుకోండి. అవి పొదలపైన, ఆకుపచ్చని ఆకులపై నివసిస్తాయి. ఇవి లైంగిక ప్రత్యుత్పత్తి ద్వారా సంతతిని ఏర్పరుస్తాయి. కనుక తరచూ వైవిధ్యాలు ఏర్పడుతూ ఉంటాయి. ఈ ఎర్ర రెక్క పురుగులు

కాకుల ఆహారంగా ఉపయోగపడతాయి. కాకులు పురుగుల్ని తినడం ఎక్కువైతే వాటి జనాభా నెమ్మదిగా తగ్గిపోతుంది.




పటం-5: రెక్కపురుగుల జనాభాలో వైవిధ్యాన్ని తెలిపే మూడు సందర్భాలు

ఇప్పుడు, వివిధ సందర్భాలను గురించి ఆలోచిద్దాం.

**మొదటి సందర్భం:**

ఒక రెక్క పురుగులో ప్రత్యుత్పత్తి సమయంలో రంగులో వైవిధ్యం ఏర్పడింది. దాని ఫలితంగా సంతతికి ఎర్ర రంగుకు బదులుగా ఆకుపచ్చ రంగు వచ్చింది.



పటం-6: ఎరుపు మరియు ఆకుపచ్చ రెక్కపురుగులు

ఈ ఆకుపచ్చ రెక్క పురుగు నుండి వచ్చే తరవాత తరాలన్నీ ఆకుపచ్చవే అవుతాయి. ఆకుపచ్చ చెట్లు, ఆకులపైనున్న ఆకుపచ్చని పురుగులు కాకులకు వెంటనే కనబడవు. కనుక వాటిని తినలేకపోయాయి. కానీ ఎర్ర రెక్క పురుగు కనిపిస్తే చాలు తినేసేవి. దాంతో ఆకుపచ్చ పురుగుల సంఖ్య రోజురోజుకు పెరిగిపోయింది. అదే సమయంలో ఎర్రనివి క్రమంగా తగ్గిపోయాయి.

రంగులో వైవిధ్యం ఆకుపచ్చ పురుగుకు, ఎర్ర రంగు పురుగుకన్నా ఎక్కువగా మనుగడకు సహాయపడింది. ఇంకోవిధంగా చూస్తే ఆకుపచ్చ పురుగులు తమ రంగును సహజంగా ఎంపిక చేసుకున్నాయి అని చెప్పవచ్చు. కాకులు 'సహజ ఎంపిక'కు కారణం కావడం మనం చూడవచ్చు. కాకులు ఎక్కువగా ఎర్ర రెక్క పురుగులను తినేస్తూపోతే చివరికి అవి మిగలవు. కనుక ప్రకృతి సహజంగా రెక్క పురుగుల జనాభాలో ఆహారంకోసం చేసిన ఈ

ప్రయత్నాలు వైవిధ్యం ద్వారా పరిణామానికి దారి తీసింది. దాని ఫలితంగా రెక్క పురుగుల జనాభా పరిసరాలకు అనువైన అనుకూలనాలను పొంది మనుగడ సాగించేలా చేసింది.

మరొక ఉదాహరణ గురించి ఆలోచిద్దాం.

దీనిలో కూడా రంగులోనే వైవిధ్యం ఏర్పడి ప్రత్యుత్పత్తి ద్వారా తరవాత తరాలకు అందించబడుతుంది. కానీ ఎర్ర రెక్క పురుగుల నుండి 'నీలిరంగు' పురుగులు వచ్చాయి. కనుక నీలిరంగే సంతతికి అందించబడి వాటి సంఖ్య పెరిగింది.

ఆకుపచ్చని ఆకులు, పొదలపైన నీలి, ఎర్ర రెక్క పురుగులు కాకులకు స్పష్టంగా కనిపించేవి. కనుక వాటిని సులభంగా తినగలిగేవి. ముందు సందర్భంలో ఆకుపచ్చ రెక్క పురుగుల మాదిరిగా రంగులో మార్పు వచ్చినప్పటికీ అది నీలి రంగు రెక్క పురుగులకు లాభం చేకూర్చలేదు.




పటం-7: నీలి మరియు ఎరుపు రెక్క పురుగులు

## రెండో సందర్భం:

రెక్క పురుగుల జనాభాలో ముందుగా ఏం జరిగిందంటే కొన్ని నీలి మరియు ఎరుపు రంగు పురుగులు ఎక్కువగా ఉన్నాయి. ఆ ప్రదేశానికి ఒక ఏనుగు వచ్చిందని ఊహించుకోండి. ఈ పురుగులు ఉన్న పొదలగుండా ఏనుగు నడుచుకుంటూ వెలితే దాని కాళ్ళకిందపడి చాలా పురుగులు చనిపోతాయి. ఒకవేళ ఏవైనా జీవించిఉన్నాయంటే వానిలో అధికంగా నీలి రెక్క పురుగులే ఉన్నాయనుకోండి. వాటి జనాభానే నెమ్మదిగా పెరుగుతూ పోతుంది. అంటే కొన్నిసార్లు చిన్న జనాభాలలో ఆకస్మికంగా లేదా హఠాత్తుగా సంభవించే సంఘటనల ఫలితంగా జన్యువుల పౌనఃపున్యంలో మార్పులు ఏర్పడతాయి. దీనినే జన్యు విస్థాపనం (Genetic drift) అని అంటారు. ఇది కూడా జనాభాలో వైవిధ్యానికి దారితీస్తుంది.

ఇప్పుడు మరొక సందర్భాన్ని చూద్దాం.

## మూడవ సందర్భం:

రెక్క పురుగుల జనాభా క్రమంగా పెరుగుతూ ఉంది. అనుకోకుండా హఠాత్తుగా అవి



పటం-8: పోషకాహార లోపం కలిగిన రెక్క పురుగులు

ఉండే పొదలకు ఏదైనా తెగులు సోకిందనుకోండి. అప్పుడు ఆకులు నశించడం లేదా వాటి సంఖ్య తగ్గిపోవడం వలన రెక్క పురుగులకు సరైన ఆహారం లభించదు. పస్తులు ఉండాల్సి

వస్తుంది. కనుక రెక్క పురుగుల బరువు తగ్గిపోతుంది. కానీ ఆ మార్పు జన్యుపదార్థమైన DNA ను మార్చలేదు. తరవాత కొన్ని సంవత్సరాలకు మొక్కల తెగుళ్లు తగ్గి పొదలు మునుపటిలా ఆరోగ్యంగా మారిపోయాయి.

- *అప్పుడు రెక్క పురుగుల బరువులో ఎలాంటి తేడాలు వస్తాయని నీవు భావిస్తున్నావు?*

లైంగిక ప్రత్యుత్పత్తి జరుపుకొనే జీవులలో ప్రత్యుత్పత్తి కోసం ప్రత్యేకంగా ఉండే బీజకణాలను గురించి 'ప్రత్యుత్పత్తి' పాఠంలో చర్చించాం.

ఒకవేళ రెక్క పురుగులకు తగినంత ఆహారం లభించకపోవడం వలన బరువు తగ్గితే ఆ మార్పు బీజకణాలలోని DNA లో మార్పు తీసుకురాలేదు. కాబట్టే బరువు అనే లక్షణం అనువంశికంగా సంతతికి అందింపబడదు. పరిణామానికి దారితీయదు. అంటే ఈ రకమైన మార్పులు అనువంశికంగా తరువాత తరాలకు అందించబడవని అర్థం చేసుకోవచ్చు. ప్రత్యుత్పత్తి కణజాలం మినహా, మిగతా కణజాలాలలో జరిగే మార్పులు బీజకణాలలోని DNA లో మార్పులు తీసుకొనిరావు. కాబట్టి ఒక జీవి తన జీవితకాలంలో పొందిన అనుభవాలను వేటినీ తన సంతతికి అందించలేదు. ఇవేవి పరిణామానికి దోహదం చేయవు.

## లామార్క్‌వాదం – జీన్ బాప్టిస్ట్ లామార్క్ (1774–1829)



పటం-9: జీన్ బాప్టిస్ట్ లామార్క్ (1774-1829)



పటం-10: జిరాఫి

పూర్వపు రోజులలో జీవుల్లో ఎలాంటి మార్పులు ఉండవనీ ఎప్పటికీ ఒకేవిధంగా ఉంటాయనీ ప్రజలు విశ్వసించేవారు. జీన్ బాప్టిస్ట్ లామార్క్ జీవపరిణామ సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన మొదటి శాస్త్రవేత్త. కొన్ని వేల సంవత్సరాల క్రితం జిరాఫీలు జింకల వలెనే ఉండేవని లామార్క్ భావించాడు. నేలపైన మరియు చెట్ల కింది కొమ్మల్లో దొరికే ఆహారం లభించకుండా పోయాక ఆహార కొరత కారణంగా జిరాఫీలు మెడసాచి చెట్లపైన ఉన్న శాఖలను అందుకోవాల్సిన అవసరం ఏర్పడి ఉండవచ్చు. కనుక మెడనిసాచి పై శాఖలను అందుకోవడం వలన మెడ నెమ్మదిగా సాగడం మొదలై ఉండవచ్చు. ఎందుకంటే పదేపదే మెడను సాచి ఉపయోగించడం మూలంగా కొన్ని తరాల తరవాత జిరాఫీల మెడ సాగిపోయి ఇప్పుడు ఉన్నట్లు సాగిన మెడ గల జిరాఫీల ఆవిర్భావం జరిగి ఉంటుందని ఆయన భావించాడు. ఇలా ఒక జీవి తన మనుగడ కోసం అవసరం కొద్దీ అభివృద్ధి చేసుకున్న లక్షణాలను లేదా గుణాలను ఆర్జిత గుణాలు (acquired characters) అంటారు. లామార్క్ అభిప్రాయం ప్రకారం ఈవిధంగా ఆర్జించిన గుణాలు తమ సంతతికి అందించబడుతూ ఉంటాయి. దీనినే 'ఆర్జిత గుణాల అనువంశికత' అంటారు.

కానీ ఆగస్ట్ వీస్‌మన్ ఈ సిద్ధాంతాన్ని ఎలుకలపై ప్రయోగాలు చేసి పరీక్షించాడు. అతడు ఎలుకలకు తోకలు తొలగించాడు. కానీ సంతతి మామూలుగానే తోకలతో జన్మించాయి. తరవాత తరం ఎలుకల తోకలు కూడా తొలగించుకుంటూ అలా 22 తరాల వరకు చేశాడు. అయితే ప్రతిసారి ఎలుకలు

తోకలతోనే పుట్టాయి. శారీరకమైన మార్పులు పరిసరాల కారణంగా ఏర్పడినా సరే అది తమ సంతతికి అందించబడవని వీస్‌మన్ నిర్ధారించాడు.

## డార్వినిజం - చార్లెస్ రాబర్ట్ డార్విన్ (1809-1882)

ప్రకృతి వరణం (natural selection) అనే ప్రఖ్యాత సిద్ధాంతాన్ని డార్విన్ ప్రతిపాదించాడు.



పటం-11: చార్లెస్ డార్విన్ (1809 - 1882)

ఇంగ్లాండ్ దేశస్థుడైన చార్లెస్ డార్విన్ తన 22వ యేట HMS బీగిల్ అనే నౌకలో ప్రపంచ వ్యాప్తంగా పరిశోధన కోసం బయలుదేరి ఐదు సంవత్సరాలు ప్రయాణించాడు. గాలాపాగస్ దీవులతో సహా ఎన్నెన్నో ప్రదేశాలను అతడు సందర్శించాడు. ఆయా ప్రదేశాలలోని మొక్కలు, జంతువుల గురించి క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. అలాగే ఎంతో సమాచారాన్ని, ఋజువులను కూడా సేకరించాడు.

డార్విన్ గాలాపాగస్ దీవులలో ఒక్క చిన్న సమూహానికి చెందిన పక్షుల నిర్మాణంలోని వైవిధ్యాన్ని గుర్తించాడు. వాటినే డార్విన్ ఫించ్ పక్షులు అంటారు. డార్విన్ ఫించ్ పక్షుల ముక్కుల్లో స్వల్పమైన మార్పులు ఉండడాన్ని ఆయన గమనించాడు. ఆ మార్పు ఆ పక్షులకు ఎలా ఉపయోగపడుతుంది?




పటం-12: డార్విన్ ఫించ్ పక్షుల ముక్కు మరియు ఆహారపు అలవాట్లు పరిశీలన

సర్ చార్లెస్ లైల్ రాసిన Principles of Geology పుస్తకం ఆయనను ఎంతో ప్రభావితం చేసింది. అయితే భౌగోళిక మార్పులు క్రమబద్ధంగా జరుగుతాయనే చార్లెస్ లైల్ ప్రతిపాదనను డార్విన్ అంగీకరించలేదు. అనేక చిన్నచిన్న మార్పులే పెద్ద మార్పుకు దారితీస్తాయని ఇవి పురాతనమైనవిగా ఉంటాయని డార్విన్ భావించాడు. అలాగే మాల్తస్ ప్రతిపాదించిన ప్రఖ్యాతి చెందిన An Essay on the Principles of Poplulationలోని 'జనాభా సిద్ధాంతం' ప్రభావం డార్విన్‌పై అధికంగా ఉండేది. మాల్తాస్ పరిశీలన ప్రకారం జనాభా గుణశ్రేఢిలో పెరుగుతుంటే (1, 2, 4, 8, 16, ....) వాటి ఆహార అవసరాలు అంకశ్రేఢి పద్ధతిలో పెరుగుతున్నాయి (1,2, 3, 4, ....).

డార్విన్ 'ప్రకృతి వరణం' అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. అంటే ప్రకృతి మాత్రమే ఒక జీవి మనుగడ సాగించాలా లేక నశించాలా అనే విషయాన్ని నిర్ణయిస్తుంది. అంటే మనుగడ సాగించగలదానినే ప్రకృతి ఎన్నుకుంటుంది. ఉపయుక్త వైవిధ్యాలు ఉన్న జీవులే మనుగడ కొనసాగిస్తాయి. నిరుపయోగ లక్షణాలు లేదా గుణాలున్నవి నాశనమవుతాయి

లేదా అవి ఉన్న పరిసరాల నుండి తొలగించబడతాయి.

ఎ.ఆర్.వాలెస్ అను శాస్త్రవేత్త కూడా ప్రకృతివరణం ద్వారానే కొత్తజీవులు ఉద్భవిస్తాయని తెలిపాడు. ఈ అంశాన్ని ఎర్ర రెక్క పురుగు విషయంలో మనం గమనించాం. వాటిని కాకులు తినేశాయి కాబట్టి వాటి జనాభా పరిసరాల నుండి నెమ్మదిగా తొలగించబడింది. అదే సమయంలో ఆకుపచ్చ రెక్క పురుగులు ఆకుల రంగులో కలిసిపోయి కాకులకు కనిపించకుండా ఉండటం వలన మనుగడ సాధించగలిగాయి. కాబట్టి వాటి జనాభా పెరిగింది. దీనినే ప్రకృతి వరణం అంటారు.



### ఆలోచించండి-చర్చించండి

ఒక అడవిలో రెండు రకాలైన జింకలు ఉన్నాయనుకుందాం. ఒక రకం చాలా వేగంగా పరుగెత్తగలవు. కానీ రెండవ రకం అంత వేగంగా పరుగెత్త లేవు. జింకలను వేటాడి సింహాలు, పులులు ఆహారంగా తీసుకుంటాయి. మరి ఏ రకం జింకలు మనుగడ సాగిస్తాయో ఊహించండి? ఏ రకం జింకల జనాభా క్రమంగా తగ్గిపోతుంది. ఎందుకు?

వైవిధ్యాలు ఉపయోగకరమైనవిగా ఉన్నప్పుడు అవి ప్రోత్సహించబడతాయి. హానికరమైనవైతే అంతరిస్తాయి. ఒక జనాభాలో మనుగడకోసం జరిగే పోరాటంలో బలమైనదే గెలుస్తుంది. ప్రకృతి కూడా ఉపయుక్త వైవిధ్యాలనే ఆదరిస్తుంది.

ప్రతిజాతి ఎక్కువ సంఖ్యలో సంతతి ఉండేలా ఉత్పత్తి చేస్తుంది. అవి ఆహారం, స్థలం, ప్రత్యుత్పత్తి విషయంలో పోటీ ఏర్పడి పోట్లాడుతాయి. అలాగే ఇతర జాతుల జీవులతోనూ పోరాటం చేయాల్సి వస్తుంది. జీవనం కోసం జరిగే ఆ పోరాటంలో బలమైనవే బతుకుతాయి. దీనినే 'మనుగడ కోసం పోరాటం' (Struggle for existance) అంటారు. ఆ పోరాటంలో నిలిచి ఉండడాన్ని యోగ్యతమముల సార్థక జీవనం అని అంటారు.

కాలక్రమేణా ఇది కొత్త జాతుల ఆవిర్భావానికి దారితీస్తుంది. మీ పరిసరాలలోని మొక్కలు, జంతువులలో మీరు మనుగడకోసం పోరాటం చూసే ఉంటారు. మొలకెత్తిన మొక్కలలో, పుట్టిన పిల్లల్లో కొన్ని మాత్రమే బతకడాన్ని గమనించే ఉంటారు. మీ అనుభవాల ఆధారంగా మనుగడకోసం పోరాటం గురించి మీ తరగతిలో చర్చించండి.

### డార్విన్ సిద్ధాంత సారాంశం

1. ఒక జనాభాలోని ఏదేని సమూహం వైవిధ్యాలను సంతరించుకోవచ్చు. కానీ సమూహంలోని అన్ని జీవులూ ఒకే రకంగా పొందలేవు.
2. వైవిధ్యాలు జనకుల నుండి సంతతికి అనువంశికంగా అందించబడతాయి.
3. సంతతి అధిక సంఖ్యలో ఉంటే అది మనుగడ కోసం పోరాటానికి దారితీస్తుంది.
4. పరిణామం అనేది నెమ్మదిగా, నిరంతరాయంగా జరుగుతుంది.
5. తగిన ఉపయుక్త లక్షణాలు లేని జీవులకన్నా, ఉన్నవే మనుగడ కొనసాగించడానికి అర్హత కలిగి ఉంటాయి. కాబట్టి ప్రత్యుత్పత్తి ద్వారా జీవులు అధిక సంతానాన్ని ఉత్పత్తి చేస్తాయి.

6. ఉపయుక్త వైవిధ్యాలు కలిగి మనుగడ సాగిస్తున్న జీవులు అనువంశికంగా సంతతికి వాటిని అందజేస్తాయి. అలాగే ప్రతి తరంలోనూ జరగడం వలన ఆ వైవిధ్యాలు సర్వసాధారణ లక్షణాలవుతాయి.
7. పర్యావరణంలో మార్పులు వస్తే జీవులు వాటికి అనుగుణంగా మార్పులు లేదా అనుకూలనాలను సంతరించుకుని కొత్త పరిస్థితులలో జీవించగలుగుతాయి.
8. ప్రతి జీవజాతిలో సుదీర్ఘకాలం మార్పులు చోటుచేసుకుంటూ ఉంటే, అది ఒక కొత్త జాతి ఏర్పడటానికి దారితీస్తుంది. కొత్త జాతి, నిజమైన జాతికి భిన్నంగా ఉంటుంది. భూమిపైన అన్ని జాతులు ఈవిధంగా ఏర్పడినవే.



**మీకు తెలుసా?**

చార్లెస్ డార్విన్, ఆల్ఫ్రెడ్ రస్సెల్ వాలెస్‌ల ఆలోచనలు ఒకేలా ఉండేవి. డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతాన్ని రూపొందిస్తున్న సమయంలో వాలెస్ రాసిన ఉత్తరాన్ని అందుకున్నాడు. వాలెస్ ఇండోనేషియా దీవులలో తన పరిశోధనల గురించి, ప్రకృతి వరణం గురించి రాశాడు. తాను ఆలోచించినట్లుగానే వాలెస్ సిద్ధాంతం కూడా ఉండటం డార్విన్‌ను చాలా ఆశ్చర్యానికి గురిచేసింది. తరవాత డార్విన్, వాలెస్ కలిసి Journal of Linnaean Society పత్రికలో ప్రకృతి వరణం గురించి ఒక వ్యాసాన్ని ప్రచురించారు. దాని తరవాతే డార్విన్ తన ప్రముఖమైన గ్రంథం 'జాతుల ఉత్పత్తి (The Origin of Species) ప్రచురించి, ప్రకృతి వరణం గురించి వివరించాడు.


ఆల్ఫ్రెడ్ రస్సెల్ వాలెస్



## జాతుల ఉత్పత్తి (Speciation)

### కొత్త జాతులు ఎలా ఉత్పత్తి అవుతాయి?

ఒక జాతి జనాభాలోని వైవిధ్యాలు పరిసరాలకు అనుకూలమైన లక్షణాలను పొందడం మనం చూశాం. అలా పొందిన జీవులే ప్రతిభావంతంగా మనుగడ సాధించగలుగుతాయి. కానీ అదే జాతికి చెందిన జీవులే అయినా, కావల్సిన అనుకూలనాలను పొందలేకపోతే అవి క్రమంగా అంతరించిపోతాయి. ముందు చర్చించిన ఎర్రని, ఆకుపచ్చ రెక్క పురుగులే మనకు ఒక మంచి ఉదాహరణ. ఒక చిన్నజాతిలో జరిగే చిన్నచిన్న మార్పులను 'సూక్ష్మ పరిణామం' (micro evoluation) అంటారు.

ఇప్పుడు కొత్త కొత్త జాతులు ఎలా ఏర్పడతాయో చూద్దాం. కొత్త జాతులు ఏర్పడటాన్ని జాతుల ఉత్పత్తి (speciation) అనీ లేదా స్థూల పరిణామం (macro evoluation) అనీ అంటారు.

ఎర్రని, ఆకుపచ్చని రెక్క పురుగులు లైంగికంగా కలిసి సంతతిని పొందగలవని మనకు తెలుసు. అయితే ఎర్రని, ఆకుపచ్చని రెక్క పురుగులు ఏవేని కారణాలచేత చాలా కాలం వేరైపోయాయని ఊహించుకోండి (ఉదాహరణకు కాకులు వాటిని తినడానికి నోట కరచుకొని

తీసుకెళ్ళి దూరంగా ఎక్కడో జారవిడిచాయనుకోండి). కొన్ని సంవత్సరాలలో రెండు రకాల రెక్క పురుగులలోనూ ఎంతో వైవిధ్యం ఏర్పడుతుంది. ఆ తరవాత అవి అనుకోకుండా కలిసినప్పటికీ ప్రత్యుత్పత్తి జరపలేవు. సంతతిని ఉత్పత్తి చేయలేవు. ఏద్దైనా జీవులు వాటి జాతి జీవులతోనే కలవడం, సంతానాన్ని పొందడం జరుగుతుంది. ఈవిధంగా కొత్త జాతులు ఏర్పడుతుంటాయి.

## జీవ పరిణామం-ఆధారాలు

జీవుల పరిణామం ఎలా జరిగింది? శాస్త్రవేత్తలు దేనికైనా ఋజువులు లేదా నిదర్శనాలు కావాలంటారు. నిరూపించడం చాలా ముఖ్యం. అదేవిధంగా జీవపరిణామానికి కూడా ఋజువులు అవసరం. అలాంటి కొన్ని ఉదాహరణలు పరిశీలిద్దాం.

పరిణామ సంబంధాలను గురించి మనం అధ్యయనం చేసేటప్పుడు ఏ లక్షణాలు సామాన్యమైనవో మనం ఎలా గుర్తిస్తాం?

## నిర్మాణసామ్య, క్రియాసామ్య అవయవాలు

ఏవైనా లక్షణాలు వివిధ జీవులలో ఒకేవిధంగా ఉన్నాయంటే అవి వాటన్నింటికీ చెందిన ఒకే పూర్వజీవి నుండి అనువంశికంగా వచ్చినట్లు గుర్తించవచ్చు. తిమింగలంల్లో తెడ్లు (ఈదడానికి), గబ్బిలాల్లో రెక్కలు (ఎగరడానికి), చిరుతల్లో కాళ్ళు (పరుగెత్తడానికి), చుంచుఎలుకల్లో కాళ్ళు (తవ్వడానికి), మనుషుల్లో చేతులు (పట్టుకోవడానికి) ఇలా వివిధ రకాలుగా ఉపయోగపడే ముందరి చలనాంగాల అంతర్నిర్మాణం ఒకేలా ఉంటుందంటే మీరు ఆశ్చర్యపోతారు. వీటన్నంటి పూర్వాంగాల అంతర్నిర్మాణాలు, ఎముకల అమరిక ఒకేలా ఉంటాయి. సకశేరుకాలన్నీ ఒకే పూర్వీకుల నుండి పరిణామం ఫలితంగా ఏర్పడినవేనని ఈ ఋజువులు తెలుపుతున్నాయి. ఈ అవయవాలనే నిర్మాణసామ్య అవయవాలు (Homologous organs) అంటారు. ఈవిధమైన పరిణామాన్ని అపసారి పరిణామం (Divergent evolution) అంటారు.



పటం-13: నిర్మాణసామ్య అవయవాలు

అవయవాల ఆకారంలో పోలికలున్నంత మాత్రాన అవి ఒకే పూర్వీకుల నుండి ఏర్పడాల్సిన అవసరం లేదు. గబ్బిలం, పక్షుల రెక్కల గురించి ఏమని భావించాలి? పక్షులకు, గబ్బిలాలకు రెక్కలు ఉన్నాయి. ఉడతలు, బల్లులకు రెక్కలు లేవు. అయితే ఉడతలు, బల్లుల కంటే పక్షులు, గబ్బిలాలు ఒకదానికొకటి చాలా దగ్గరి సంబంధం కలవని అర్థం చేసుకోవచ్చా?

ఈ విషయంలో ఒక నిర్ణయానికి వచ్చేముందు పక్షులు, కీటకాల రెక్కల గురించి ఇంకొంచెం జాగ్రత్తగా పరిశీలిద్దాం. కీటకాల రెక్కలు పరిశీలించినప్పుడు అది బాహ్యఅస్థిపంజరం యొక్క బాహ్యాభివృద్ధి అవయవాలు ఎగరటానికి సహాయపడతాయి. కానీ పక్షులలో రెక్కలు

ఈకలతో కప్పబడిన ముందరి చలనాంగాలు ఉంటాయి. ఈ రెండింటిలో నిర్మాణం, అవయవాలు వేరువేరుగా ఉన్నప్పటికీ అవి నిర్వహించే విధి మాత్రం ఒక్కటే. అందువల్లనే అవి రెండు చూడడానికి ఒకేవిధంగా కనిపిస్తాయి. అయినప్పటికీ ఈ రెండింటి మూలం ఒకటికాదు. నిర్మాణంలో వేరువేరుగా ఉన్నప్పటికి ఒకే రకమైన పనిని నిర్వర్తించే వాటిని క్రియాసామ్య అవయవాలు (Analogous organs) అంటారు. ఈవిధమైన పరిణామాన్ని అభిసారి పరిణామం (Convergent evolution) అంటారు.



క్రియాసామ్య అవయవాలు

## పిండోత్పత్తి శాస్త్ర నిదర్శనాలు (Embryological evidences)

### కృత్యం-6

వెన్నెముక గల జీవుల పిండాభివృద్ధిలోని వివిధ దశలను పరిశీలిద్దాం. వాటిలోని పోలికలు, భేదాలను గుర్తించండి. మీ మిత్రులతో చర్చించండి.

ఒక జీవి అండం మొదలుకొని సంపూర్తిగా ఎదగడం వరకు గల వివిధ అభివృద్ధి దశలను గురించిన అధ్యయనం చేయడాన్నే పిండాభివృద్ధి శాస్త్రం (Embryology) అని అంటారు. కప్ప డింభకం (Tadpole) కప్ప కన్నా ఎక్కువగా చేపను పోలి ఉంటుంది. ఇది దేనిని సూచిస్తుంది? అంటే చేపల నుండి కప్పలు పరిణామక్రమం ఫలితంగా ఏర్పడ్డాయని భావించవచ్చా?



పటం-14: పిండోత్పత్తి శాస్త్ర నిదర్శనాలు

చేప నుండి మానవుని వరకు గల వివిధ జీవుల పిండాలలో గుర్తించదగిన (Remarkable) ఈ పోలికలు ఎలా ఉంటాయంటే సుప్రసిద్ధ పిండాభివృద్ధి శాస్త్రవేత్త అయినా తొలిదశలోనున్న ఒక పిండాన్ని వేరొకదాని నుండి వేరుగా గుర్తించడం కష్టం. ఈ విషయం ఏమి తెలియజేస్తుంది? ప్రతి జీవి జీవితచరిత్ర పూర్వీకుల నిర్మాణాత్మక లక్షణాలను ప్రదర్శిస్తుంది. ఈ కోణంలో ఆలోచించినపుడు జీవులన్నింటికీ ఒకే సామాన్య పూర్వీకుడు (Common ancestor) ఉన్నారని, దానినుండే జీవులన్నీ పరిణామం చెందాయనే భావనకు బలం చేకూరుతుంది.

## శిలాజాలు (Fossils)

కొన్ని వేల సంవత్సరాల క్రితం నివశించిన కొన్ని జీవ జాతులు గురించి మనకు తెలుసు. కానీ అవి ప్రస్తుతం జీవించి లేవు. అంతరించిపోయాయి. వాటిలో కొన్నింటిని మనం శిలాజాల రూపంలో చూడవచ్చు. ఉదా: రాక్షసబల్లులు. ఇవి ఎంతో పెద్ద శరీర పరిమాణం కలిగిన జంతువులు. ఇవి చాలా ఏళ్ళ క్రితం భూమిమీద నివసించేవి. కానీ కాలక్రమంలో అవి అంతరించిపోయాయి. వాటిని ప్రస్తుతం మనం చూడలేం. రాక్షసబల్లులు కూడా ఇప్పటి జంతువుల మాదిరిగానే నివసించేవి అని చెప్పడానికి శాస్త్రవేత్తలు అనేక రుజువులు సేకరించారు.

## శిలాజాలు అంటే ఏమిటి?

ప్రాచీన జీవయుగాల్లో నివసించిన విలుప్తమైన జీవుల ఉనికిని తెలియజేసే, ప్రకృతి సిద్ధంగా భద్రపరచబడిన అవశేషాలను "శిలాజాలు" (Fossils) అంటారు. పురాతన జీవులు లేదా వృక్షాలకు చెందిన ఏ భాగమైనా శిలాజంగా ఏర్పడవచ్చు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో జీవులలోని కర్బన పదార్థాలు క్షీణించి, పూర్తిగా నిర్మూలన చెందకుండా ఉండటం వల్ల శిలాజాలు ఏర్పడతాయి. భూమి లోపలి పొరల్లో నీటి లోపలి నిక్షేప శిలల్లో (Sediments) శిలాజాలు రూపొందుతాయి.

ప్రాచీన జీవుల శరీర భాగాలు ఎముకలు, దంతాలు, కొమ్ములు, విత్తనాలు, పత్రాలు లేదా పాదముద్రలు మొదలైనవి శిలాజాల రూపంలో లభిస్తాయి. సాధారణంగా చనిపోయిన జీవుల శరీరం కుళ్ళి నశించిపోతుంది. కానీ కొన్నిసార్లు శరీరం మొత్తం లేదా ఏవైనా కొన్ని భాగాలు సహజంగా నశించిపోకుండా ఉండి శిలాజాలుగా రూపొందుతాయి. ఉదాహరణకు ఏదైనా చనిపోయిన కీటకం బురదలో చిక్కుకుపోయిందనుకోండి. అది అంత సులువుగా నశించదు. బురద క్రమంగా ఎండి, గట్టిపడే పరిస్థితులుంటే ఆ మట్టి లోపల కీటక దేహం, శరీర భాగాలు, ప్రకృతిసిద్ధంగా భద్రపరచబడి ముద్రలుగా ఉండిపోతాయి. ఇలా చెడిపోకుండా ఉండిపోయిన విలుప్త జీవుల అవశేశాలను, ముద్రలను శిలాజాలు అంటారు.



పటం-15: శిలాజం



పటం-16: డైనోసారస్

శిలాజాలను గురించిన అధ్యయనాన్ని పురాజీవశాస్త్రం (Palaeontology) అని అంటారు. భూగర్భ శాస్త్రవేత్త (Geologist) శిలాజ కాలాన్ని లెక్కించి చెప్పగలుగుతారు. కార్బన్ డేటింగ్ పద్ధతిని ఉపయోగించి శిలాజాల వయస్సును లేదా అవి నివసించిన కాలాన్ని కనుగొంటారు. అందుకు రేడియోధార్మిక పదార్థాలైన కార్బన్, యురేనియం మరియు పొటాషియం యొక్క ఐసోటోప్‌లను ఉపయోగిస్తారు. శిలాజాల లోపలి ఖనిజ లవణాల లేదా శిలాజాలున్న శిలలలోని ఐసోటోప్‌ల అర్ధజీవిత కాలాన్ని లెక్కించడం ద్వారా శిలాజాల కాలాన్ని అంచనా వేస్తారు.

- కార్బన్ డేటింగ్ పద్ధతి, రేడియోధార్మిక ఐసోటోపుల గురించి మీ రసాయనశాస్త్ర ఉపాధ్యాయునితో చర్చించండి లేదా గ్రంథాలయం నుండి సమాచారం సేకరించండి. తరగతిగదిలో ప్రదర్శించండి.

కీటసారస్ అనే డైనోసారస్ శిలాజం మన రాష్ట్రంలోని ఆదిలాబాద్ జిల్లా యామనపల్లి వద్ద లభించింది. ఈ అరుదైన గొప్ప శిలాజం దాదాపు 160 మిలియన్ సంవత్సరాల కాలంనాటి పూర్వ జురాసిక్ యుగానికి చెందినది. 14 మీటర్ల పొడవు, 5 మీటర్ల ఎత్తు ఉన్న ఈ శిలాజాన్ని హైదరాబాదులోని బి.యం.బిర్లా సైన్స్ సెంటర్‌లో భద్రపరిచారు.



## మీకు తెలుసా?


ఆర్కియోప్టెరిక్స్

ఆర్కియోప్టెరిక్స్ అనే సంధాన సేతువు దేనిని పోలి ఉంటుంది. పక్షులనా? సరీసృపాలనా? లేదా రెండింటినా? రెండు విభిన్న సమూహాలకు చెందిన లక్షణాలను కలిగి ఉండే జీవులను సంధానసేతువులు అంటారు. ఆర్కియోప్టెరిక్స్ యొక్క శిలాజం పక్షులు, సరీసృపాల నుండి పరిణామక్రమంలో ఉద్భవించాయని తెలియజేస్తుంది. అందువల్ల దీనిని పక్షులకు, సరీసృపాలకు మధ్య సంధానసేతువుగా భావిస్తారు.



## మీకు తెలుసా?

### మానవ పరిణామక్రమం (Human evolution)

ఆధునిక మానవుడు ప్రస్తుత రూపాన్ని సంతరించుకొనే వరకు జరుగుతూ ఉన్న పరిణామ ప్రక్రియనే మానవ పరిణామ క్రమం అంటారు. మొక్కలు, జంతువులన్నింటి మాదిరిగానే మానవునికి కూడా పరిణామ చరిత్ర ఉంటుంది. ఆదిమానవుని వలె కనిపించే జీవులు 7 లక్షల 50 వేల సంవత్సరాలకు పూర్వమే ఈ భూమిపై ఉండేవారు. మానవులకు (హోమో సెపియన్స్) చెందిన అతి పురాతన శిలాజం భూమిపై మానవుల ఉనికి 2 లక్షల 50 వేల సంవత్సరాలకు పూర్వమే ఉన్నట్లు తెలుపుతున్నది. మానవ పరిణామ క్రమాన్ని పరిశీలిద్దాం.

హోమో హాబిలస్ -1.6 - 2.5 మిలియన్ సంవత్సరాల పూర్వం నివసించేవారు.

హోమో ఎరెక్టస్ -1 - 1.8 మిలియన్ సంవత్సరాల పూర్వం నివసించేవారు.

హోమో నియాండర్తలెన్సిస్- లక్ష - 40,000 సంవత్సరాల క్రితం నివసించేవారు.

హోమో సెపియన్స్ (ప్రస్తుత మానవులు) 10000 వేల సంవత్సరాల పూర్వంనుండే నివసిస్తున్నారని తెలుస్తోంది.

భూగోళంపైన నివసించే మానవుల ముఖ్య లక్షణాలలో, జీవన విధానాలలో ఎంతో వైవిధ్యం ఉంటుంది. చాలా కాలంగా ప్రజలందరు భూగోళంపై నివసించే ఇతర మానవ 'జాతుల' గురించి చర్చిస్తున్నారు. చర్మం యొక్క రంగునుబట్టి నల్లజాతి, తెల్లజాతి అని గుర్తించేవారు. ఈ జాతులు రెండూ వేరువేరుగా పరిణామం చెందాయా అని చాలా కాలంగా చర్చిస్తున్నారు. జీవశాస్త్రపరంగా మానవ సమూహాలు సంబంధం లేనివి అని అనడానికి ఏ ఆధారమూ లేదు కాబట్టి మానవులందరూ ఒక్కటే జాతి అని ఒకే మూలాలనుండి పరిణామం చెందారని పై ఆధారాల ద్వారా తెలుస్తోంది.

అంతేకాకుండా కొన్నివేల సంవత్సరాల నుండి మానవులు ఈ భూమిపైన నివసిస్తున్నారు. ప్రస్తుతం మానవ సమాజాలు భూగోళం మీద ఎక్కడ నివసిస్తున్నప్పటకీ మానవులంతా ఆఫ్రికా నుండి వచ్చినవారే! అతిపురాతన మానవుడు హెూమో సెపియన్స్ ఇక్కడే నివసించినట్లు ఆధాలున్నాయి. మన జన్యు సమాచారం కూడా ఆఫ్రికన్ మూలాలనే సూచిస్తోంది. అంటే రెండు మిలియన్ సంవత్సరాల పూర్వం ఇక్కడే మానవులుండేవారు. తరవాత వివిధ కారణాల వల్ల మన పూర్వీకులు ఆఫ్రికాను వదిలి బయటకు వచ్చారు. కొందరు అక్కడే ఉండిపోయారు.



వలసకు బయలుదేరిన వారు ఆఫ్రికా నుండి ఆసియాకు తరువాత మధ్య ఆసియా, యురేషియా, దక్షిణ ఆసియా, తూర్పు ఆసియా ప్రాంతాలకు విస్తరించారు. వారిలో కొందరు ఇండోనేషియా దీవుల నుండి ప్రయాణిస్తూ ఫిలిప్పైన్స్ మీదుగా ఆస్ట్రేలియా చేరారు. అలాగే బేరింగ్ జలసంధి దాటి అమెరికా చేరుకున్నారు. వారంతా ఒకే దారిలో లేదా ఒకే కాలంలో పయనించలేదు. కేవలం ప్రయాణించాలనే నేపంతో ప్రయాణించలేదు. అప్పటి అవసరాలు, కారణాలు వారు ప్రయాణించేలా పురికొల్పి ఉంటాయి. ముఖ్యంగా ముందుకు, వెనుకకు, గుంపులుగా, ఒక్కోసారి కొంత కొంత మంది వేరవుతూ ఒకరికొకరు విడిపోతూ ఆఫ్రికా నుండి దూరంగా, ఆఫ్రికాలోని వివిధ ప్రాంతాలకు ప్రయాణించారు.

- అప్పటి మానవ సమాజాలలో వలసలకు కారణాలు ఏమై ఉంటాయో ఒకచోటునుండి మరొక చోటికి ఎలా ప్రయాణించి ఉంటారో ఆలోచించండి. మీ తరగతిలో చర్చించండి.

భూగ్రహంలోని అన్ని జీవజాతుల వలెనే మానవులు కూడా జీవపరిణామంలో మార్పుచెందినవారే. అలాగే ఇతర జీవజాతులతో పోల్చినపుడు మానవులు సాధ్యమైనంత వరకు సౌకర్యవంతంగా జీవించడానికి ప్రయత్నిస్తూనే ఉంటారు.

### మానవుడు – నడిచే అవశేషాయవాల మ్యూజియం

పరిణామక్రమంలో భాగంగా అవసరంలేని అవయవాలు క్రమంగా క్షీణించిపోతాయి. కానీ అలా క్షీణించి పోకుండా, నిరుపయోగంగా మిగిలిపోయిన అవయవాలనే అవశేషాయవాలు (vestigial organs) అంటారు.

మానవులలో అకస్మాత్తుగా అవశేష అవయవాలు తిరిగి కనిపిస్తుంటాయి. దీనిని "ఆటవిజమ్" అంటారు. ఉదా:– తోక కలిగిన శిశువు.

మన జీర్ణవ్యవస్థలో పెద్దప్రేగుకు అంటుకున్నట్లుగా ఉండే 'ఉండుకం' (appendix) అనే భాగం గురించి మీకు తెలుసు. మానవ జీర్ణక్రియలో అది ఏవిధంగానూ తోడ్పడదు. కానీ కుందేలు వంటి శాకాహారులలో మాత్రం జీర్ణక్రియలో ముఖ్యమైన విధినే నిర్వర్తిస్తుంది. ఉండుకం మాదిరిగా నిరుపయోగంగా ఉండే అవశేషావయవాలు మానవునిలో దాదాపు 180 ఉన్నాయి. ఉదాహరణకు చెవితమ్మె, చర్మంపై కేశాలు, మగవారిలో క్షీరగ్రంథులు మొదలగునవి. అందుచేతనే మానవుడిని 'నడిచే అవశేషావయవాల మ్యూజియం' అని అంటారు.



### కీలక పదాలు

**వైవిధ్యాలు, సంతతి, లక్షణాలు, దృశ్యరూపం, జన్యురూపం, విషమయుగ్మజం, సమయుగ్మజం, స్వతంత్ర వ్యూహన సిద్ధాంతం, యుగ్మవికల్పకాలు, అనువంశికత, శారీరక క్రోమోజోమ్‌లు, లైంగిక క్రోమోజోమ్‌లు, ప్రకృతి వరణం, సహజాత అవయవాలు, పిండాభివృద్ధి నిదర్శనాలు, మానవ పరిణామం.**



### మనం ఏం నేర్చుకున్నాం?

- చాలా దగ్గర సంబంధం గల జీవులలో వైవిధ్యాలు కనిపిస్తాయి.
- వైవిధ్యాలు ఒక తరం నుండి మరొక తరానికి ఎలా అందించబడతాయనే సమస్యను గురించి తెలుసుకోవడానికి 1857వ సంవత్సరంలో గ్రెగర్ జాన్ మెండల్ పరిశోధనలు ప్రారంభించాడు.

- బఠానీ మొక్కల పువ్వుల రంగు, స్థానం, విత్తనాల ఆకారం, రంగు, ఫలం ఆకారం, రంగు, కాండం పొడవు మొదలైన ఏడు ప్రత్యేక లక్షణాలను ప్రయోగాల కోసమై మెండల్ ఎన్నుకున్నాడు.
- బఠానీ మొక్కల మొదటి సంతతి లేదా F1 తరంలోని విత్తనాలు బహిర్గత లక్షణం (పసుపు రంగు) లో ఉంటాయి.
- F2 తరంలో 75% బహిర్గత లక్షణం (పసుపు రంగు) 25% అంతర్గత లక్షణం (ఆకుపచ్చ రంగు) ను చూపుతాయి. దీనినే దృశ్యరూపం అంటారు. దృశ్యరూప నిష్పత్తి 3:1.
- F2 తరంలో 75% పసుపురంగు విత్తనాలలో 25% శుద్ధజాతికి చెందినవి (YY) కాగా, 50% మొక్కలు పసుపురంగు బహిర్గత లక్షణంగా, ఆకుపచ్చ అంతర్గత లక్షణంగా కలిగి ఉన్నాయి. మిగిలిన 25% శుద్ధ ఆకుపచ్చ జాతికి చెందినవి. దీనినే జన్యురూపం అంటారు. జన్యురూప నిష్పత్తి 1:2:1.
- బఠానీ మొక్క ప్రతీ ధర్మానికి లేదా లక్షణానికి బాధ్యత వహించే రెండు కారకాలను కలిగి ఉంటుంది. వాటినే యుగ్మ వికల్పకాలు (allele) అని అంటారు.
- ఒక జత లక్షణాలకు కారణమైన కారకాలు ఇతర లక్షణాలపై ఆధారపడకుండా స్వతంత్రంగా సంతతికి అదించబడడాన్ని 'స్వతంత్ర వ్యూహన సిద్ధాంతం' అని అంటారు.
- పసుపు మరియు ఆకుపచ్చ విత్తనాలనిచ్చే మొక్కల మధ్య సంకరీకరణం జరిపితే సంతతి మొత్తం పసుపు విత్తనాలే ఇస్తుంది. ఎందుకంటే పసుపురంగు బహిర్గత కారకం కనుక.
- జనకులు తమ యుగ్మ వికల్పకాలలోని ఏదో ఒక కారకాన్ని యధేచ్ఛగా సంతతికి అందిస్తారు.
- జనకుల నుండి లక్షణాలు లేదా గుణాలను సంతతి పొందే ప్రక్రియనే 'అనువంశికత' (heredity) అని అంటారు.
- మానవ కణంలో 23 జతల క్రోమోజోమ్‌లుంటాయి. వీటిలో 22 జతలను శారీరక క్రోమోజోమ్‌లని, 1 జతను లైంగిక క్రోమోజోమ్‌లని అంటారు.
- ఆర్జిత లక్షణాలు లేదా గుణాలను సంతతి ద్వారా తరవాత తరాలకు అందించబడతాయని లామార్క్ ప్రతిపాదించాడు. దీనిని ఆర్జితగుణ అనువంశికతా సూత్రం అంటారు.
- ప్రతీ జీవజాతి తమ సంఖ్యను వృద్ధి చేసుకోవడం కోసం అధికంగా సంతతిని ఉత్పత్తి చేస్తాయి. వాటిలో మనుగడ కోసం పోరాటం జరిగి, బలమైనవి మాత్రమే గెలుస్తాయి.
- నిర్మాణసామ్య, క్రియాసామ్య అవయవాలు మరియు పిండాభివృద్ధిలోని వివిధ దశలు పరిణామ సంబంధాలను వివరించడానికి రుజువులుగా ఉపయోగపడతాయి.
- విభిన్న జీవుల్లోని కొన్ని లక్షణాలలో పోలికలు ఉండవచ్చు. ఎందుకంటే అవన్నీ ఒకే పూర్వీకుల నుండి పరిణామక్రమంలో ఏర్పడి ఉండవచ్చు.
- ప్రాచీన యుగాల్లో నివసించిన జీవులు, వృక్షాలు సహజ ప్రక్రియల కారణంగా పూర్తిగా కుళ్ళిపోకుండా మిగిలిపోయిన వాని ఋజువులనే శిలాజాలు అంటారు.



## అభ్యసనాన్ని మెరుగుపరచుకుందాం

1. వైవిధ్యాలు అంటే ఏమిటి? జీవులకు వైవిధ్యాలు ఏవిధంగా ఉపయోగపడతాయి?(AS1)
2. ఒక విద్యార్థి (పరిశోధకుడు) శుద్ధ పొడవు మొక్క (TT)తో శుద్ధ పొట్టి మొక్క (tt)తో సంకరణం జరపాలనుకున్నాడు. మరి F1, F2 తరాలలో ఎలాంటి మొక్కలు వచ్చే అవకాశమున్నది? వివరించండి.(AS1)
3. ఒక శాస్త్రవేత్త జనకతరంలోని ఎలుకల తోకలను కత్తిరించాడు. మరి ఎలుకల సంతతిలో తోకలుంటాయా? ఉండవా? మీ అభిప్రాయాన్ని వివరించండి.(AS1)

4. ఒక మామిడితోటలో ఒక రైతు మామిడి పండ్లు బాగా కాసిన చెట్టునొకదాన్ని చూశాడు. కానీ దానికి తెగుళ్ళు ఉండటం, క్రిమిసంహారక మందులను వాటినట్లు పరిశీలించాడు. అలాగే మరో మామిడి చెట్టును చూశాడు. దానికి క్రిమిసంహారకాలను ఉపయోగించలేదు, కానీ తక్కువ మామిడిపండ్లను కలిగి ఉన్నది. అయితే ఆ రైతు ఎక్కువ మామిడిపండ్లనిచ్చే, క్రిమిసంహారకాలు వాడనవసరం లేని చెట్లుంటే బాగుంటుందని అనుకున్నాడు. మరి ఆ రైతు కోరుకున్న ప్రకారం ఒక కొత్త మామిడి చెట్టును సృష్టించవచ్చా? ఏవిధంగా సాధ్యమవుతుందో వివరించండి.(AS1)
5. ఏక సంకర సంకరీకరణం ప్రయోగాన్ని ఒక ఉదాహరణతో వివరించండి. అనువంశికతా సూత్రాలలో దేనిని మనం అర్థం చేసుకోవచ్చు? వివరించండి.(AS1)
6. స్వతంత్ర వ్యూహన సిద్ధాంతం అంటే ఏమిటి? ఒక ఉదాహరణతో వివరించండి.(AS1)
7. డార్విన్ యొక్క 'ప్రకృతి వరణం' సిద్ధాంతాన్ని ఒక ఉదాహరణతో వివరించండి.(AS1)
8. వైవిధ్యాలంటే ఏమిటి? సరైన ఉదాహరణతో వివరించండి.(AS1)
9. సాధారణంగా ఆవుల్లో మీరు పరిశీలించిన వైవిధ్యాలేమిటి?(AS1)
10. మెండల్, బఠానీ మొక్కలోని ఏయే లక్షణాలను ప్రయోగాల కోసమై ఎన్నుకున్నాడు?(AS1)
11. మెండల్ 'లక్షణాంశాలు' (traits) అనే పదాన్ని ఏవిధంగా ఉపయోగించాడు. ఒక ఉదాహరణతో వివరించండి.(AS1)
12. జనకతరం, F2 తరాల మధ్య మెండల్ గుర్తించిన భేదాలేమిటి?(AS1)
13. శిశువు లింగ నిర్ధారణకు కారణం మగవారే. దీనిని అంగీకరిస్తావా? మీ సమాధానాన్ని ఫ్లోచార్టు ద్వారా వివరించండి.(AS1)
14. నిర్మాణసామ్య, క్రియాసామ్య అవయవాలను గురించి క్లుప్తంగా వివరించండి.(AS1)
15. శిలాజాలకు సంబంధించిన సమాచారాన్ని శాస్త్రవేత్తలు ఎలా ఉపయోగిస్తారు?(AS1)
16. మెండల్ తన ప్రయోగాల కోసం బఠానీ మొక్కను ఎన్నుకున్నాడు. అందుకు గల కారణాలు ఏమై ఉంటాయని మీరు భావిస్తున్నారు?(AS2)
17. లామార్క్ ప్రతిపాదించిన ఆర్జిత గుణాల అనువంశికతా సూత్రం ఒకవేళ సరైనదే అయితే ప్రపంచం ఎలా ఉండేది?(AS2)
18. మీ పరిసరాలలో పెరిగే పూలమొక్కలను పరిశీలించండి. వాటిమధ్య పోలివున్న, వేరువేరుగా ఉన్న లక్షణాలను గుర్తించి రాయండి. (AS3)
19. మీ కుటుంబ సభ్యుల అనువంశికతా సూత్రం లక్షణాలు/ గుణాలను గురించిన సమాచారాన్ని సేకరించండి. సమాచారాన్ని విశ్లేషించి రాయండి.(AS4)
20. జీవ పరిణామ నిదర్శణాలకు సంబంధించిన కింది సమాచారంపై మీ అభిప్రాయాన్ని రాయండి.
"పక్షులు, సరీసృపాలు, ఉభయచరాల మాదిరిగానే క్షీరదాలు నాలుగు కాళ్ళను కలిగి ఉన్నాయి. వీటన్నింటిలో పూర్వాంగాల నిర్మాణం ఒకేవిధంగా ఉన్నప్పటికీ అవి చేయాల్సిన పనులకు అనుగుణంగా అవయవాలు రూపాంతరం చెందాయి.(AS4)
21. 'కార్బన్ డేటింగ్ పద్ధతి' గురించిన సమాచారాన్ని సేకరించండి. భౌతికశాస్త్రాన్ని బోధించే ఉపాధ్యాయులతో ఈ విషయమై ఏమేమి చర్చించారో రాయండి.(AS4)
22. స్వతంత్ర వ్యూహన సిద్ధాంతాన్ని చూపే గదుల చిత్రాన్ని బట్టి ఒక ఫ్లోచార్టును గీయండి. నిష్పత్తిని వివరించండి.(AS5)
23. మెండల్ ప్రయోగాలలోని ఏక సంకర సంకరణం జరిపే విధానం గురించి గళ్ళ చదరాన్ని గీసి వివరించండి.(AS5)
24. గడిచిపోయిన జీవ మహాయుగాలలో మానవ పరిణామం ఎలా జరిగిందో తెలిపేందుకు ఒక చార్టును తయారు చేయండి.(AS5)

25. ప్రకృతి ఉపయోగకరమైన లక్షణాలను మాత్రమే ప్రోత్సహిస్తుందని తెలియజేసేలా ఒక కార్టూన్‌ను తయారుచేయండి.(AS6)
26. 'మనుగడ కోసం పోరాటం'ను అర్థం చేసుకోవడానికి మీ పరిసరాలలోని ఏయే ఉదాహరణలను లేదా ఏయే సందర్భాలను మీరు పరిశీలించారు?(AS7)
27. మానవ పరిణామం గురించి స్వగతం తయారుచేయండి.(AS7)

## కింది ఖాళీలను పూరించండి

1. జీవులలో మార్పులకు దారితీసే విధానాన్ని ____________ అంటారు.
2. మెండల్ ప్రయోగాలు ____________ ను వివరిస్తాయి.
3. స్వతంత్రవ్యూహన సిద్ధాంతాన్ని వివరించే ప్రయోగాలలో పరిశీలించిన లక్షణాలు ____________.
4. ఎరుపు రంగు పుష్పాలున్న మొక్కతో తెలుపు రంగు పుష్పాలున్న మొక్కను పరాగ సంపర్కం చేసినపుడు ఏర్పడే మొక్కల్లో ____________ శాతం అంతర్గత లక్షణంగల మొక్కలుంటాయి.
5. TT, YY లేదా Tt, Yy లలో వ్యక్తమయ్యే లక్షణం ____________.
6. మానవులలో ____________ జతల శారీరక క్రోమోజోములు ____________ జత లైంగిక క్రోమోజోములుంటాయి.
7. జనాభా ____________ శ్రేణిలో పెరుగుతుంటే ఆహార వనరులు ____________ శ్రేణిలో పెరుగుతాయి.
8. సరిగా నడవలేని మేక ఎక్కువకాలం జీవించలేదు. డార్విన్ సిద్ధాంతం ప్రకారం ఇది ____________ ను తెలియజేస్తుంది.
9. తిమింగలంలో ఈదడానికి ఉపయోగపడే వాజములా మారిన ముంజేతి నిర్మాణం గుర్రంలో ____________ కు ఉపయోగపడేలా మార్పు చెంది ఉంటుంది.
10. శిలాజాల గురించి అధ్యయనం చేసే శాస్త్ర విభాగాన్ని ____________ అంటారు.

## సరైన సమాధానాన్ని గుర్తించండి

11. కింది వానిలో గులాబి మొక్కకు సంబంధించి వైవిధ్యానికి దోహదపడనిది. ( )
    (ఎ) రంగులుగల ఆకర్షక పత్రాలు (బి) ముళ్ళు (సి) తీగలు (డి) పత్రం
12. మెండల్ ప్రకారం యుగ్మవికల్పకాలలో ఉండే లక్షణం. ( )
    (ఎ) జన్యువులు జతలుగా ఉండడం (బి) లక్షణానికి బాధ్యత వహించడం
    (సి) బీజకణాల ఉత్పత్తి (డి) అంతర్గ లక్షణంగా ఉండడం
13. ప్రకృతివరణం అనగా ( )
    (ఎ) ప్రకృతి యోగ్యత కలిగిన లక్షణాలను ఎంపిక చేయడం (బి) ఉపయోగంలేని లక్షణాలను ప్రకృతి వ్యతిరేకించడం
    (సి) జీవులతో ప్రకృతి ప్రతిచర్య జరపడం (డి) ఎ, బి.
14. పురాజీవ శాస్త్రవేత్త దీనితో సంబంధం కలిగి ఉంటాడు. ( )
    (ఎ) పిండోత్పత్తి శాస్త్ర నిదర్శనాలు (బి) శిలాజ నిదర్శనాలు
    (సి) అవశేష అవయవ నిదర్శనాలు (డి) పైవన్నీ



# అనుబంధం

## మెండల్ స్వతంత్ర వ్యూహన సిద్ధాంతం (Law of independent assortment)

| ♀ \ ♂ | R Y | R y | r y | r Y |
|---|---|---|---|---|
| R Y | RR YY | RR Yy | Rr Yy | Rr YY |
| R y | RR Yy | RR yy | Rr yy | Rr Yy |
| r y | Rr Yy | Rr yy | rr yy | rr Yy |
| r Y | Rr YY | Rr Yy | rr Yy | rr YY |




ఇంతవరకు మనం మెండల్ నిర్వహించిన ఏక సంకరణ ప్రయోగాల గురించి పరిశీలించాం. ఇప్పుడు రెండు జతల లక్షణాలు ఏవిధంగా ఒకతరం నుండి మరొక తరానికి అందజేయబడతాయో అనే అంశంపై మెండల్ నిర్వహించిన ప్రయోగాలను అధ్యయనం చేద్దాం.

రెండు జతల వేరువేరు లక్షణాల మధ్యజరిగే సంకరణాన్ని ద్విసంకర సంకరణం (Dihybrid cross) అంటారు.

బఠానీ మొక్కలలో పైవిధంగా ద్విసంకర సంకరణం జరపగా, సంతతిలో పసుపు (YY) గుండ్రని (RR) మరియు ముడతలు (rr), ఆకుపచ్చ (yy) లక్షణాలు కనిపించాయి. F1 తరం మొక్కల మధ్య స్వపరాగ సంపర్కం జరిపినపుడు ఆయా లక్షణాలు, ఇతర లక్షణాలతో స్వతంత్రంగా కలిసిపోయి F2 తరం ఏర్పడింది.

గళ్ళ చదరాన్ని జాగ్రత్తగా పరిశీలించండి. ద్విసంకర సంకరణంలో ఏర్పడే వివిధ రకాల కలయికలను గుర్తించండి.

- (1) RRYY (2) RRYy (3) RrYY (4) RrYy (5) RRYy (6) RrYY (7) RrYy (8)RrYy (9) RrYy అనేవి గుండ్రని మరియు పసుపు విత్తనాలనిచ్చేవి.
- (1) RRyy (2) RrYY (3) Rryy అనేవి గుండ్రని మరియు ఆకుపచ్చనివి.
- (1) rrYY (2) rrYy (3) rrYy అనేవి ముడతలు మరియు పసుపుపచ్చనివి.
- rryy అనేవి ముడతలు మరియు ఆకుపచ్చనివి.

పై ఫలితాలను బట్టి ప్రతి లక్షణానికీ కారణమైన కారకం స్వతంత్రంగా ఉంటూ సంయోజబీజాలలో మనగలిగినట్లు నిర్ధారణకు రావచ్చు. అంటే కారకాలనే (Factors) స్వతంత్రమైనవిగా ఉంటూ సంయోగబీజాల ద్వారా అనువంశికంగా సంతతికి అందించబడతాయి అని చెప్పవచ్చు.

ఒక జతకన్నా ఎక్కువ లక్షణాల యొక్క అనువంశికతను గమనిస్తే, ఆ జత లక్షణాలకు కారణమైన కారకాలు వేరే లక్షణాలపై ఆధారపడకుండా స్వతంత్రంగా సంతతికి లభించడాన్ని లేదా అందించడాన్ని స్వతంత్ర వ్యూహన సిద్ధాంతమని అంటారు.

ప్రతి లక్షణానికి కారణమైన లేదా నియంత్రించే ఒక జత కారకాలుంటాయని మెండల్ భావించాడు. ప్రస్తుతం ఆ కారకాలనే మనం 'జన్యువులు (Genes) అని అంటున్నాం. ప్రతి లక్షణానికి కారణమైన ఒక జత జన్యువులనే యుగ్మవికల్పకాలు (Allele) అంటారు. యుగ్మ వికల్పకాలు రెండు రకాలు. ఒక లక్షణానికి రెండూ ఒకే రకమైన కారకాలుంటే దానికి సమయుగ్మజం (Homozygous) (YY, RR) అనీ, ఒక లక్షణానికి వ్యతిరేక లక్షణాలున్న జన్యువులు జతగా ఉంటే దానిని విషమయుగ్మజం (Heterozygous) (Ry, Rr) అని అంటారు.

- మెండల్ ప్రయోగాలను సులభంగా అర్థం చేసుకోడానికి కింది ఆట ఆడుదాం.

| ♀ \ ♂ | E | F | G | H |
|---|---|---|---|---|
| A | 1 | 2 | 3 | 4 |
| B | 5 | 6 | 7 | 8 |
| C | 9 | 10 | 11 | 12 |
| D | 13 | 14 | 15 | 16 |

ఎనిమిది పొడవైన చార్టు ముక్కలు తీసుకోండి. వానిలో ఒక్కొక్కటి స్త్రీ, పురుష సంయోగబీజాలను సూచిస్తాయని అనుకోండి. వాటిని A, B, E, F గడులలో ఒక్కొక్క దానిలో రెండు చొప్పున పెట్టండి. తరవాత E మరియు A గడులలో ఉన్న చార్టులను 1 సంఖ్య ఉన్న గడిలోకి జరపండి. E మరియు B లలోని చార్టు ముక్కలను 5 సంఖ్య ఉన్న గడిలోకి జరపండి. అలాగే F మరియు A లలోని చార్టులను 2లోకి, F మరియు B లలోని చార్టులను 6 గడిలో జరపండి. ఇప్పుడు 1, 2 మరియు 5, 6 గడులలలో రెండు పొడవాటి చార్టుముక్కలు ఉంటాయి.

**చర్చించండి:**

శుద్ధజాతి గురించి ఏమి అర్థం చేసుకున్నారు?

ఇదేవిధంగా చిన్న చార్టు ముక్కలను, ఇతర లక్షణాలుగా ఊహించుకొని మీ మిత్రులతో కలిసి ఆడండి. మీరు గుర్తించిన అంశాలపై మిత్రులతో కలసి ఆలోచించి, చర్చించి నివేదిక రాయండి.

**ఆట-2: ఏక సంకర సంకరణం (Monohybrid cross)**

నాలుగు పొడవైన, నాలుగు పొట్టి చార్టుముక్కలను తీసుకొని, ఒక జత పొడవు చార్టు ముక్కలను A, B గడులలోను, ఒక్కొక్క జత పొట్టి చార్టులను E, F గడులలోను ఉంచండి.

A మరియు E గడులలోని ఒక్కో చార్టును 1వ గడిలోకి జరపండి.

B మరియు E గడులలోని ఒక్కో చార్టును 5వ గడిలోకి జరపండి.

A మరియు F గడులలోని ఒక్కో చార్టును 2వ గడిలోకి జరపండి.

B మరియు F గడులలోని ఒక్కో చార్టును 6వ గడిలోకి జరపండి.

చర్చించండి: F1 తరం గురించి మీరేం అర్థం చేసుకున్నారు.

## ఆట-3: ద్వి సంకర సంకరణం (స్వతంత్ర జన్యు వ్యూహన సిద్ధాంతం)

16 పొడవు చార్టుముక్కలు, 16 పొట్టి చార్టుముక్కలు, 16 ఎర్రగుండీలు, 16 తెల్ల గుండీలను తీసుకోండి.

4 పొడవు చార్టుముక్కలను A, B, E, F (4+4+4+4=16) గదులలో పెట్టండి.

4 చిన్న చార్టుముక్కలను C, D, G, H (4+4+4+4=16) గదులలో పెట్టండి.

4 ఎర్ర గుండీలను A, C, E, G (4+4+4+4=16) గదులలో పెట్టండి.

4 తెల్ల గుండీలను A, C, E, G (4+4+4+4=16) గదులలో పెట్టండి.

తరవాత

A, E గదులలోని ఒక చార్టు ముక్క, ఒక గుండీని 1వ గదిలోనికి జరపండి.

(ఒక గదిలో రెండు చార్టు ముక్కలు, 2 గుండీలు మొత్తం 4 ఉంటాయి.

B, E గదులలోని ఒక చార్టు ముక్క, ఒక గుండీని 5వ గదిలోని జరపండి.

C, E గదులలోని ఒక చార్టు ముక్క, ఒక గుండీని 9వ గదిలోనికి జరపండి.

D, E గదులలోని ఒక చార్టు ముక్క, ఒక గుండీని 13వ గదిలోనికి జరపండి.

ఇదేవిధంగా అన్ని గదులకు చార్టుముక్కలు మరియు గుండీలను జాగ్రత్తగా జరపండి.

### చర్చించండి:

స్వతంత్ర వ్యూహన సిద్ధాంతం గురించి ఏమి అర్థం చేసుకున్నారు? మిత్రులతో కలిసి ఆలోచించండి, చర్చించండి. (మీ ఉపాధ్యాయుల సహాయం తీసుకోండి) పొడవు మరియు ఎరుపు బహిర్గత లక్షణాలుగా, పొట్టి మరియు తెలుపు అంతర్గత లక్షణాలుగా భావించండి.

కింది గదులలో ఏ లక్షణాలు రావడానికి అవకాశమున్నదో రాయండి.

I. కింది గదులలో

1. పొడవు మరియు ఎరుపు 2. ..................................
3. .................................. 4. ..................................
5. .................................. 6. ..................................
7. .................................. 8. ..................................
9. .................................. 10. ...............................
11. ...............................

II. కింది గదులలో

4. .................................. 8. ..................................
12. ...............................

III. కింది గదులలో

13. ............................... 14. ...............................
15. ...............................

IV. కింది గదులలో

16. ...............................



పాఠం

9

# మన పర్యావరణం

మనలో ప్రతి ఒక్కరికి మనచుట్టూ ఉన్న పరిసరాలతో పరిచయం ఉంటుంది. మనచుట్టూ ఉన్న పరిసరాలు జీవుల మనుగడ మీద ప్రభావం చూపిస్తాయి. జీవజాలం మీద ప్రభావం చూపే జీవ, భౌతిక కారకాలతోపాటూ రసాయన కారకాలన్నింటితో గల పరస్పర సంబంధాన్ని పర్యావరణం (Environment) అంటారు. జీవులు తమచుట్టూ ఉన్న సజీవ నిర్జీవ అంశాలతో సమతుల్యత సాధించడానికి నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంటాయి. జీవావరణం (Biosphere) లో ఉండే అంశాలన్నీ క్రమ పద్ధతిలో జీవజాలంతో ప్రతిచర్యలు జరుపుతూనే ఉంటాయి. జీవజాలం మనుగడ సాగించడానికి నెమ్మదిగా పరిణామం చెందడానికి ఇవి తోడ్పడతాయి. గాలి, నేల, నీరు, కాంతి మొదలైన భౌతిక కారకాలను నిర్జీవ కారకాలు (Abiotic) అనీ, జీవజాలాన్నంతటినీ (వృక్షజాలం, జంతుజాలం) కలిపి సజీవ కారకాలు (Biotic) అని అంటారు. జీవులు నివసించే ప్రదేశాన్ని ఆవాసం అంటారు. ఒకజీవి తన అవసరాలకు కావాల్సిన సౌకర్యాలను తానే సమకూర్చుకోలేదు. జీవులు తమ మనుగడ కోసం చేసే కార్యక్రమాలు పరిసరాలలోని ఇతర అంశాల మీద ప్రభావం చూపవచ్చు. ఒక్కొక్కసారి దానివల్ల ఏర్పడే నష్టం పరిసరాల సమతుల్యతను దెబ్బతీయవచ్చు.

ఆహారపు గొలుసులు (Food chains), ఆహార జాలకం (Food web) గురించి జీవరాశులు వాటి మధ్య గల ఆహార పరమైన సంబంధాన్ని గురించి మీరు కింది తరగతుల్లో నేర్చుకున్నారు కదా! ఏదైనా ఆహారపు గొలుసును పరిశీలించినట్లయితే ఒక ఆహారపు గొలుసుకు మరొక ఆహారపు గొలుసుతో సంబంధం ఉన్నట్లు కనిపిస్తుంది. ఇలా ఆహారపు గొలుసులన్నీ కలిసి ఆహార జాలకాన్ని ఏర్పరచడాన్ని గమనించవచ్చు. ఒక ఆహారపు గొలుసును పరిశీలిస్తే ఏది దేనిని ఆహారంగా స్వీకరించే అలవాటును పెంపొందించు కుంటుందో అర్థం చేసుకోవచ్చు.



పటం-1: ఆహార సంబంధాలు

ఆహార జాలకంలో ఉండే బాణపు గుర్తులు ఆహారానికీ దానిని గ్రహించే జీవికి (స్వీకర్త) మధ్య గల సంబంధాన్ని సూచిస్తాయి.

పటం-1లో ఉన్న జీవులను పరిశీలించండి. వాటి మధ్యగల ఆహార సంబంధాలను బాణపు గుర్తులతో చూపుతూ ఆహారపు గొలుసును తయారు చేయండి.

- మీరు రాసిన లేదా తయారు చేసిన ఆహారపు గొలుసులోని ఉత్పత్తిదారులు మరియు వినియోగదారుల పేర్లను రాయండి.
- మీరు గీసిన బాణపు గుర్తులు దేనిని సూచిస్తాయి?
- మీ పరిసరాలలో కనీసం నాలుగు ఆహారపు గొలుసులను గుర్తించండి. వీటిలోని ఉత్పత్తిదారులు, వివిధ స్థాయిలలోని వినియోగదారుల పేర్లను రాయండి.

మీ పరిసరాలలో వివిధ ఆహారపు గొలుసులను గుర్తించే సమయంలో వాటి పొడవు తక్కువగా ఉండడం, నాలుగు స్థాయిలకన్నా మించి ఉండకపోవడాన్ని మీరు గమనిస్తారు. అంతేకాకుండా ఆహారపు గొలుసులో ఉత్పత్తిదారుల నుండి వినియోగదారుల వరకు (ప్రథమ, ద్వితీయ, తృతీయ) వెళ్ళేకొద్దీ ప్రతిస్థాయిలో జీవుల సంఖ్య తగ్గుతుండడం గమనిస్తారు.

సజీవ అంశాలు వాటిమధ్య ఆహార సంబంధాలను కలిగిఉంటాయి. ఆహార సంబంధాలను దృష్టిలో ఉంచుకొని ఆవరణ వ్యవస్థలో ఆహారం ఉత్పత్తిదారుల నుండి దశల వారీగా వినియోగదారులకు చేరుతుంది.







**కొన్ని ఉదాహరణలు పరిశీలిద్దాం.**

గడ్డి → మిడత → కప్ప → పాము → గద్ద

గడ్డి → కుందేలు → నక్క → తోడేలు

గడ్డి → మేక → మానవుడు

- ఆహారపు గొలుసులు చాలా వరకు నాలుగు స్థాయిలనే ఎందుకు కలిగి ఉంటాయి?
- ఉత్పత్తిదారుల నుండి వినియోగదారులకు వెళ్ళేకొద్దీ జీవుల సంఖ్య ఎందుకు తగ్గుతుంది?

ఈ ప్రశ్నలకు జవాబులు తెలియాలంటే కింది తరగతులలో చర్చించబడిన కొన్ని విషయాలను మనం గుర్తుకు తెచ్చుకోవాలి. 8వ తరగతిలో వివిధ ఆవరణ వ్యవస్థలు అనే పాఠంలో పేర్కొన్న విధంగా శక్తి ఆహారంనుండి లభిస్తుంది. కాబట్టి శక్తికి మూలం సూర్యకాంతి అని చెప్పవచ్చు. ఒక జీవి నుండి మరొక జీవికి ఏవిధంగా శక్తి బదిలీ అవుతుందో ఆహారపు గొలుసు చూపుతుంది. ఈ బదిలీలో ఎక్కువ మొత్తంలో (80 నుండి 90%) శక్తి జీవుల నుండి శ్వాసక్రియలోనూ, ఇతర క్రియల ద్వారా ఉత్పత్తి అయిన ఉష్ణం రూపంలో నష్టపోవడం జరుగుతుంది. ఆహారపు గొలుసులోని మూడు స్థాయిల తరవాత శక్తి మాత్రమే ఉన్నత స్థాయి వినియోగదారులకు అందుబాటులో ఉంటుంది.

జీవావరణంలో ఎన్నో ఆవరణ వ్యవస్థలున్నాయి. భూమధ్యరేఖకు, ధృవాలకు మధ్యగల శీతోష్ణస్థితిలోని వ్యత్యాసాలే భౌమ్యావరణ వ్యవస్థలను నిర్ధారిస్తాయి. అదే విధంగా ఆఫ్రికాలోని భూమధ్యరేఖకు దగ్గరగా ఉన్న కిలిమంజారో పర్వతాన్ని, మన దేశంలోని హిమాలయ పర్వతాలను

అధిరోహించేటపుప్పుడు ఆవరణ వ్యవస్థలలో వ్యత్యాసాలను మనం గమనించవచ్చు. పర్వత పాదాలలో ఉండే వర్షపాత అడవుల (Tropical rain forests)తో మొదలై పర్వత శిఖర ప్రాంతంలో నిరంతరం మంచు, హిమపాతంతో అంతమవుతుంది.

శీతోష్ణస్థితిని ప్రభావితం చేసే వర్షపాతం, ఉష్ణోగ్రత, సూర్యరశ్మి మొదలైనవన్నీ ఆవరణ వ్యవస్థలను నిర్ణయిస్తాయి. ఉదాహరణకు అధిక వర్షపాతం ఉన్నచోట అడవులు అధికంగా ఉంటాయి. కానీ ఆ అడవుల రకాన్ని నిర్ణయించేది ఉష్ణోగ్రత మరియు కాంతి. అదేవిధంగా అత్యల్ప వర్షపాతం ఉన్న ప్రాంతాలలో ఎడారులుంటాయి.



పటం-2: వివిధ ఆవరణ వ్యవస్థలలోని ఆహారపు గొలుసులు

'ఆహారపు గొలుసు' అనే పదం సూచించినట్లుగా, జీవుల మధ్య ఆహార సంబంధాలు అత్యంత సరళంగా గానీ లేక మార్పులకు లోను కాకుండా గానీ ఉండవు. ఉదాహరణకు కీటకాహార పక్షులు ఎఫిడ్లతోపాటు మిడతలు, అక్షింత పురుగులను మరియు ఇతర రకాల కీటకాలను తింటాయి. మరోవైపు గ్రద్దలు, రాబందులు వివిధ రకాల పక్షులను మరియు చిన్న క్షీరదాలను ఆహారంగా తీసుకుంటాయి. అందుచేతనే ఈ సందర్భంలో ఆహారపు జాలకం (Foodweb) అనే పదాన్ని వాడడం సబబుగా ఉంటుంది. ఎందుకంటే ఇది పొడవైన, అధిక సంఖ్యలో సాధ్యపడే ఆహార సంబంధాలను సూచించడమే కాకుండా మొత్తం సముదాయం ఒక సంక్లిష్టమైన అంతర సంబంధాలతో జరిగే ప్రయాణమనే వాస్తవాన్ని ప్రతిబింబిస్తుంది. సూర్యుని నుండి గ్రహించబడిన శక్తి, ఒక పోషకస్థాయి నుండి తరవాత పోషక స్థాయికి అందించబడుతూ ఆవరణ వ్యవస్థ అంతా ప్రసరిస్తుంది.

పటం–2ను పరిశీలిద్దాం. ఆకులు రాలే అడవులలో నివసించే జీవుల మధ్యగల సంబంధాలను ఈ పటం చూపుతుంది. ఆహారపు వలలోని జంతువులు ప్రత్యేక స్థానాలను ఆక్రమించుకొని ఉండడం పటంలో చూడవచ్చును. ప్రతి జంతువు ఆహార జాలకంలో ఒక నిర్దిష్ట స్థానాన్ని కలిగి ఉంటుంది. దీనిని ఆ జంతువు యొక్క ఆహార జాలకపు ఆవాసం లేదా 'నిచ్' (Niche) అని వర్ణిస్తారు. ఉదాహరణకు, ఆకుల నుండి రసాలను పీల్చే ఎఫిడ్లు అనే కీటకాలకు ఒక నిచ్ ఉంటే ఆకులను చిన్నచిన్న ముక్కలుగా చేసే లేదా కొరికే దవడలున్న గొంగళి పురుగులకు మరొక నిచ్ ఉంటుంది. మొక్కల నుండి ఆహారాన్ని గ్రహించే జింక వంటి జంతువులూ ఒక నిచ్‌ను కలిగి ఉన్నాయి. ఈ జంతువులన్నీ ఆకులనే తింటాయి. కానీ, ఇవి పరిమాణంలోనూ మరియు ఆహారాన్ని గ్రహించే విధానంలోనూ వ్యత్యాసాన్ని చూపుతాయి. కావున 'నిచ్' అనే పదం, ఆహార జాలకంలో జంతువు ఆక్రమించిన సరైన స్థానాన్ని మరియు ఆహారాన్నే కాకుండా, దాని జీవన విధానాన్ని తెలుపుతుంది. ఆవాసం అనేది జంతువు యొక్క నివాస స్థలమైనట్లే 'నిచ్' దాని జీవనశైలిని అంటే ఆ జీవి చేసే పనిని సంచరించే ప్రదేశాలను ఆహారం పొందే విధానాన్ని మొదలైన వాటన్నింటినీ స్పష్టంగా వర్ణిస్తుంది.

- మీ ఉపాధ్యాయునితో మరొక ఉదాహరణతో నిచ్ గురించి చర్చించండి.

## ఆహారపు జాలకం



పటం-3: ఆహారపు జాలకం

ప్రకృతిలో ఆహారపు గొలుసులు సామాన్యమైనవిగా సరళంగా, రేఖీయంగా ఉండవు. తరచుగా అవి ఒకదానితో ఒకటి అనుసంధానమై ఉంటాయి. దీనికి కారణం ప్రతి పోషక స్థాయిలోని వినియోగదారులకు వివిధ రకాల ఆహారాలను ఎంచుకునే అవకాశం ఉంటుంది. ఉదాహరణకు పటం-3లో చూపిన విధంగా పాములు కప్పలను, ఎలుకలను మరియు చిన్న పక్షులను ఆహారంగా తీసుకుంటాయి. అదేవిధంగా కొంగలు చేపలను మరియు కప్పలను భుజిస్తాయి. ఫలితంగా ఆహారపు గొలుసులు శాఖీయంగా ఉంటూ వివిధ పోషక స్థాయిలలో ఒకదానితో మరొకటి అనుసంధానించబడి జాలకం వంటి నిర్మాణాన్ని ఏర్పరుస్తాయి. దీనినే **ఆహారపు జాలకం** అంటారు.

- ఇచ్చిన ఆహారపు జాలకపు పటాన్ని పరిశీలించి, రెండు ఆహారపు గొలుసులను గీయండి.

## జీవావరణ పిరమిడ్లు

ఆహారపు గొలుసు జీవుల మధ్య ఆహార సంబంధాలను వివరించినట్లుగానే జీవావరణ శాస్త్ర పిరమిడ్లు ఒక జీవి నుండి మరొక జీవికి జరిగే శక్తి ప్రసరణను తెలుపుతాయి. ఈజిప్ట్‌లోని పిరమిడ్ల గురించి మీరు వినే ఉంటారు. ఆహారపు గొలుసులోని జీవుల మధ్య సంబంధాలను చూపడానికి లేదా వర్ణించడానికి ఆవరణ శాస్త్రవేత్తలు 'పిరమిడ్' (Pyramid) అనే భావనను ఉపయోగిస్తారు. వివిధ పోషక స్థాయిలలో ఆవరణ వ్యవస్థ యొక్క నిర్మాణాన్ని పిరమిడ్ రూపంలో రేఖాత్మకంగా చూపే చిత్రాన్ని 'జీవావరణ పిరమిడ్' (Ecological pyramid) అంటారు. బ్రిటీష్ ఆవరణ శాస్త్రవేత్త 'చార్లెస్ ఎల్టన్' 1927లో ఆవరణశాస్త్ర పిరమిడ్ రేఖాచిత్రాలను ప్రప్రథమంగా ప్రవేశపెట్టాడు. పిరమిడ్ పీఠభాగంలో ఉత్పత్తిదారులు (ప్రథమ పోషకస్థాయి), వాటిపై క్రమంగా ఇతర పోషకస్థాయిలు (ప్రథమ, ద్వితీయ, తృతీయ వినియోగదారులు) ఒకదానిపై ఒకటి చొప్పున పిరమిడ్ శిఖరం వరకు అమరి ఉంటాయి.

ఆవరణశాస్త్ర పిరమిడ్లు మూడు రకాలుగా ఉంటాయి. అవి 1. సంఖ్యాపిరమిడ్లు 2. జీవద్రవ్యరాశి పిరమిడ్లు 3. శక్తి పిరమిడ్లు. ఈ పాఠంలో మనం వివిధ రకాల పిరమిడ్లు అవి ఏర్పడే విధానాలు, లక్షణాలు, పర్యవసానాల గురించి చర్చిద్దాం.



### మీకు తెలుసా?

పిరమిడ్ నిర్మాణం జ్యామితీయ ఆకృతిలో ఉంటుంది. బయటి ఉపరితలాలు త్రిభుజాకారంలో ఉండి వాటి చివరలు పైకొనలో కలుస్తాయి. పిరమిడ్ అడుగుభాగం త్రిముఖీయంగా లేదా చతుర్ముఖీయంగా లేదా బహుముఖీయ ఆకారంలో ఉంటుంది. చతురస్రాకార పిరమిడ్‌లలో చతురస్రాకారంగా ఉండి బయటి ఉపరితలాలు మాత్రం త్రిభుజాకారంలో ఉంటాయి. సాధారణంగా పిరమిడ్‌లు ఈ ఆకృతిలోనే ఉంటాయి.

## సంఖ్యా పిరమిడ్లు (Pyramid of numbers)



పటం-4: సంఖ్యా పిరమిడ్

జీవుల మధ్య ఆహార సంబంధాలపైన అధ్యయనం చేయడమే కాకుండా జీవశాస్త్రవేత్తలు పోషకస్థాయిలలోని జీవుల సంఖ్యను పోల్చడంపై ఆసక్తి కనబరిచారు. ఒక ఆహారపు వలను ఉదాహరణగా తీసుకొని, ప్రతి పోషకస్థాయిలో ఉన్న జీవుల సంఖ్యను పోల్చుతూ అంచనావేద్దాం. జీవుల సంఖ్యను పోల్చడంలో 'చాలా ఎక్కువ, ఎక్కువ, తక్కువ, అతి తక్కువ' అనే పదాలను ఉపయోగించవలసి ఉంటుంది. జీవుల సంఖ్యల మధ్య ఏదైనా సంబంధం ఉన్నదా? వివిధ పోషక స్థాయిలలో గల జీవుల పరిమాణాలను పోల్చవచ్చా?

ఆహారపు గొలుసులోని జీవుల సంఖ్యను పిరమిడ్ అనే రేఖాపటం ద్వారా చూపవచ్చును. పిరమిడ్‌లోని ప్రతిభాగం ఆహారపు గొలుసులోని ప్రతి పోషకస్థాయి (Trophic level)లో గల జీవుల సంఖ్యను సూచిస్తుంది. ప్రథమ వినియోగదారుల స్థాయి నుండి అతిపెద్ద మాంసాహారుల వరకు, ఆహారపు గొలుసులోని ప్రతి పోషకస్థాయిలో, సాధారణంగా జీవుల పరిమాణం పెరుగుతూ ఉంటుంది. కానీ జీవుల సంఖ్య తగ్గుతూ ఉంటుంది. ఉదాహరణకు పటం-5 చూడండి. అడవిలో ఎఫిడ్స్ చిన్నవిగా, ఎక్కువ సంఖ్యలో ఉంటాయి. ఎఫిడ్స్‌ను ఆహారంగా గ్రహించే అక్షింతల పురుగులు పరిమాణం పెద్దదిగాను, సంఖ్య తక్కువగాను ఉంటుంది. ఈ పురుగులను తినే కీటకాహారులైన గ్రద్దలు లేదా రాబందుల పరిమాణం అతిపెద్దగాను, సంఖ్య అతి తక్కువగాను (రెండు వరకు ఉండవచ్చు) ఉంటుంది. ఈ సంబంధాన్ని పిరమిడ్ రూపంలో స్పష్టంగా చూపవచ్చును.

- కింద ఇవ్వబడిన ఆహారపు గొలుసులకు, సంఖ్యా పిరమిడ్‌లను గీయండి.

  1) మర్రిచెట్టు ⟶ కీటకాలు ⟶ వడ్రంగిపిట్ట

  2) గడ్డి ⟶ కుందేలు ⟶ తోడేలు

- పై రెండు ఆహారపు గొలుసుల సంఖ్యా పిరమిడ్ల నిర్మాణం ఒకేవిధంగా ఉందా?
- వ్యత్యాసాలేమైనా ఉన్నాయా? ఉంటే అవి ఏమిటి?


పటం-5: సంఖ్యాపిరమిడ్

సాధారణంగా అన్ని ఆవరణ వ్యవస్థల సంఖ్యా పిరమిడ్ ఆకారం నిట్టనిలువుగా ఉంటుంది. కొన్ని పరిస్థితులలో అంటే ఒక చెట్టు ఉత్పత్తిదారు అయినపుడు లేదా ఏదైనా పోషకస్థాయిలో జీవుల సంఖ్య ఉత్పత్తిదారులకన్నా ఎక్కువగా ఉన్నప్పుడు పిరమిడ్ నిర్మాణం మారుతుంది. పిరమిడ్ నిర్మాణం ఏవిధంగా ఉన్నా, ఉత్పత్తిదారులు పీఠభాగాన్నే ఆక్రమిస్తాయి.

## జీవద్రవ్యరాశి పిరమిడ్లు (Pyramid biomass)

### జీవద్రవ్యరాశి అంటే ఏమిటి?




పటం-6: జీవద్రవ్యరాశి పిరమిడ్ (కొలను)

కిరణజన్య సంయోగక్రియలో, సూర్యరశ్మి సహాయంతో కార్బన్ డై ఆక్సైడ్ స్థాపన ద్వారా ఏర్పడిన జీవ సంబంధ కర్బన పదార్థమే జీవ ద్రవ్యరాశి (ఇది కిరణజన్య సంయోగక్రియలో సూర్యరశ్మి సహాయంతో కార్బన్ డై ఆక్సైడ్ స్థాపన ద్వారా ఏర్పడుతుంది). చెట్లు, గుల్మాలు, పంటలు, గడ్డి, శైవలాలు, నీటి మొక్కలు, వ్యవసాయ మరియు అటవీ సంబంధ అవశేషాలు, మొక్కల జంతువుల విసర్జితాలన్నీ జీవ ద్రవ్యరాశులే. శక్తిగా మార్చడానికి వీలైన వృక్ష, జంతు సంబంధ పదార్థాన్ని జీవ ద్రవ్యరాశి (Biomass) అంటారు. జీవ ద్రవ్యరాశిని శక్తి ఉత్పత్తి కోసం వినియోగిస్తే, అది జీవశక్తి (Biofuel) అవుతుంది.

ప్రతి పోషకస్థాయిలోని జీవద్రవ్యరాశి పరిమాణాన్ని, వివిధ పోషకస్థాయిలలో ఉన్న రాశుల మధ్య గల సంబంధాన్ని తెలియజేస్తుంది. భౌమ్యావరణ వ్యవస్థలలో, ఉత్పత్తిదారుల నుండి మాంసాహారుల వరకు జీవద్రవ్యరాశి క్రమంగా తగ్గుతూ ఉంటుంది. అందువల్ల జీవ ద్రవ్యరాశి పిరమిడ్ల నిర్మాణం నిటారుగా ఉంటుంది. జలావరణ వ్యవస్థలో ఉత్పత్తిదారుల జీవ ద్రవ్యరాశి ఇతర పోషక స్థాయిలలో ఉన్న జీవుల జీవ ద్రవ్యరాశి కంటే చాలా తక్కువగా ఉంటుంది.

- *పిరమిడ్‌లు ఎప్పుడూ శీర్షాభిముఖంగా/నిటారుగానే (upright) ఉంటాయా?*

ఉదాహరణకు జలావరణ వ్యవస్థలో ఉత్పత్తిదారులైన నీటిలో తేలే మొక్కల జీవ ద్రవ్యరాశి, వీటిని ఆహారంగా తీసుకొనే క్రస్టేషియన్లు మరియు శాకాహార చేపల జీవ ద్రవ్యరాశికన్నా చాలా తక్కువ. చిన్న చేపలను తినే పెద్ద, మాంసాహార చేపల జీవ ద్రవ్యరాశి చాలా ఎక్కువగా ఉంటుంది. అందువల్ల ఈ విధమైన పిరమిడ్ నిర్మాణం తలకిందులుగా ఉంటుంది. ఆహారపు గొలుసులోని ఒక పోషక స్థాయి నుండి తరవాత పోషకస్థాయికి 10 నుండి 20% వరకు జీవ ద్రవ్యరాశి బదిలీ అవుతుంది.

సంఖ్యాపిరమిడ్‌ను తిరగ తిప్పినట్లయితే జీవ ద్రవ్యరాశి పిరమిడ్ ఏర్పడుతుంది. పోషక స్థాయిల మధ్యగల ఆహార సంబంధాలను అర్థం చేసుకోడానికి సులభంగా ఉంటుంది. ఎఫిడ్ల జనాభా గడ్డిపై ఆధారపడి ఉత్పత్తి చేసిన జీవ ద్రవ్యరాశిని సూచిస్తుంది. అక్షింతల పురుగుల జీవద్రవ్యరాశికి ఇది ఆధారమవుతుంది. ఇదే విధంగా ఈ జీవ ద్రవ్యరాశి ఆహారపు గొలుసు చివరి వరకు కొనసాగుతుంది. అంటే ఆవరణ వ్యవస్థలో జీవ ద్రవ్యరాశి ఒక పోషక స్థాయి నుండి తరవాత పోషకస్థాయికి ఆహారమవుతుందని మనం క్లుప్తంగా చెప్పవచ్చు.



### మీకు తెలుసా?

శిలాజ ఇంధనాలపై (భూమిలో మృత కళేబరాల అవాయు విచ్ఛిన్న క్రియ ద్వారా ఏర్పడిన పెట్రోలియం, బొగ్గు మొదలైన ఇంధనాలు) మనం ఆధారపడడాన్ని తగ్గించడానికి, గాలి కాలుష్యాన్ని తగ్గించడానికి, జీవ ద్రవ్యరాశిని కూడా ఒక ఇంధన వనరుగా వినియోగించవచ్చును. జీవ ద్రవ్యరాశిని ఇంధనంగా వాడినపుడు కూడా కార్బన్ డై ఆక్సైడ్ విడుదలవుతుంది. కానీ, అది జీవ ద్రవ్యరాశి ఏర్పడడానికి, తిరిగి గాలి నుండి గ్రహించబడుతుంది.

ఒక పోషకస్థాయిలోని జీవ ద్రవ్యరాశి, మరొక పోషక స్థాయిలోని జీవ ద్రవ్యరాశి కన్నా ఎక్కువగా గాని, తక్కువగా గాని ఉంటుంది. జీవ ద్రవ్యరాశి అనేది అందుబాటులో ఉన్న మొత్తం ఆహారానికి కొలమానం. జంతువులు తమ ఆహారాన్ని గ్రహించినపుడు, దానిలోని కొంతభాగం మాత్రమే తరవాత పోషకస్థాయికి ఆహారమయ్యే కొత్త కణజాలాలు ఏర్పడడానికి వినియోగించబడుతుంది. జంతువులు ఆహారంగా గ్రహించిన జీవ ద్రవ్యరాశిలో కొంత భాగం జీవించటానికి అవసరమైన శక్తి కొరకు వినియోగించబడుతుంది. మిగిలినవి శరీరం బయటకు పంపబడుతుంది.

జంతువులలో అవి గ్రహించిన ఆహారాన్ని శారీరక కణజాలంగా మార్చుకునే సామర్థ్యం తక్కువగా ఉంటుందని, జీవ ద్రవ్యరాశి పిరమిడ్ తెలుపుతుంది. మిగిలిన ఆహారం జీర్ణం కాకుండా విసర్జింపబడుతుంది లేదా పోషణ వంటి క్రియలకు అవసరమయ్యే శక్తి ఉత్పత్తికి, శ్వాసక్రియలో విచ్ఛిన్నం చేయబడుతుంది. చాలా జంతువులు, తాము గ్రహించిన ఆహారంలో 10% కంటే మించకుండా, శరీర కణజాలాలు తయారవడంలో వినియోగించుకుంటాయి. కొన్ని శాకాహారులు అతితక్కువగా మాత్రమే శక్తిని ఉపయోగించు కుంటాయి. చేపలను ఆహారంగా తీసుకునే మానవుడు ఉన్న ఆహారపు గొలుసును ఉదాహరణగా తీసుకొని మరింత వివరంగా అధ్యయనం చేద్దాం. ఈ ఆహారపు గొలుసులో, సముద్రంలోని ఉపరితల నీటిలో తేలియాడే మొక్కలు (వృక్ష ప్లవకాలు–Phytoplanktons) ఉత్పత్తిదారులు. ఇవి సూర్యకాంతి నుండి శక్తిని శోషిస్తాయి. నీటిపై తేలే జంతుజాలం (జంతుప్లవకాలు– Zoo planktons) ఈ మొక్కలను ఆహారంగా గ్రహిస్తాయి. ఈ జంతు ప్లవకాలను చేపలు తింటాయి. ఆహారపు గొలుసులో చివరిగా చేపలను మానవుడు ఆహారంగా గ్రహిస్తాడు.

### శక్తి పిరమిడ్ (Phyramid of energy)




పటం-7: శక్తి పిరమిడ్

జీవులలో పెరుగుదలకు మరియు శరీర భాగాల నిర్మాణానికి, క్షీణించిన భాగాల పునర్నిర్మాణానికి అవసరమయ్యే పదార్థాలు మరియు శక్తికి ఆహారం ముఖ్యమైన వనరుగా ఉంటుంది. స్వభావ రీత్యా ఆహారం ఒక రసాయన శక్తి. ఇది నిలువ చేయబడిన స్థితిశక్తి రూపంలో ఉంటుంది. నిరంతరం పదార్థాలను గ్రహించడానికి, సేంద్రీయ పదార్థాల ఉత్పత్తికి మరియు సేంద్రీయ పదార్థాల నుండి నిరింద్రీయ పదార్థాల మార్పిడికి, వాటి విడుదలకు జీవులలో వివిధ యంత్రాంగాలు (Mechanisms) ఉన్నాయి. మొక్కలు ఖనిజాలను నేల నుండి గ్రహిస్తాయి. ఇవి నీటితోపాటు వేళ్ళ ద్వారా మొక్కలోకి శోషించబడతాయి. జీవుల మనుగడకు కిరణజన్య సంయోగక్రియ అతిముఖ్యమైన ప్రక్రియ. సూర్యకాంతి, కార్బన్ డై ఆక్సైడ్ మరియు నీరు నిర్జీవ అంశాలు అయినప్పటికీ ఇవి జీవులకు ఎంతో అవసరం. ఉత్పత్తిదారులైన ఆకుపచ్చని మొక్కలు ఈ పదార్థాలను శక్తి రూపంలోకి (ఆహారం) మార్చి, జీవ ప్రపంచానికి వినియోగదారులకు అందుబాటులో ఉంచుతాయి. ఉత్పత్తిదారుల నుండి వివిధ వినియోగదారులకు ఆహారం మరియు శక్తి బదిలీని జరగడానికి ఆహారపు గొలుసులు, ఆహార జాలకాలు తోడ్పడుతాయి.

మొక్కలు లేదా జంతువులు లేదా రెండింటి నుండి ఆహారాన్ని గ్రహించడం వలన జంతువులు అవసరమైన ఖనిజాలను పొందుతాయి. ఈ ఖనిజాలు నిరంతరం భూమి నుండి తొలగింపబడుతూ, గ్రహింపబడుతూ మొక్కలలో భాగమవుతాయి. తరవాత ఈ మొక్కలను ఆహారంగా గ్రహించే జంతువుల శరీరంలో భాగమవుతాయి.

మనం తినే ఆహారపదార్థాలకు మూల వనరులేమిటో గుర్తించడానికి ప్రయత్నించండి. అవి లభించే వనరులను గుర్తించండి. ఉదాహరణకు పెరుగు లభించే విధానాన్ని చూద్దాం. పెరుగును పాల నుండి తయారుచేస్తారు. పాలు ఆవు నుండి లభిస్తాయి. ఆవు గడ్డిని ఆహారంగా తీసుకుంటుంది. గడ్డి మొక్కలు కిరణజన్య సంయోగక్రియ ద్వారా ఆహారాన్ని తయారుచేస్తాయి. ఆహారం ఏరకమైనదైనా దానికి మూలం ఆకుపచ్చని మొక్కలే కదా!

జీవి, ఆహారం గ్రహించగానే దానిలోని శక్తి శరీరంలో వివిధ పంథాలను అనుసరిస్తుంది. గ్రహించిన ఆహారమంతా జీర్ణం కాదు. జంతు సంబంధ ఆహారంలోని వెంట్రుకలు, ఈకలు, కీటకాల బాహ్య అస్థిపంజరాలు, మృదులాస్థి మరియు ఎముకలు, వృక్ష సంబంధ ఆహారంలోని సెల్యులోజ్ మరియు లిగ్నిన్‌లను చాలా జంతువులు జీర్ణం చేసుకోలేవు. ఇలాంటి జీర్ణంకాని పదార్థ భాగాలు విసర్జించబడడం ద్వారాగానీ వాంతిరూపంలో గానీ శరీరం నుండి బయటకు పంపబడతాయి.

శోషించబడిన శక్తి (శ్వాసక్రియ మరియు విసర్జన ద్వారా నష్టపోనిది), పెరుగుదల మరియు ప్రత్యుత్పత్తి ద్వారా శరీరంలో కొత్త జీవ ద్రవ్యరాశి తయారవడానికి అందుబాటులో ఉంటుంది. మరణించడం, రోగాల బారిన పడడం లేదా వార్షికంగా ఆకులు రాలడం వలన జీవులు కొంత జీవ ద్రవ్యరాశిని నష్టపోతాయి. ఈ జీవ ద్రవ్యరాశి పూతికాహారపు గొలుసు ద్వారా (జీవులు మరణించి, కుళ్ళిపోవడం వలన) తిరిగి పర్యావరణానికి (నేల, నీరు, గాలి) చేరుతుంది. మిగిలిన జీవ ద్రవ్యరాశిని శాకాహారులు లేదా పరభక్షకాలు ఆహారంగా వినియోగించుకోగా, దానిలో శక్తి ఆవరణ వ్యవస్థలోని తరవాత ఉన్నత పోషకస్థాయిలోకి ప్రవేశిస్తుంది.




శరీరంలోకి పదార్థాలు ప్రవేశించడం, తరవాత జీవులు మరణించడం మరియు క్రుళ్ళిపోవడం వలన అవి నేల, నీరు, గాలిలోకి చేరడం అనేది నిరంతరం చక్రీయంగా జరుగుతూనే ఉంటుంది. జీవులు మరియు వాటి పర్యావరణానికి మధ్య జరిగే పదార్థాల ప్రసరణను పదార్థ చక్రీయం లేదా లవణాల రవాణా లేదా జీవభౌతిక రసాయన వలయం అంటారు అని మీరు 9వ తరగతిలో తెలుసుకున్నారు.

సూర్యుని నుండి లభించే సౌరశక్తి ఆవరణ వ్యవస్థలోని ఉత్పత్తిదారులలోకి ప్రవేశిస్తుంది. ఆకుపచ్చని మొక్కలు మరియు కిరణజన్య సంయోగక్రియను జరిపే బాక్టీరియాలు (పత్రహరితం

కలిగి ఉండడం వలన) తప్ప, ఇతర జీవులేవీ సౌరశక్తిని శోషించలేవు మరియు దానిని రసాయనిక శక్తిగా (ఆహారం) మార్చలేవు.

ఉత్పత్తిదారుల నుండి, ఈ రసాయనిక శక్తి వినియోగదారులకు, ఒక పోషకస్థాయి నుండి తరవాత పోషకస్థాయికి ప్రసరిస్తుంది. ప్రతీ పోషకస్థాయిలోని జీవులు, అవి శోషించిన శక్తిలో చాలా వరకు వివిధ పనులకు, పెరుగుదల మరియు ప్రత్యుత్పత్తి వంటి జీవ క్రియలకు వినియోగిస్తాయి. కాబట్టి జీవశక్తి ప్రసారం జరిగేటపుడు చాలా వరకు శక్తి ఉష్ణం రూపంలో వృథా అవుతుంది. అందువల్ల శక్తి పిరమిడ్ ఎల్లప్పుడూ నిటారుగానే ఉంటుంది.

తరువాతి పోషకస్థాయిలోని జీవులకు శక్తిలోని కొంతభాగం మాత్రమే చేరుతుంది. ఈ విషయంలో జీవులకు మానవ నిర్మిత యంత్రాలకు వ్యత్యాసం అంతగా లేదు. కార్ల వంటి వాహనాలలోని ఇంజన్లలో వాడే పెట్రోల్ పూర్తిగా గతిశక్తిగా మారకుండా చాలావరకు ఉష్ణరూపంలో నష్టపోవడం జరుగుతుంది. సహజ ఆవాసాలలో శక్తి వివిధ పనులకు వినియోగించబడుతుంది. ఈ చర్యలో విడుదలైన ఉష్ణశక్తి, తిరిగి ఆవరణ వ్యవస్థలోకి చేరుతుంది.

## మానవ కార్యకలాపాలు – ఆవరణ వ్యవస్థపై వాటి ప్రభావం:

మానవ కార్యకలాపాల వలన జరిగే కాలుష్యంతో ఆవరణ వ్యవస్థలు ఏవిధంగా కలుషితమవుతున్నాయో కింది తరగతులలో తెలుసుకున్నాం. వ్యవసాయం కోసం అడవులను నరకడం వలన ఆవరణ వ్యవస్థలు ప్రమాదకరమైన మార్పులకు గురవుతాయని, దీని వలన ప్రతి పోషకస్థాయిలోని జీవులు ఏవిధంగా ప్రభావితమవుతాయో మరింత వివరంగా అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం.

పర్యావరణంలోని అంశాలు, వాటి మధ్య పరస్పర చర్యలు, మానవ కృత్యాలవల్ల కలిగే ప్రభావాలను అర్థం చేసుకోవడానికి కొలను ఆవరణ వ్యవస్థ గురించి క్రింది కథలో అధ్యయనం చేద్దాం.

## కొల్లేరు కథ!

ప్రపంచంలో చాలామంది పేద ప్రజలకు పౌష్టికాహారాన్ని అందించడంలో మంచినీటి సరస్సులు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. వాటిలో కొల్లేరు సరస్సు ఒకటి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కృష్ణా, గోదావరి నదుల మధ్య విస్తరించి ఉన్న కొల్లేరు సరస్సు చెప్పుకోదగిన ఒక పెద్ద మంచినీటి సరస్సు. ఇది దాదాపు 6121 చదరపు కిలోమీటర్ల మేర విస్తరించి ఉంటుంది. కొల్లేరు సరస్సు నుండి వరద నీరు 61 కి.మీ. పొడవుగల ఉప్పుటేరు వాగు గుండా ప్రవహించి బంగాళాఖాతంలో కలుస్తుంది. కొల్లేరు పరివాహక ప్రాంతాలు సారవంతమైన ఒండ్రుమట్టి మేటలు కలిగి ఉంటాయి.


పటం-7: కొల్లేరు సరస్సు

1999 నవంబరులో భారత ప్రభుత్వం కొల్లేరు సరస్సును పక్షి సంరక్షణా కేంద్రంగా ప్రకటించింది. ఇక్కడ

193 రకాల పక్షి జాతులు వివిధ రకాల జంతు వృక్షజాలానికి ఆవాసంగా ఉండడంతో పాటూ ఎన్నో రకాల మందు మొక్కలు కూడా పెరుగుతున్నాయి. ఉత్తర ఆసియా, తూర్పు ఐరోపా దేశాల నుండి అక్టోబర్, మార్చి నెలల మధ్యకాలంలో ప్రతి ఏటా దాదాపు 20 లక్షల పక్షులు ఈ సరస్సుకు వలస వస్తాయి. సరస్సుపై ఆధారపడి దాదాపు 20 మిలియన్ల ప్రజలు జీవిస్తున్నారు. ఉపగ్రహ చిత్రాలు అందిస్తున్న సమాచారం ప్రకారం గత మూడు దశాబ్దాలుగా సరస్సు వైశాల్యం తగ్గిపోతోంది. కాలుష్యాలు కలుస్తుండడం వల్ల జీవజాలానికి ముప్పు ఏర్పడుతోంది. పూడిక చేరడం వల్ల వరదలు సర్వసాధారణమయ్యాయి. కింది పట్టికను పరిశీలించండి.

**పట్టిక-1**

| విభాగం | 1967 నాటికి వైశాల్యం (చ.కి.మి.) | 2004 నాటికి వైశాల్యం (చ.కి.మి.) |
|---|---|---|
| నీరు విస్తరించిన సరస్సు వైశాల్యం | 70.70 | 62.65 |
| కలుపుతో నిండిన భాగం | 0 | 47.45 |
| దట్టమైన కలుపుతో నిండిన భాగం | 0 | 15.20 |
| వర్షాకాలంలో వరదలకు గురయ్యే ప్రాంతం | 100.97 | 0 |
| రొయ్యల చెరువులు | 0 | 99.74 |
| వరిపండే పొలాలు | 8.40 | 16.62 |
| ఆక్రమణలు | 0.31 | 1.37 |
| **మొత్తం** | **180.38** | **180.38** |

- ఏ సంవత్సరంలో సరస్సులో నీరు విస్తరించిన ప్రదేశం ఎక్కువగా ఉంది? ఎందుకు?
- సరస్సులో దట్టంగా కలుపు పెరగడానికి కారణం ఏమిటని నీవు భావిస్తున్నావు?
- సరస్సు వైశాల్యం తగ్గిపోడానికి కారణాలు ఏమిటి?
- పైన చెప్పబడిన కారణాలు కాలుష్యానికి ఎలా దారితీస్తాయి?
- కొల్లేరుకు సుదూర ప్రాంతాల నుండి పక్షులు వలస రావడానికి కారణాలు ఏమిటి?
- సరస్సు కాలుష్యానికి గురైన ముప్పును ఏవిధంగా కనుగొన్నారు?

80వ దశకం నుండి కొల్లేరు ప్రాంతంలో రొయ్యలు, చేపల పెంపకం (Aqua culture) అత్యంత లాభదాయకమైన వ్యాపారంగా మొదలై, తరువాత కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతాలకు విస్తరించింది. అందువల్ల అనేక మంది పెట్టుబడిదారుల దృష్టి దీనిపై పడి సరస్సు ఆక్రమణలకు గురైంది. 1996 నాటికి చాలా ప్రాంతాలలో కట్టలు కట్టి నీటి ప్రవాహాన్ని మళ్ళించి సరస్సును సాగుభూమిగా మార్చారు. ఇది సరస్సు సహజ ప్రవాహ దిశను మార్చివేసింది. అందువల్ల సరస్సులో నీటి నిలువ సామర్థ్యం గణనీయంగా తగ్గిపోయింది.

సరస్సు పరివాహక ప్రాంతంలో వ్యవసాయం, పరిశ్రమలు విపరీతంగా విస్తరించాయి. వాగులు వంకలు రకరకాల కాలుష్యకాలను సరస్సుకు చేరవేయసాగాయి. వ్యవసాయ

రసాయనాలు, ఎరువులు, చేపల చెరువుల వ్యర్థాలు, పరిశ్రమల నుండి వెలువడే వ్యర్థ రసాయనాలు, మున్సిపల్ వ్యర్థాలు, గృహ వ్యర్థాలు మొదలైనవన్నీ సరస్సులో కలిసి కాలుష్యాన్ని కలిగిస్తున్నాయి. మానవ కృత్యాల వలన పోషకాలు అధికంగా కలిగిన (Eutrophication) వ్యర్థాలు చేరి, గుర్రపు డెక్క (ఐకార్నియా) వంటి కలుపు మొక్కలు విపరీతంగా పెరగడం జరిగింది. ఫలితంగా సరస్సు సమతుల్యత దెబ్బతిన్నది.

ఫలితంగా సరస్సులో నీరు క్షారస్వభావంతో, మురికిగా, పోషక పదార్థాలతో కూడి ఉండడం వల్ల నీటిలో కరిగే ఆక్సిజన్ పరిమాణం (DO) తగ్గిపోయింది. జైవిక ఆక్సిజన్ డిమాండ్ (BOD) ఎక్కువ కావడం వలన జలచరాలపై తీవ్ర ప్రభావం కలిగింది. ఇక్కడి ప్రజలకు జలకాలుష్యంపై అవగాహన లేకపోవడం వల్ల డయేరియా, కలరా, టైఫాయిడ్, అమీబియాసిస్ మొదలైన నీటి ద్వారా వ్యాపించే వ్యాధులు తీవ్రంగా వ్యాప్తి చెందాయి. వీటితో పాటు దోమల వంటి వాహకాల ద్వారా వ్యాప్తిచెందే వ్యాధులు కూడా ప్రబలాయి. రొయ్యలు, చేపల వంటి జలచరాలుకూడా వ్యాధులకు గురయ్యాయి. పొలాలు వ్యవసాయానికి యోగ్యం కాకుండా పోయాయి. దిగుబడి తగ్గిపోయింది.

ప్రస్తుతం సరస్సు ఆవరణ వ్యవస్థ పూడికలు, ఆక్రమణలు, కాలువలు మూసుకుపోవడం, మొదలైన ఆటంకాలను ఎదుర్కొంటోంది. ఆక్వాకల్చర్ వలన దాదాపు 15 రకాల స్థానిక చేపల జాతులు అంతరించిపోయే ప్రమాదంలో పడ్డాయి. నీటిలో కరిగే ఆక్సిజన్ పరిమాణం తగ్గిపోవడం వల్ల నీటి ఉపరితలంపైకి శ్వాసించే చేపల జాతులు పెరిగాయి.

సరస్సుపై వివిధ కారకాల ప్రభావాన్ని పట్టిక-2లో పరిశీలించండి. కింది ప్రశ్నలకు సమాధానాలు ఆలోచించండి.

**పట్టిక -2**

| సమస్య | వ్యవసాయం | చేపల పెంపకం | పరిశ్రమలు | మానవ కార్యకలాపాలు |
|---|---|---|---|---|
| **జైవిక సంబంధిత సమస్యలు** | | | | |
| 1. పక్షుల వలస తగ్గడం | - | + | - | - |
| 2. వృక్షజంతుజాలం తగ్గడం | - | + | - | - |
| 3. రోగకారకాలు | - | - | - | + |
| **రసాయనిక** | | | | |
| యూట్రాఫికేషన్ | + | + | - | + |
| విషపదార్థాల వ్యాప్తి | + | + | + | - |
| **భౌతిక** | | | | |
| మేటలు వేయడం | + | + | - | - |
| వరదలు | + | + | - | + |

**సూచన:** (+) సమస్యలపై ప్రభావం చూపుతుంది.

(−) సమస్యలపై ప్రభావం చూపడం లేదు.

- *వలస పక్షుల సంఖ్య తగ్గడంపై ప్రభావం చూపించే అంశాలు ఏమిటి?*
- *భౌతిక సమస్యలకు జీవ సంబంధ సమస్యలకు మధ్య ఏదైనా సంబంధం ఉందని నీవు భావిస్తున్నావా? అవి ఏమిటి?*
- *రసాయనిక సమస్యలు ఏర్పడడానికి కారణాలు ఏమై ఉంటాయి?*
- *నీటిలో కరిగిన ఆక్సిజన్ పరిమాణం తగ్గిపోతే ఏమవుతుంది?*
- *మురికిగా, పోషక పదార్థాలు కలిగిన నీటికి జైవిక ఆక్సిజన్ డిమాండ్ (Biological oxygen demand) ఎక్కువా? తక్కువా? తద్వారా కలిగే ప్రభావం ఏమిటి?*
- *కొల్లేరు పరివాహక ప్రాంత ప్రజలు అనేక ఇబ్బందులకు గురవడానికి కారణాలు ఏమిటి?*
- *పక్షుల వలసపై కాలుష్యం ఎలాంటి ప్రభావం కలిగించిందని నీవు భావిస్తున్నావు?*

భారత ప్రభుత్వ పర్యావరణం, అటవీ మంత్రిత్వశాఖ (MoEF) సరస్సు పరిరక్షణ కోసం "ఆపరేషన్ కొల్లేరు" అనే పథకాన్ని ప్రవేశపెట్టింది. ప్రకృతివరమైన/ ప్రసాదించిన కొల్లేరు సరస్సులో సమతుల్యతను పునరుద్ధరించడం దీని ముఖ్య ఉద్దేశ్యం.

## కృత్యం-1

మీ పరిసరాలలో ఉన్న ఏదైనా (నీటి) ఆవరణ వ్యవస్థను పరిశీలించండి. అందులో ఉండే వివిధ ఆహారపు గొలుసులు, ఆహార జాలకాలను గురించి కింది వర్క్‌షీట్ ఆధారంగా నివేదిక రాయండి.

**వర్క్‌షీట్**

1. జట్టుసభ్యుల పేర్లు: ______________________ తేది: ____________
2. ఆవరణ వ్యవస్థ పేరు: ______________________
3. భౌగోళిక స్వరూపం (టోపోగ్రఫి): ______________________
4. గుర్తించిన ఉత్పత్తిదారుల పేర్లు / సంఖ్య: ______________________
5. గుర్తించిన జంతువుల పేర్లు / సంఖ్య: ______________________
6. గుర్తించిన వినియోగదారుల పేర్లు / సంఖ్య: ______________________
   శాకాహారులు (ప్రాథమిక వినియోగదారులు): ______________________
   మాంసాహారులు (ద్వితీయ వినియోగదారులు): ______________________
   ఉన్నతస్థాయి మాంసాహారులు (తృతీయ వినియోగదారులు): ______________________
7. వాటిమధ్య గల ఆహార సంబంధాలు, అలవాట్లు: ______________________
8. ఆహారపు గొలుసుల పటములు: ______________________
9. ఆహార జాలకం పటం: ______________________
10. ఆవరణ వ్యవస్థలోని నిర్జీవ అంశాలు: ______________________
    (జాబితాను ఇచ్చి, గుర్తించమని సూచించవచ్చును) : ______________________
11. ఆవరణ వ్యవస్థకు ఏవైనా ప్రమాదాలు పొంచి ఉన్నాయా? అవి ఏమిటి?: ______________________
    పరిష్కారాలు సూచించండి: ______________________

అడవులను నరికి, ఆ స్థలంలో పంటలను పండించడం వలన సమతాస్థితిలో ఉన్న ఆవరణ వ్యవస్థ, ఆహారధాన్యాలు, దుంపలు, పశుగ్రాసం కోసం పొలాలలో ఒకే రకమైన పంటలను (Mono culture) పండించడం వలన అసహజంగా మారిపోతోంది.

వివిధ రకాల పంటలను మనం ఎక్కువ మొత్తంలో పండిస్తే, ఆహారం కూడా పెద్ద మొత్తంలో లభిస్తుంది. ఈ పరిస్థితి ఆహారంపై ఆధారపడే, తెగుళ్ళను కలిగించే శిలీంధ్రాల వంటి పరాన్నజీవులకు అనుకూలంగా ఉంటుంది. ఒకవేళ ఆహారోత్పత్తికన్నా తెగుళ్ళు కలిగించే పరాన్నజీవుల సంఖ్య వేగంగా పెరుగుతూ పోతే ఫలితం చాలా దుర్భరంగా ఉంటుంది. ఈ పరిస్థితి అధిగమించడానికి మనం అపాయకరమైన రసాయనాలను పెస్టిసైడ్లు, గుల్మకనాశకాలు మరియు శిలీంధ్రనాశకాలను వాడడం జరిగింది. చాలా రసాయనాలు మంచి ప్రభావాన్ని చూపినప్పటికీ వీటి వాడకం కొత్త సమస్యలను సృష్టించింది. నాశనం చేయాల్సిన క్రిములను మాత్రమే చంపి, ఇతర జీవులకు అపాయకరం కానిదే సరైన కీటకనాశినిగా పరిగణించాలి. కానీ అలాంటి క్రిమినాశనమేదీ లేదు.

- మీకు తెలిసిన మీరు విన్న ఏవైనా రెండు కీటకనాశనుల, శిలీంధ్రనాశకాల పేర్లు తెలపండి.
- మీరు క్రిములు, శిలీంధ్రాల నుండి ఆహారపు గింజలు, ధాన్యాలను సంరక్షించుకోవడానికి ఇంట్లో ఏవిధంగా నిలువ చేస్తారు?

ఈ పెస్టిసైడ్లు విచక్షణారహితంగా ప్రభావాన్ని చూపుతూ, ఎక్కువ సంఖ్యలో ఇతర జంతువులను నాశనం చేస్తాయి. వీటిలో ఈ క్రిములను ఆహారంగా తీసుకొనే జంతువులు మరియు ఇతరులకు ఆహారమయ్యే జంతువులూ ఉంటాయి. ఫలితంగా పెస్టిసైడ్లు ఆహారపు గొలుసులలో అనూహ్యమైన మార్పులకు దారితీస్తూ, ఆవరణ వ్యవస్థ యొక్క సమతుల్యతను దెబ్బతీస్తాయి. ఇవి నేలలో కలిసిపోయినపుడు అవి కలిగించే ప్రభావం ఇంకా అపాయకరంగా ఉంటుంది.

పెస్టిసైడ్ల వలన కలిగే విషపూరిత ప్రభావం చాలా కాలం పాటు ఉంటుంది. కొన్ని కీటకనాశనులు మరియు గుల్మనాశకాలు విచ్ఛిన్నం చెందగలిగినవిగా ఉంటాయి. ఇవి తక్కువ కాలంలోనే సాధారణంగా ఒక సంవత్సరంలోపే నిరుపాయకరమైన పదార్థాలుగా విచ్ఛిన్నం అవుతాయి. పాదరసం, ఆర్సెనిక్, సీసం కలిగియున్న పెస్టిసైడ్లు విచ్ఛిన్నం చెందవు. విచ్ఛిన్నం కాని పెస్టిసైడ్లు చాలా అపాయకరమైనవి. ఇవి ఒక్కొక్క పోషక స్థాయిలో కేంద్రీకృతమవుతూ పిరమిడ్ శిఖర భాగంలో ఉండే జంతువుల శరీరాలలోనికి చేరి అపాయకరమైన స్థాయిలో పేరుకుంటాయి. ఆహారపు గొలుసులోనికి కాలుష్యాలు చేరడాన్ని జైవిక వ్యవస్థాపనం (Bioaccumulation) అంటారు. ఆహారపు గొలుసులోని ఒక పోషకస్థాయి నుండి తరవాత పోషకస్థాయికి చేరిన కాలుష్యాలు సాంద్రీకృతమయ్యే విధానాన్ని జైవిక వృద్ధీకరణం (Biomagnification) అంటారు.

మానవ ఆరోగ్యంపై జైవిక వ్యవస్థాపనం యొక్క ప్రభావాన్ని గురించిన మరొక పరిశోధనాత్మక అంశాన్ని పరిశీలిద్దాం.

## ఏదులాబాదు నీటి రిజర్వాయర్ (EBWR) లోని చేపల్లో (సిప్రినస్ కార్పియో) కాలక్రమేణా పేరుకుంటున్న భారమూలకాలు-మానవులపై ప్రభావం

భారతదేశంలోని పట్టణ ప్రాంతాల పరిసరాలలో ప్రవహించే నదులు మరియు నీటిని నిల్వచేసే రిజర్వాయర్‌లలో నివసించే జలచరాల దృష్ట్యా ప్రమాదకర పరిస్థితులు క్రమంగా పెరిగిపోతున్నాయి. భారమూలకాల సంచయనం, ఆమ్లయుత, అత్యధిక పోషకాల చేరిక మరియు పెరిగే నీటి కాలుష్యం నీటిలో నివసించే జీవుల మనుగడకు సవాలుగా పరిణమిస్తున్నాయి.



పటం-8: ఏదులాబాదు వాటర్ రిజార్వాయర్

పట్టణీకరణ, పారిశ్రామికీకరణ, ఆధునిక జీవన విధానాలు, మానవుల నిత్యకృత్యాల కారణంగా భారమూలకాలు దగ్గరలోని నీటి వనరులలో కలుస్తున్నాయి. దీని వలన జీవజాలం ఈ కలుషిత నీటిలోనే జీవనం కొనసాగించవలసిన దుస్థితి ఏర్పడుతోంది. ఇలాంటి పరిస్థితులలో జీవించే చేపలు లోహ కాలుష్య వాతావరణానికి తీవ్రంగా ప్రతిస్పందించడాన్ని గమనించారు. అందువల్ల ఈ మధ్యకాలంలో చేపలను లోహకాలుష్యాలకు జీవసూచికలుగా భావిస్తున్నారు.

ఏదులాబాదు వాటర్ రిజర్వాయర్ నీటిలో సీసం (Pb), కాడ్మియం (Cd), క్రోమియం (Cr), మాంగనీస్ (Mn), నికెల్ (Ni) మరియు ఐరన్ లేదా ఫెర్రమ్ (Fe) మొదలైన భారమూలకాలు ఎంత మోతాదులో పెరుగుతున్నాయో అంచనా వేయడానికి అధ్యయనాన్ని చేపట్టారు. ఏదులాబాదు వాటర్ రిజర్వాయర్ తెలంగాణ రాష్ట్రంలోని మేడ్చల్ జిల్లాలో ఉంది. దీని పరిసర ప్రాంతాలలో భారీగా కాలుష్య కారకాలైన పరిశ్రమలు, వ్యర్థరసాయనాలు వెలువరించే వ్యవసాయ క్షేత్రాలు నెలకొని ఉన్నాయి.

సిప్రినస్ కార్పియో అనే పొలుసుల చేప సాధారణంగా అధిక ప్రోటీన్‌లను కలిగిఉండి, తక్కువ ధరలో అందరికీ సులభంగా లభించే ఆహారం. ఏదులాబాదు పరిసర ప్రాంతాలలోని ప్రజలు ఈ చేపల్ని ఆహారంగా తీసుకొంటుంటారు. ఈ చేపల్నే అధ్యయన నిమిత్తం ఎన్నుకోవడం జరిగింది.

ఈ చేపలలోని వివిధ కణజాలాల్లో అంటే కాలేయం, మూత్రపిండాలు మరియు మొప్పల్లో గ్లైకోజన్ మరియు కొవ్వులతో పాటుగా భారమూలకాలున్నట్లు గుర్తించారు.

యాదాద్రి భువనగిరి జిల్లాలోని బీబీనగర్‌లోని చెరువులోనూ ఈ విధమైన పరిశోధన చేసి నీటి మరియు చేపల నమూనాలను సేకరించి ఏదులాబాదు ఫలితాలతో పోల్చారు. అయితే ఏదులాబాదు మంచినీటి రిజర్వాయర్ కన్నా బీబీనగర్ రిజర్వాయర్ తక్కువ కలుషితమైనదిగా గుర్తించారు. బీబీనగర్ ఏదులాబాదుకు 30కి.మీ. దూరంలో ఉంది. బీబీనగర్ రిజర్వాయర్‌లోని చేపల కన్నా ఏదులాబాదు చేపల్లో గ్లైకోజెన్ మరియు లిపిడ్లు తక్కువగానూ భారమూలకాల సంచయనం ఎక్కువగానూ ఉన్నట్లు పరిశోధనల్లో తెలిసింది.

ప్రతి సంవత్సరం వర్షాకాలానికి ముందు (ఫిబ్రవరి-మే), వర్షాకాలంలో (జూన్-సెప్టెంబర్) మరియు వర్షాకాలం తరువాత (అక్టోబర్-జనవరి) ఇలా మూడు కాలాలలో నీరు, చేపల నమూనాలను సేకరించి పరిశీలించారు. ప్రతికాలంలోను మూడు రకాల నమూనాలు మూడు ప్రదేశాల్లో మూడుసార్లు అంటే మొత్తం 27 నమూనాలను సేకరించి భారమూలకాల విశ్లేషణ చేశారు. ఇలా 2005 నుండి 2007 వరకు పరిశోధన చేశారు.

ఏదులాబాదు చేపల్లో భారమూలకాల పరిమాణం దేశ సగటు కన్నా ఎక్కువగా ఉన్నట్లు తెలిసింది. అలాగే భారమూలకాల గాఢతను పరిశీలిస్తే అన్నింటి కన్నా ఎక్కువ ఇనుము ఉండగా సీసం, క్రోమియం, నికెల్, కాడ్మియం (Fe > Pb > Cr > Ni > Cd) తరువాతి స్థానాల్లో ఉన్నాయి. ఈ మూలకాలు ఆహార జాలకం ద్వారా చేపల కణాల్లో చేరి అక్కడ నుండి మానవులలోకి చేరుతున్నాయి. చేపల కణజాలంలో భార మూలకాల జైవిక వ్యవస్థాపనం క్రింది విధంగా ఉంది.

Cd > Cr > Fe > Ni > Pb

తక్కువ గాఢతలో కూడా చేపలు కాడ్మియం లోహానికి సున్నితత్వాన్ని కలిగి ఉండడం వల్ల, ఇది చేపల కణజాలంలోకి సులభంగా చేరుతోందని గుర్తించారు. అందువల్ల చేపల కాలేయం, మొప్పలు, మూత్రపిండాలలో కాడ్మియం అత్యధికంగా చేరుతోంది. క్రోమియం, ఇనుము, నికెల్, సీసంల చేరిక తరువాతి స్థానాలలో ఉన్నాయి.

మూడు కాలాలలో గమనించినట్లయితే వర్షాకాలంలోనే చేపలలో భారమూలకాల సంచయనం తక్కువగా ఉన్నట్లు కనుగొనబడింది.

మానవులలో ఆహారజాలకం ద్వారా భారమూలకాల గాఢత పెరిగి అధిక రక్తపోటు, తీవ్రమైన జ్వరం, మూత్రపిండాల క్షీణత, వాంతులు మొదలైన అనేక శారీరక రుగ్మతులకు గురవడాన్ని గుర్తించారు.

పట్టణప్రాంతంలో ప్రణాళికారహిత అభివృద్ధి, అనుమతిలేని చిన్నాచితక పరిశ్రమలు, పట్టణ వ్యర్థాల వలన ఏదులాబాదు రిజర్వాయర్‌లో కాలుష్యం తీవ్రంగా పెరిగిపోయింది. చేపలలోనే కాకుండా ఇతర జలచరజీవుల వలన కూడా ఆహారజాలం ద్వారా మానవులలో చేరి ఆరోగ్యంపై తీవ్రమైన ప్రభావాన్ని కలుగజేస్తున్నాయి.

- *నీటి వనరులలోకి ఎక్కడినుండి కలుషితాలు వచ్చి చేరుతున్నాయి?*
- *ఈ నీటిలో నివశించే చేపల శరీరాలలోకి భారలోహాలు ఎలా చేరుతున్నాయి?*
- *పరిశోధకులు నీటిలో కాలుష్య పరిమాణం వర్షకాలలో ఎక్కువగా ఉన్నట్లు గుర్తించారు కదా! ఇది ఎందుకు జరుగుతుందని నీవు భావిస్తున్నావు?*
- *ఈ నీటిలో దొరికే చేపలను తినడం వల్ల ప్రజలు అనేక వ్యాధులకు గురికావడానికి కారణం ఏమిటి?*

నదులపై ఆనకట్టలు నిర్మిస్తూ, చిత్తడి నేలలను, సముద్రతీరాలను ఆక్రమిస్తూ, అడవులను నరుకుతూ, భూమిని దున్ని పంటలను పండిస్తూ, కాలువలు, రహదారులు, పట్టణాలు మరియు నగరాలను నిర్మిస్తూ మానవుడు సహజ ఆవరణ వ్యవస్థలను ఎన్నో మార్పులకు గురిచేశాడు. ఈ మార్పులు సహజ ఆవరణ వ్యవస్థలలో నివసిస్తున్న వృక్ష జంతుసముదాయాలను చాలా వరకు మార్చివేశాయి.

ఉదాహరణకు ఒక పెద్ద పట్టణం యొక్క అభివృద్ధిని తీసుకున్నట్లయితే మూడు రకాల మార్పులను చూడవచ్చును.

ఎ) కొన్ని వృక్ష జంతు జాతులు చనిపోతాయి.

బి) కొన్ని మారిన, కొత్త పరిస్థితులకు అనుకూలంగా మార్చుకొని, తక్కువ సంఖ్యలో మనుగడ కొనసాగిస్తాయి.

సి) కొన్ని మారిన, కొత్త పరిస్థితుల నుండి లాభాన్ని పొందుతూ, వాటి సంఖ్యను పెంచుకుంటాయి.



**మీకు తెలుసా?**

మినిమేటా వ్యాధిని మొదట 1956వ సంవత్సరంలో జపాన్‌లోని కుమమోటో ప్రిఫెక్చర్‌లో గల మిమిమేటా నగరంలో కనుగొన్నారు. 1932 నుండి 1968 వరకు చిస్సో కార్పొరేషన్ వారి రసాయన పరిశ్రమ నుండి విడుదలైన మిథైల్ మెర్క్యురీతో కూడిన వ్యర్థజలాలే, మినిమేటా వ్యాధికి కారణం. షిరని సముద్రం (Shiranui sea), మినమేటా అఖాతంలో ఉండే చేపల ద్వారా వీటిని తినే స్థానిక మనుషుల్లోకి మిథైల్ మెర్క్యురీ చేరి ఆనారోగ్యాలకు దారితీసింది. ఫలితంగా పిల్లులు, కుక్కలు, పందులు, మనుషుల మరణాలు 36 ఏళ్ళుగా కొనసాగాయి.

మానవ కార్యకలాపాలు పర్యావరణం మీద ఎంతటి దుష్ప్రభావాన్ని కలిగిస్తాయి అనడానికి చైనాలో జరిగిన ఒక సంఘటనను పరిశీలిద్దాం.

## పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం



పటం-9: ప్రమాదంలో పిచ్చుకలు



పటం-10: పిచ్చుకలపై దండయాత్ర

జీవితంలో ఎదురయ్యే సర్వసాధారణమైన విపత్తులనుండి ఏ జీవి తప్పించుకోలేదు. 1958వ సంవత్సరంలో చైనా దేశంలో పిచ్చుకలు ఎదుర్కొన్నటువంటి దారుణమైన పరిస్థితులను బహుశా ఈ భూగోళం మీద ఏ జీవి అనుభవించి ఉండదు. ఈ పర్యావరణ విపత్తు సహజంగా సంభవించినది కాదు. పూర్తిస్థాయి మానవ తప్పిదమే. 1958 సం॥రం చైనాలో వేటాడబడినంతగా ప్రపంచంలో పక్షులు వేటాడబడినట్లు ఎక్కడా దాఖలాలు లేవు.

చైనా ప్రభుత్వం పారిశ్రామిక ఉత్పత్తులను పెంచే దిశలో గ్రామీణ రైతులను పెద్ద ఎత్తున ప్రోత్సహించింది. పారిశ్రామిక ఉత్పత్తిని త్వరితంగా సాధించడానికి ఎన్నో ప్రణాళికలు రూపొందించారు. అభివృద్ధి చెందిన దేశాల మాదిరిగా తొందరగా ఆధునికతను రూపుదిద్దుకోనేందుకు చైనా ప్రభుత్వం ఉద్యమాన్ని చేపట్టింది. అయితే అప్పటిదాకా చైనా వ్యవసాయాధారిత సమాజమే. ఈ ఉద్యమంలో భాగంగా 5000 కుటుంబాలతో సమూహాలుగా ఏర్పడి వ్యవసాయం చేయడం అన్నది ఒక ముఖ్యాంశం. దీనివల్ల పంట దిగుబడి రెట్టింపు అయ్యింది. ఈ మొదటి విజయంతో తరువాతి సంవత్సరానికి మరింత పెద్ద లక్ష్యాలను రూపొందించకోడం జరిగింది. కాని వాతావరణం అందుకు సహకరించలేదు. కొంత పంట

దిగుబడి వచ్చినప్పటికీ తగిన ఫలితాలను సాధించలేకపోయామనే భయంతో ప్రభుత్వ వ్యవసాయాధికారులు దిగుబడిని ఎక్కువగా లెక్కగట్టారు. ఈ తప్పుడు లెక్కలు ప్రజల అవసరాలకు ఆహార సరఫరాకు మధ్యగల సమతుల్యతపై తీవ్రంగా ప్రభావం చూపాయి. దీనినుండి తప్పించుకోడానికి అధికారులు తమ తప్పిదాన్ని పిచ్చుకలపైకి నెట్టారు. గిడ్డంగుల నుండి సంవత్సర కాలంలో ఒక పిచ్చుక సుమారుగా 1.8 కిలోల ధాన్యపు గింజలు తిన్నదని అందువల్ల ఆహార కొరత ఏర్పడిందని ప్రకటించారు. పిచ్చుకలపై నేరాన్ని మోపారు. పల్లెల్లో, పట్టణాల్లో ప్రజలందరినీ పిచ్చుకలపై యుద్ధం చేయాల్సిందిగా ఆదేశించారు.

ప్రజలంతా వలలు పన్ని పెద్ద సంఖ్యలో పిచ్చుకలను పట్టుకుని చంపడం మొదలు పెట్టారు. విషప్రయోగం చేశారు. తుపాకులతో కాల్చేశారు. అవి అలసట విసుగుతో ఎగరలేక కిందపడి చనిపోయేవరకు డప్పులు వాయిస్తూ శబ్దాలు చేశారు. గూళ్ళను నాశనం చేశారు. గుడ్లను పగలగొట్టారు. చివరికి పిచ్చుక పిల్లలను కూడా వదలకుండా చంపేశారు. ప్రభుత్వం చంపిన పిచ్చుకల సంఖ్య ఆధారంగా పాఠశాలలు, ప్రభుత్వ కార్యాలయాలకు బహుమానాలను, గుర్తింపును ఇచ్చింది. తరువాత కొంతమంది శాస్త్రవేత్తలు చనిపోయిన పిచ్చుకల జీర్ణ వ్యవస్థలోని పదార్థాలను పరిశీలించారు. దానిలో మూడు వంతులు పంటలను నాశనం చేసే క్రిమికీటకాలు ఉండగా ఒక వంతు మాత్రమే ధాన్యపు గింజలు ఉన్నట్లు కనుగొన్నారు. పిచ్చుకలు మానవులకు ఎంతో ఉపయోగం కలిగించే పక్షులని వారి పరిశోధనల ద్వారా నిర్ధారణకు వచ్చారు. పిచ్చుకలను నాశనం చేసే ప్రయత్నాల వలన పంట దిగుబడి పెరగకపోగా మరింతగా తగ్గిపోయింది.

నిజం తెలుసుకున్న తరువాత పిచ్చుకలను చంపే ఈ ఉద్యమాన్ని ప్రభుత్వం ఆపివేసింది. కానీ అప్పటికే జరగాల్సిన నష్టం జరిగిపోయింది. మిడతలను తినే పిచ్చుకలు లేకపోవడంతో పంటలపై మిడతల దాడి ఎక్కువయింది. దానితో పాటు ప్రతికూల వాతావరణ పరిస్థితులు కూడా తోడయ్యాయి. అతిపెద్ద కరువుకు దారితీశాయి. మిడతలను చంపడానికి కీటక నాశనులను పెద్దమొత్తంలో వినియోగించడం ప్రారంభించడంతో నేల నాణ్యత క్షీణించిపోయింది. పొలాలలో పనిచేయాల్సిన రైతులు వ్యవసాయం గిట్టుబాటు కాకపోడంతో వేలసంఖ్యలో గ్రామాలను వదిలి పరిశ్రమలలో కార్మికులుగా పనిచేయడానికి వలస వెళ్ళారు.

- *ఏ ఆహారపు గొలుసు గురించి పైన చర్చించడం జరిగింది?*
- *పంటపొలాలలోని ఆహారపు గొలుసును, ఈ ఉద్యమం ఏవిధంగా ఆటంకపరిచింది?*
- *ఈ అవరోధాలు పర్యావరణంపై ఎలాంటి ప్రభావాన్ని చూపాయి?*
- *ఆవరణ వ్యవస్థలో ఒక జీవిని చంపడం భావ్యమేనా? ఇది ఏవిధంగా ప్రమాదం కలిగించింది?*
- *వాస్తవానికి పిచ్చుకలే బాధ్యులా? పంట దిగుబడి తగ్గడానికి సరైన కారణం ఏమిటి?*
- *శాస్త్రవేత్తలు ఏం కనుగొన్నారు? తప్పును సరిదిద్దుకునే విధంగా సహాయపడగలిగారా? ఎందుకలా చేయలేకపోయారు?*
- *మానవ చర్యలు పర్యావరణం మీద ఏవిధమైన ప్రభావాన్ని కలిగిస్తున్నాయి?*

- *ఇలాంటి విపత్తులు సంభవించకుండా, నీవు ఎలాంటి సలహాలు ఇస్తావు?*

8వ తరగతి జీవశాస్త్ర పుస్తకంలోని "మనవి" గేయం చదవండి. ప్రస్తుతం మన పరిసరాలలో కూడా పిచ్చుకలు మొదలైన పక్షులు అంతరించి పోయే ప్రమాదం కలగడానికి గల కారణాలను మీ తరగతిలో చర్చించండి.

## నివారణ చర్యలు

క్రిమిసంహారకాల వల్ల కలిగే అపాయకరమైన ప్రభావాల నుండి మనల్ని ఇతర జీవులను సంరక్షించే మార్గాల గురించి ఆలోచిస్తే పెస్టిసైడ్లను వాడడం పూర్తిగా ఆపడమే తక్షణ చర్యగా కనిపిస్తుంది. 'అన్ని పెస్టిసైడ్లను వాడడం పూర్తిగా ఆపివేయాలని' చెప్పడం సులభమే, కానీ చీడలను నియంత్రించే విధానాల మీద దృష్టి ఉంచాలి. పెస్టిసైడ్లను వాడిన తరవాత కూడా, తెగుళ్ళ వలన ఆహార నష్టం జరుగుతుంది. పెస్టిసైడ్లను వాడడం పూర్తిగా ఆపివేస్తే పంటలపై దాడిచేసే వ్యాధుల పరిస్థితి ఏమిటి? అవి ఎలా నియంత్రించబడతాయి. పెరిగే జనాభాకు అవసరమయ్యే పంటలు ఏమవుతాయో ఆలోచించండి.

పంటలకు హానిచేసే చీడపీడలను నివారించేందుకు అనుసరించే పద్ధతులు ప్రమాదరహితంగా ఉండడంతో పాటూ పరిసరాల పరిరక్షణకు అనుగుణమైన జైవిక నియమాలను పాటించేవిగా ఉండాలి. అప్పుడు మాత్రమే ఈ దీర్ఘకాలిక సమస్యకు సరైన పరిష్కారం దొరుకుతుంది. అలాంటి కొన్ని ఆచరణయోగ్యమైన పద్ధతులను పరిశీలిద్దాం.

**పంట మార్పిడి:** ప్రతీ సంవత్సరం ఒకే పంటను కాకుండా వేరువేరు పంటలను పండించే పంటమార్పిడి విధానాన్ని పాటించడం వల్ల తెగుళ్ళను, వాటివల్ల కలిగే నష్టాన్ని నివారించవచ్చు.

**తెగుళ్ళకు సంబంధించిన జీవిత చరిత్రలను తెలుసుకోవడం:** ఏ తెగులు ఎలా వ్యాపిస్తుంది, తెగులు కలిగించే చీడపీడల జీవిత చరిత్రలోని దశలను అర్థం చేసుకోవడం వలన, పంట నష్టాన్ని నివారించే విధంగా విత్తనాలను నాటాలి.

**జైవిక నియంత్రణ:** తెగుళ్ళు కలిగించే కారకాలను తినే సహజ భక్షకులను, వాటిపై ఆధారపడే పరాన్న జీవులను ప్రవేశపెట్టడం ద్వారా తెగుళ్ళను నివారించవచ్చు.

**జన్యు ఉత్పరివర్తన రకాలు:** వివిధ రకాల తెగుళ్లను, వాతావరణ పరిస్థితులను తట్టుకునే జన్యుసంబంధ రకాలను అభివృద్ధిచేయడం ద్వారా పురుగుమందుల వినియోగాన్ని తగ్గించవచ్చు.

**పర్యావరణనైతికత కలిగి ఉండడం:** ఇతర కారణాలతో పోలిస్తే మానవ కార్యకలాపాలే పర్యావరణం మరియు సహజ ప్రపంచంపై తీవ్రమైన ప్రభావం చూపుతున్నాయి. కనుక పర్యావరణం పట్ల నైతిక విలువలను కలిగి ప్రవర్తించాలి. చట్టాలు ఉన్నంత మాత్రాన సరిపోదు. పర్యావరణ పరంగా ఏది సరి అయినదో, ఏది సరికానిదో తెలుసుకుని ప్రవర్తించాలి.

ప్రతి ఒక్కరూ పర్యావరణ పరిరక్షణ పట్ల సరైన అవగాహన కలిగి ఉండాలి. ప్రకృతిని రక్షించుకోడం అంటే మనల్ని మనం కాపాడుకోడమే. మీ ఇంగ్లీషు పుస్తకంలో 6వ యూనిట్‌లో ఇవ్వబడిన "Or Will the Dreamer wake?" అనే పద్యాన్ని చదవండి.

సౌజన్యంతో

1. మారప్పన్ బృందం 2006లో "కొల్లేరు సరస్సు 1967 నుండి 2004 వరకు పరిస్థితులు" అనే అంశంపై చేసిన పరిశోధన పత్రాలు.
2. విద్యాసాగర్ గుమ్మడవల్లి, రవిశంకర్ పిస్కా, శ్రీను నూతి మరియు పవన్.కె.మనికొండ ఏదులాబాదు రిజర్వాయర్‌పై చేసిన పరిశోధన ఇంటర్నేషనల్ జర్నల్ ఆఫ్ లైఫ్ సైన్సెస్, బయోటెక్నాలజి, ఫార్మారీసర్చ్‌లో ప్రచురించబడిన పరిశోధన పత్రం.



## కీలక పదాలు

**ఆహారపు గొలుసు, ఆహార జాలం, నిచ్, జీవావరణ పిరమిడ్, జీవద్రవ్యరాశి, క్రిమిసంహారకాలు, జైవిక వ్యవస్థాపనం, జైవిక వృద్ధీకరణం, పర్యావరణమిత్ర కార్యకలాపాలు, పర్యావరణ నైతికత, లోహకాలుష్యం.**



## మనం ఏం నేర్చుకున్నాం?

- ఒక జీవినుండి మరొక జీవికి శక్తిప్రసారం ఏ విధంగా జరుగుతుందో ఆహారపు గొలుసు తెలియజేస్తుంది.
- ఆహారపు గొలుసులోని వివిధ ఆహార స్థాయిలమధ్య గల బాణాలు, ఆహారం నుండి దానిని తినే జీవివైపు సూచిస్తాయి. బాణాలు ఆహారాన్ని దానిని తినే జీవికి మధ్య సంబంధాన్ని సూచిస్తాయి.
- జీవుల మధ్య సంబంధాలను శక్తి ప్రవాహాన్ని జీవావరణ పిరమిడ్‌ల ద్వారా తెలియజేయవచ్చు.
- పిరమిడ్ అనునది జ్యామితీయ ఆకారంలో ఉన్న నిర్మాణం.
- సంఖ్యాపిరమిడ్ ఆహారపు గొలుసులో ఒక్కొక్క పోషకస్థాయిలో ఉన్న జీవుల సంఖ్యను తెలియజేస్తుంది.
- జీవ ద్రవ్యరాశి పిరమిడ్ ఆహారపు గొలుసులో ఒక్కొక్క పోషక స్థాయిలో ఉన్న ఆహార లభ్యతను, శక్తి మూలాధారాలను తెలియజేస్తుంది.
- జీవ ద్రవ్యరాశిని జీవ ఇంధనంగా కూడా ఉపయోగించవచ్చు.
- శక్తి పిరమిడ్ ఎల్లప్పుడూ నిటారుగానే ఉంటుంది.
- తెగుళ్ళ నివారణకు పంటలలో ఉపయోగించే క్రిమిసంహారకాలు విషపూరితమైనవి కావడం వలన పర్యావరణానికి హాని కలిగిస్తాయి.
- ఆహార గొలుసులోకి కాలుష్యాలు ప్రవేశించడాన్ని జైవిక వ్యవస్థాపనం అంటారు.
- ఒక పోషక స్థాయినుండి మరొక పోషకస్థాయిని కాలుష్యకారకాలు ప్రవేశించి సాంద్రీకృతం అవ్వడాన్ని జైవిక వృద్ధీకరణం అంటారు.
- అపాయకరమైన ప్రభావాలు లేకుండా అధిక ఉత్పత్తి పొందడానికి పంట మార్పిడి, జీవనియంత్రణ, జన్యుసంబంధ రకాల అభివృద్ధి మొదలైన పద్ధతులు పురుగు మందులకు ప్రత్యామ్నాయాలుగా పనిచేస్తాయి.



## అభ్యసనాన్ని మెరుగుపరచుకుందాం

1. ఆహారపుగొలుసులో ఒక పోషకస్థాయి నుండి మరొక పోషకస్థాయికి బదిలీ అయిన శక్తి ఏమవుతుంది?(AS1)
2. ఆవరణ వ్యవస్థలోని పిరమిడ్లు మరియు ఆహారపు గొలుసులు వేటిని సూచిస్తాయి?(AS1)
3. ఏదైనా ఒక ఆహారపు గొలుసు యొక్క సంఖ్యాపిరమిడ్‌పై లఘుటీక రాయండి. కింద వాటిని ఉపయోగించి గీయబడిన సంఖ్యా పిరమిడ్ నుండి నీవు ఏం గ్రహించావు?(AS1)

   ఎ) చెట్టు  బి) కీటకం  సి) వడ్రంగిపిట్ట

